

కొత్త మంత్రివర్గం 1964 ఫిబ్రవరి 29 వ తేదీన ప్రమాణస్వీకారం చేసిన తరువాత గవర్నరుతో...



ఉత్తమ బాలికా కేడెట్ 1964 సం॥ రానికి ఎన్ ఎ సి బాలికల సీనియర్ వింగ్ ఉత్తమ కేడెట్‌గా ప్రకటించ బడిన సీనియర్ అండర్ఆఫీసర్ రేణుకా రెడ్డి

# ఆంధ్రప్రదేశ్

## ఉగాది సంచిక

సంపుటి : 8 చైత్రం-వైశాఖం
సంచిక : 6 1886 శకం
ఏప్రిల్, 1964

## విషయసూచిక





"పేరు తెలియని స్త్రీ" చిత్రకారుడు : పెకే
[చూ. వ్యాసం 10 వ పేజీ]



ముఖచిత్రం : 'పద్మరాగ జీవన వసంతం'

సంవత్సరం చందా – రు 3–00.
విడి ప్రతి రు. 0–25 నయాపైసలు

# కొత్త ప్రభుత్వంతో సహకరించండి

ఎన్. సంజీవరెడ్డి

నేను ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేయడానికి కారణాలు ఏమిటో అందరికీ తెలుసు. ప్రజాస్వామ్యసిద్ధాంతాన్ని దేశంలో శక్తివంతంగా చేయడానికిగాను రాజకీయ వాదులుగాని, ప్రజలుగాని తీసుకోవలసిన చర్యలలో చట్టాన్ని పాటించి వర్తించడం ముఖ్యమైనది. కాబట్టే, నేను రాజీనామా చేయవలసిన కారణాలు లేకపోయినా, యీ సూత్రాన్ని శక్తివంతంగా పెంచడానికిగాను యీ నిర్ణయం తీలుకోవడం జరిగింది. నేను మీతో మాట్లాడుతున్నప్పుడు గడచిన 30 ఏండ్ల రాజకీయ జీవితం నాకు జ్ఞాపకం వస్తోంది. చిన్న వయసులో కాలేజీ వదలిన తరువాత పెద్దలు, పూజ్యులు ప్రకాశంపంతులుగారు, పట్టాభి సీతారామయ్యగారు మొదలగు పెద్దల సహవాసము నాకు లభ్యమైనది. వారిసేవ చేసే అవకాశం నాకు జీవితంలో తొలుదొల్తగా కలిగింది. వారి ఆశీర్వాదం పొందే అవకాశం కూడ నాకు లభించింది. వారిద్దరు పెద్దలూ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ అధ్యక్షులుగా వున్న రోజుల్లో వారి దగ్గర సంయుక్త కార్యదర్శిగావుండి, కార్యకలాపాలు నేర్చుకోవడం కూడా జరిగింది. అది నాకు జీవితంలో ఎంతో ఉపయోగపడింది. తరువాత, జైళ్ళలో యీ పెద్దల సంపర్కము, ఇతర పెద్దల స్నేహముకూడ లభ్యంకావడంవల్ల నా జీవితం ధన్యమైనదని భావిస్తున్నాను. ఈ విధంగానే స్వరాజ్యానంతరం కూడ ఆ పెద్దల ఆశీర్వాదముతోనే అన్ని కార్యకలాపాలలోకూడ పాల్గొనడం జరుగుతూ వచ్చింది రాష్ట్ర ముఖ్యమంత్రిగా రెండు దఫాలు మీ సేవచెసే అవకాశం లభ్యమైనది. ఉద్యోగంలో ఎంతకాలం ఎవరున్నారని కాక, ఉద్యోగంలోవున్న కొద్దికాలంలో ఎవరు ఏపని చేయగలిగినామని వెనుదిరిగి చూచుకున్నప్పుడు, కొంత తృప్తిగా నేను యీ ఉద్యోగ విరమణ చేయడం జరుగుతోంది. నేను రెండవదఫా ముఖ్యమంత్రిగా వచ్చినప్పుడు తీరని సమస్యలు చాలా మన రాష్ట్రం ఎదుట వున్నాయి. ప్రక్క రాష్ట్రాలతో తగాదాలుగాని, రాష్ట్రంలోవున్న రాజకీయ అలజడి గాని, పరిపాలన సాగిస్తున్న ప్రభుత్వ పక్షంలోవున్న చీలికలుగాని మీ కందరికీ తెలిసిన విషయాలే. గడచిన రెండేళ్ళలో యీ సమస్యలు తీర్చడానికి మీ ప్రథమ సేవకుడుగా శక్తివంచన లేకుండా కృషి చేశాను. దేవుడి దయవల్ల మీ అందరి బలంవల్ల యీ సమస్యలు చాలా భాగం తీరిపోయా యని సగర్వంగా నేను యీనాడు చెప్పగలుగుతున్నాను. ఇటు ఒరిస్సా ప్రభుత్వంతో స్నేహ సంబంధాలు ఏర్పరచుకోవడంద్వారా శీలేరు ప్రాజెక్టు కార్యక్రమం చురుకుగా జరుగుతోంది. దిగువ శీలేరు కార్యక్రమంకూడా త్వరలో ప్రారంభించబోతున్నామని చెప్పడానికి గర్విస్తున్నాను. ఇక మైసూరు, మహారాష్ట్రవారితో స్నేహం పెంపొందించుకోవడం, మనం కోరుకున్న శ్రీశైలం, పోచంపాడుప్రాజెక్టు త్వరలో ప్రారంభించుకోవడం, వాటికి ప్రతి సంవత్సరం లక్షలు, కోట్లలో ఖర్చు చేసి చురుకుగా పని సాగించడం జరుగుతోంది. ఇది మనకెంతో సంతోషకరమైన విషయం.

## త్యాగం అవసరం

మనిషి జీవితంలో ఎవరు ఎన్ని సంసత్సరాలున్నారు అని సంవత్సరాలు లెక్కవేస్తుంటాము. కాని దేశ చరిత్ర వ్రాసేటప్పుడు చరిత్రకారుడు వందల సంవత్సరాలు మాత్రమే గుర్తిస్తాడు. మనం కొద్ది సంవత్సరాలలో కార్యక్రమాలు సాధించలేము. చేయవలసినవి చాలా ఎక్కువగా వున్నాయి, వందల సంవత్సరాలు దాస్యంలో కృంగిపోయిన మనదేశం ఆర్థిక పరిస్థితి ఒక్క పర్యాయం బాగుచేయడం అంత సులభమైన విషయంకాదు. కాని యిప్పుడు మనం చేస్తున్నది పునాదులు. ఈ పునాదుల పైన మన తరువాతి తరములవారు శృంగారమైన భవనాలు నిర్మించుకుంటారు. ఇప్పుడే పేదతనం, యిబ్బందులు పోగొట్టుకుందామనుకుంటే అది గాలిలో కట్టుకున్న మేడలు. మనం చేస్తున్న పనంతా మన ముందుసంతతి వారకి కావలసిన అవకాశములు కల్పించడం మాత్రమే. ఇందులో మనం కొంత నష్టపడవలసి వుంటుంది; కొంత కష్టపడవలసి వుంటుంది. పన్నులభారం మోయవలసి వుంటుంది. కనుక యిపుడు వున్న యిబ్బందులు మర్చిపోవలసి వుంటుందికూడ. తల్లిదండ్రులు తమ పిల్లల పోషణకు తమ రక్తాన్ని ధారవోసి ఆస్థిపాస్థులు అమ్ముకొని ఏ విధంగా కష్టపడతారో ఆ విధంగానే స్వరాజ్యం కోసం పోరాటాన్ని సాగించిన

---

*గమనిక* మంత్రివర్గ పునర్నిర్మాణం దృష్ట్యా "ముఖ్యమంత్రి లేఖను" ఈ నెల ప్రచురించడం లేదు. పునః ప్రచురణ వచ్చేనెల నుంచి –

మనం దేశం ఉపయోగంకోసం,తల్లిదండ్రులు తమ పిల్లలకు చేసినత్యాగం దృష్టికితెచ్చుకొని, యీ తరంవారు కష్టపడి నప్పుడే ముందుతరం వారికి సుఖాలు చేకూర్చగలుగుతాము. మనం యీ పన్నులభారం మోయవలసి వుంటుంది. ప్రణాళికలు జయప్రదంగా సాగించుకోవలసి వుంటుంది. ప్రణాళికలు జయప్రదంగా సాగించుకోవడం అంటే మనం నిర్ణయించు కున్న కార్యక్రమాలను పూర్తి చేసుకోవడ మన్నమాట. ఆ కార్యక్రమాలు మాటలతో సాగవు ఉపన్యాసాలతో ఫలితాలు కలుగవు. కాబట్టి ఢిల్లీ ప్రభుత్వం యిస్తున్న అప్పులే కాక మనంకూడ కొంతభారం మోసినప్పుడే ఆ ఫలితం, సుఖం లభ్యమవుతాయని మీకు మనవి చేస్తున్నాను. అందువల్ల కొద్దిగా పన్నులు వేసుకున్నాము. పన్నులభారం దేశంలో రైతాంగానికి ఎక్కువగా వుందని నాకు తెలియకపోలేదు. నేనుకూడా ఒక రైతునే. నేను ముందు పన్ను కట్టిన తరువాతనే యితరులను పన్నుకటమని అడగవలసి వుంటుంది. నేను ఒకరైతు కుటుంబములో పుట్టడమేగాక నాకు వ్యవసాయం తప్ప వేరే వృత్తి లేదని సగర్వంగా విన్నవించుకుంటున్నాను. ముఖ్యమంత్రి పదవికి రాజీనామా యిచ్చిన తరువాత మా గ్రామం — ఏ భూమిలో పుట్టానో, ఏ ధూళిలో పెరిగానో అక్కడకే చేరబోతున్నానని నేను సగర్వంగా చెబుతున్నాను. ఇది నా వృత్తి. కాబట్టి నేను రైతాంగాన్ని ప్రార్థిస్తున్నాను.

### సత్యాగ్రహం నాడూ - నేడూ

మనం యీ పన్నులు యిచ్చుకోవడం ఎవరికోకాదు. ఈ భారం పెంచినాసరే అత్యవసరంగా చెల్లించవలసివుంటుంది. ఇది మన సమిష్టి దేశ సౌభాగ్యానికి, మన పిల్లలందరి సౌభాగ్యానికి యీ కష్టాన్ని భరించవలసి వుంటుంది. ఈ విషయం తెలిసివుండికూడ కొందరు ఆక్షేపణలు తెలపడం నాకు విచారం కలిగిస్తోంది. అందులో యీ పన్నులు ఎవరో ముఖ్యమంత్రో, రెవిన్యూమంత్రో ఎవరో వేసినవి కావు. ఈ పన్నులు వేయబడేది ప్రజాస్వామ్యములో. నియంతృత్వములో వ్యక్తులు పన్నులు నిర్ణయిస్తారేమోగాని ప్రజాస్వామ్యంపైన విశ్వాసం కలిగిన మనం నిర్ణయించుకున్న శాసనసభ. శాసనసభలో ప్రజలచే ఎన్నుకొనబడిన సభ్యులంతా వున్నారు. మీరందరూ ఎవరికి అధికారం యిచ్చి పంపారో ఆ పార్టీలవారు శాసన సభలో కూర్చున్నారు. నిర్ణయం తీసుకున్నారు. పన్ను విధించారు. తరువాత ప్రభుత్వం దృష్టిలో ఏవో కొన్ని యిబ్బందులున్నాయని తెలియజేసినప్పుడు కొన్ని మాసాలలోపలనే యిబ్బందులు తొలగించడానికి — ఆ సంవత్సరాంతములోనే వేరొక బిల్లు తెచ్చి ఆ లోపాలను సవరించడంకూడా జరిగింది. పన్నులు వేయకూడదనీ, వేసిన పన్నంతా తీసేయాలనీ యిప్పుడు సత్యాగ్రహం పేరుతో అలజడి ప్రారంభించడం నాకు చాలా విచారం కలిగిస్తోంది. సత్యాగ్రహం అనేది స్వరాజ్యానికి పూర్వం గొప్ప ఆయుధం. స్వరాజ్యం రాకపూర్వం ప్రజాభిప్రాయం తెలియజేయడానికి వేరే మార్గంలేదు. అప్పుడు మహాత్మాగాంధిగారు ఆయన పక్షంగా నూటికి 99 ప్రజలువున్నా సరే, ఉన్న కొద్దిమందితో బ్రిటీషువారు దుష్పరిపాలన చేస్తున్న రోజుల్లో వేరేమార్గం లేక ప్రజాభిప్రాయం తెలియజేయడానికి సత్యాగ్రహం ప్రారంభించారు. ఇప్పుడు అట్లాకాదు. ప్రజాభిప్రాయం తెలియజేయడం ఎన్నికలద్వారా, వోటుద్వారా, బేలట్ పెట్టెలద్వారా. అదికాని, వీధుల్లో కేకలు వేయడం ద్వారా, చట్టానికి విరుద్ధంగా ప్రవర్తించడం ద్వారాకాదు. చట్టాలుచేస్తున్న సభ్యులే ప్రజలను రెచ్చగొట్టి యీలాంటి చర్యలు ప్రోత్సహిస్తే దేశంలో ప్రజాస్వామ్యం వుండడం గాని, సజీవంగా వుండడం గాని, చట్టబద్ధంగా రాజ్యాన్ని నడుపుకోవడంగాని జరుగదు. శాసనసభలో ప్రభుత్వ పార్టీని ఓడించండి, ఎన్నికలలో ఓడించండి. ఎన్నికలు కాదు, ఉప ఎన్నికలుకూడా వస్తున్నాయి. అప్పుడప్పుడు.ఈవిధంగా ప్రభుత్వంచేస్తున్న పనులు సరైనవో కావో నిర్ణయించడానికి పలుమార్లు ప్రజలదగ్గరకు పోతుంటాము. ప్రజలు తమ నిర్ణయాన్ని మనకు అందిస్తారు. ఈపద్ధతిద్వారా ప్రభుత్వం చేస్తున్న నిర్ణయాలు తప్పు అని నిర్ణయించడం, ఎన్నికలలో ఓడించడం న్యాయంగా వుంటుందిగాని యిలాంటి విధానాన్ని ప్రోత్సహించడం చాల ప్రమాదకరమని, దేశంలో ప్రజాస్వామ్యం సుస్థిరంగా వుండడం కష్టమని మనవి చేస్తున్నాను.

### చేస్తున్న కృషి

గడచిన రెండేళ్ళలో ఆంధ్రరాష్ట్రంలో ప్రశాంత వాతావరణంలో ప్రభుత్వం పాలిస్తున్న రాజకీయ పక్షంలో, ఇతర పార్టీలు అన్నీ ఉన్న శాసనసభలోకూడ అతిసవ్యంగా జరిపించుకుంటున్నాము. ఇతర రాష్ట్రాలతో పోల్చుకొని చూసుకుంటే ఆంధ్ర రాష్ట్ర శాసనసభ, ఆంధ్ర ప్రజానీకం ఉన్నత స్థానాన్ని అందుకున్నాయని మంచి పేరు సంపాదించింది. పంచవర్ష ప్రణాళికలలో వేసుకున్న కార్యక్రమాలే గాక పంచవర్ష ప్రణాళికలో వేసుకోకపోయినా కొన్ని కార్యక్రమాలు ప్రారంభించవలసి ఉంటుంది. పంచవర్ష ప్రణాళిక మనం వేసుకున్నదే. వేదవాక్యం కాదు. ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం కొన్ని నిర్ణయాలు తీసుకొని, కొన్ని కోట్ల రూపాయలు అదనంగా ఖర్చుచేయడానికి తీసుకున్న నిర్ణయాలు ప్రజానీకానికి తెలిసినవే. బావుల సబ్సిడీలు రైతులకు ఇవ్వడమే కాక, సబ్సిడీలతో బావులు త్రవ్వుకోలేరు కాబట్టి అప్పుగాకూడ 1250 రూపాయలు ఇవ్వవలసిందని ఉత్తర్వులు చేసిన విషయం ప్రజానీకానికి తెలుసు. ముసలివారికి పెన్షనలు — గ్రామాలలో వున్నవారికి 20 రూపాయలు, పట్టణాలలో వున్నవారికి 25 రూపాయలు నిర్ణయించడం, అందుకు 25 లక్షలు కేటాయించడంకూడ మీకు తెలిసిన విషయమే. ఆడపిల్లల చదువు సంధ్యలకు జీతభత్యాలులేవు. పేదవారుగా ఉన్న వారికి స్కాలర్ షిప్పులుకూడ హెచ్చుచేయడం జరిగింది. ప్రభుత్వోద్యోగులలో చిన్న ఉద్యో

(మిగతా 9 వ పేజీలో)

# ఉగాది నాడు

అమరేంద్ర

రివ్వున ఎగిరే కాలవిహంగం
రేయిపవలుల రెక్కలు ముడిచి
క్షణకాలం నా జీవన తరుశాఖమీద వాలింది
విశ్రాంతి కోసం కాబోలు !

అప్పుడే ఇంకొక ఉగాది, స్వప్నాల సస్యాలకు గాది
సాగే బాటలో ఇంకొక మలుపు
మ్రోగే పాటలో మరొక్క తళుకు

ఎన్ని నవ్వుల మెరుపులో
ఎన్ని బాధల వెరపులో
పాత గాథల వగపులో
చేత మలరే వలపులో

ఏమి కొనివచ్చావే ఉగాదిబాలా !
నేటి గుండెల్లో వెలిగే రేపటి జ్వాలా !

వచ్చావా నెరవేరని సంకల్పాల శిథిలాల మధ్యకి
కూలిన ఆశయాల గోపురాల చెంతకి ?
కాలు కదపనీయని పద్మవ్యూహం
కమనీయ దిగంచలాల వాలాలని తీరని దాహం
శిలనైతే వుండకపోను నా కింత కలత
నా పాదాల నాదాల కింత అలత !

కాను నేను దుర్జనుణ్ని
కాని నిజం దుర్బలుణ్ని !
ఇప్పుడే ఓడిపోతానా ?
ఇక్కడే ఆగిపోతానా ?

రమ్యమైన గమ్యానికి దూరంగానే కూలిపోతానా ?
రాతిరథపు చక్రాలకింద శిథిలమందారమునై
తూలిపోతానా ?

ఏమంటుంది సవరించిన తీయని గొంతుతో కోకిలమ్మ
ఏమంటుంది సరికొత్త చివురుల పులకించే వేపకొమ్మ ?
చేతులెత్తి హారతులిచ్చే మోదుగుల కీల
చిరులేత పూతలతో జీవజ్వాల రగిల్చే బాలరసాల

ముసలి ముత్తైదు నీ అవని
ముసిముసి నవ్వులతో ఆమనిలో
నవ వధువులా త్రుళ్లిపడుతున్న దేమిటి ?
ఎక్కడ నేర్చుకు వచ్చాడో వృద్ధభానుడు
ఇంత వెచ్చని తరుణ ప్రణయలీల ?
కుబుసం విడిచిన కోడెత్రాచులా
కులుకుతూ మెరుస్తోంది సృష్టి
కనబడని మందాకినీనదికి వెల్లువ వచ్చిందా ?
మరి ఎక్కడిదీ సౌందర్యవృష్టి
ఎంత విచిత్రం ! నా కనుగొనలలో తొణికే మలిన
బాష్పకణం
నవమౌక్తికమై తళతళ లాడుతోంది
బడలిన నా కాళ్ళకి రెక్కలు వచ్చాయే ? ఏ సిద్ధుడు
అనుగ్రహించా డీ పాదలేపనం !
అదుగో కాలవిహంగం ఎగిరిపోతోంది రివ్వున
చీకటి వెలుగుల రెక్క లారుస్తూ
మహాతరంగం భుజంగంలా బుస్సునపడగ విసురుతోంది,
తురంగంలా కదనులు తొక్కుతోంది
కాసారపు పంకంలో ప్రభవించిన పంకంలో నా మానవ
హృదయం రేకులు విప్పుకుంటోంది మెల్లిగా
అదుగో తెలియని దూరాలనుంచి తేలివస్తోంది
ఆశాభ్రమరం
రా రమ్మని పిలుస్తున్నది జీవిత సమరం !

# రాష్ట్ర బడ్జెటు

కె. బ్రహ్మానందరెడ్డి

**1964-65** రివిన్యూ, ఖర్చు అంచనాలబట్టి, మొత్తం రివిన్యూ రూ. 136.00 కోట్లు. ఖర్చు రూ. 135.85 కోట్లు ఉంటై. మిగులు నామమాత్రంగా రూ. 15.00 లక్షలు ఉంటుందన్నమాట. రాబడి వైపున, ఈ సంవత్సరపు సవరించిన అంచనాలకన్న రూ. 695.35 లక్షల అభివృద్ధి సిద్ధించవచ్చు. ఈ పెరుగుదల లభించగల ముఖ్య పద్దులు—స్టేట్ ఎక్సైజు డ్యూటీలు (రూ. 97.47 లక్షలు), అమ్మకపు పన్ను (రూ 120.00 లక్షలు), స్టాంపులు (రూ. 26.32 లక్షలు), కేంద్ర ప్రభుత్వపు ఎక్సైజు డ్యూటీల్లో రాష్ట్రపు వాటా (రూ. 38.47 లక్షలు), కేంద్ర ప్రభుత్వంనుంచి లభించే సహాయక గ్రాంట్లు (రూ. 428.83 లక్షలు). అయితే ఈ పెరుగుదలలకు ప్రతిగా మరికొన్ని పద్దుల క్రింద తరుగుదలలూ వుంటాయి. 1963-64 లో ప్రవేశపెట్టిన కొత్తపన్ను విధానాల పూర్తి ప్రభావం స్టేట్ ఎక్సైజు డ్యూటీలు, అమ్మకపు పన్ను పద్దుల క్రింద లభించే పెరుగుదలలో ప్రతిబింబిస్తుంది.

ప్రస్తుతపు సర్వీసెస్ నిర్వహణకుపూర్తి కేటాయింపును సమకూర్చటంతోపాటు, బడ్జెట్ ప్రస్తుత సంవత్సరపు బడ్జెట్ అంచనాలకన్న అదనంగా గ్రాంట్లను ఈ విధంగా సమకూరుస్తుంది. రాష్ట్ర హైవేస్ నిర్వహణ (రూ. 44 లక్షలు), జిల్లాపరిషత్తు రోడ్లు (రూ. 33 లక్షలు), హాస్పిటల్స్‌లోని రోగులకు మందులు, ఆహారం (రూ. 35 లక్షలు), ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు (రు.10లక్షలు), ఇద్దరుసభ్యుల సంఘపు సిఫార్సులను అమలుపరిచేందుకై రు. 24.00 లక్షలు అదనంగా కేటాయించబడినై కూడా. వివిధ అకాడమీలకు, క్రీడాసంఘానికి ఇచ్చేగ్రాంట్ల కేటాయింపు రు.5.0 లక్షలనుంచి రు.7.0 లక్షలకు పెంచబడింది. షెడ్యూల్డు కులాల ఇళ్ళ స్థలాలకుగాను రు. 20.0 లక్షలు సమకూర్చబడినయి.

షెడ్యూల్డు కులాలు, జాతులు, ఇతర వెనుకబడిన వర్గాలకు బోర్డింగ్ గ్రాంట్లు, స్కాలర్‌షిప్పులు, మధ్యాహ్నపు భోజనం, కట్టడాలగ్రాంట్లు వీటిక్రింద వచ్చే యేడాది బడ్జెట్‌లో రు. 16.06 లక్షల అదనపు కేటాయింపు చేయబడింది.

ప్రభుత్వ యాజమాన్యం క్రింద వున్న అనాథాశ్రయాలకు (Orphanages) కూడా హరిజన హాస్టల్స్ వగైరాలకు ఇచ్చే రేటు ప్రకారంగానే బోర్డింగ్ గ్రాంట్లను సమకూర్చాలని సూచించబడింది. ఇందునిమిత్తమై బడ్జెటులో రు. 5.0 లక్షలు కేటాయించబడినై.

## ఋణాలు, అడ్వాన్సులు

రైతులనుండి, ఇతరులనుండి ఎరువులు వగైరా ఋణాల బకాయీల వసూళ్ళక్రింద 1963-64 సవరించిన అంచనాల్లో రు 8.91 కోట్ల జమ చూపబడింది. 1964-65 బడ్జెట్ అంచనాల్లో బకాయీలు, ఎరువుల ఋణాలతో సహా తకావీ. తదితరఋణాల వసూళ్ళ క్రింద రు. 16.89 కోట్ల జమ చూపబడింది.

పంపిణీల పద్దుక్రింద, వచ్చేయేడాదికి బడ్జెట్‌లో చేసిన కొన్ని ముఖ్య కేటాయింపులు:—

| | రూ. లక్షలు |
|---|---|
| 1. పురపాలక సంస్థలకు ఋణాలు | 165 |
| 2. Land Improvement and Agriculturists' Loans Act క్రింద వ్యవసాయదారులకు ఋణాలు | 55 |
| 3. ఎరువుల కొనుగోలుకై సహకార సంఘాలకు, పంచదార ఫ్యాక్టరీలకు ఋణాలు | 1,990 |
| 4. సహకార సంఘాలకు, భూమి తనఖా బ్యాంకులకు ఋణాలు | 65 |
| 5. సమాజ వికాస కార్యక్రమంక్రింద ఋణాలు | 140 |
| 6. కొత్తబావుల విరాళ పథకాల ఋణాలు | 125 |
| 7. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర విద్యుచ్ఛక్తిసంస్థకు ఋణాలు | 1,156 |
| 8. గ్రామీణ ప్రజాశక్తిని వినియోగించేందుకై పైలట్ ప్రాజెక్టు క్రింద పంచాయతీ సమితులకు ఋణ సహాయం | 75 |
| 9. తకావీ ఋణాలకు పంచాయతీ సమితులకు అడ్వాన్సులు | 75 |

రాష్ట్ర తృతీయ పంచవర్ష ప్రణాళిక మొత్తం వినియోగం రూ. 305 కోట్లు వుంటుందని మొదట్లో అనుకున్నాం. చిన్న నీటిపనర్లు, భూ సంరక్షణ పథకాలకు

ఇంకెక్కువ ధనాన్ని సమకూర్చేందుకు గాను ఈ మొత్తాన్ని రూ. 312.70 కోట్లకు పెంచడం జరిగింది. మొదటి మూడు సంవత్సరాల్లో సుమారు రూ. 166.22 కోట్లదాకా ఖర్చుపెట్టగల మనుకుంటున్నాం. అప్పుడు రూ. 146.48 కోట్లు మిగులు వుంటుంది. ఈ మొత్తం 1964_65, 1065_66 సంవత్సరాల వినియోగానికి ఉపకరిస్తుంది. 1964_65కు గాను, రూ. 72.54 కోట్ల పథకాన్ని తయారు చేశాం. ప్రణాళికా లక్ష్యాలసాధనకు కావలసిన కనీసపు మొత్తం అన్నమాట ఇది. అయితే, 1964_65లో రాష్ట్రప్రభుత్వాలు, కేంద్ర ప్రభుత్వ మంత్రిత్వశాఖలు సూచించిన వినియోగానికి, ఉన్నవసతులకు మధ్యఉన్న అధికవ్యత్యాసం దృష్ట్యా వచ్చే యేడాది వినియోగాన్ని తగ్గించడం మంచిదని ప్రణాళికా సమితి సలహానిచ్చింది. తత్ఫలితంగా మనప్రణాళిక రూ. 69 35కోట్లకు తగ్గించబడింది. ఇందు మూలంగా 1964_65 చివరకు ఉండే మొత్తం వినియోగం రూ. 235.57 కోట్లకు పరిమితమై, శేషం రూ. 77.13 కోట్లు వుంటుంది. ఇది ప్రణాళిక చివరి సంవత్సరంలో వినియోగం కావాలి. స్థితిగతులను జాగ్రత్తగా పరిశీలించటం జరిగింది. ప్రణాళికను మొదట్లో అనుకున్నట్లే సాగించాలని నిర్ణయించ బడింది. ఎందుకంటె ప్రణాళిక చివరి సంవత్సరంలో రూ. 77.13 కోట్ల వరకు ఖర్చువేగాన్ని పెంచటం చాలా కష్టం అవుతుంది. అందుకని బడ్జెటులో రూ. 72.54 కోట్ల కేటాయింపు చేయబడింది. ఇప్పటి అంచనాల ప్రకారం, వచ్చే యేడాది ప్రణాళిక విషయమై కేంద్ర ప్రభుత్వ సహాయం రూ 43.05 కోట్లకు పరిమితమవుతుంది. ఇక రూ 29 49కోట్ల తరుగును రాష్ట్రం భర్తీచేసుకోవలసి వుంటుంది— ప్రజలదగ్గర అప్పు చేసి, ఉన్న పన్నులను ఇంకాబాగా వసూలుచేసి, ఖర్చులో పొదుపు చేసి — ఈ డబ్బును సమకూర్చుకోవాలి.

కేంద్రప్రభుత్వం ప్రతిపాదించే పథకాలకయ్యే ఖర్చులో కేంద్రప్రభుత్వపు వాటా క్రింద అంచనా వేయబడిన రూ. 6.52 కోట్ల మొత్తం ఈపై అంకెల్లో చేర్చబడలేదు.

## వ్యవసాయం

1960_61లో పశ్చిమ గోదావరిజిల్లాలో ప్రారంభించబడిన తీవ్ర వ్యవసాయ జిల్లా పథకం ఇప్పుడు ఆజిల్లాలోని 25బ్లాకుల్లోనూ అమలు జరుగుతోంది. కార్యక్రమంలో నిర్ణయించుకొన్న పంటలమేర నూటికి నూరుపాళ్ళు ఈ పథకపు ప్రయోజనాన్ని పొందుతోంది, భూమిపరిక్ష పరిశోధన కేంద్రం, వ్యవసాయ కర్మాగారం, నీటి వినియోగ నిర్వహణ—వీటి నేర్పాటుచేసి, 1964_65లో ఈ కార్యక్రమాన్ని ఇంకా తీవ్రతరం చేయటం జరుగుతుంది. ఇదే ప్యాకేజి పథకం కొద్ది మార్పులతో 1963_64లో 10 జిల్లాల్లో, 150 బ్లాకుల్లో ప్రవేశ పెట్టబడింది. వరి, జవార్, రాగి, పంచదార, చెరకు, వేరుశనగ, ప్రత్తి, అరటి, కూరగాయలు - ఇవి పండే ప్రాంతంలో 100 కి 40 పాళ్ళ మేరలో ఉత్పత్తిని అధికం చేయటానికి ఇది తోడ్పడుతుంది.

వ్యవసాయి విశ్వవిద్యాలయపు బిల్లు శాసనసభ క్రితం సమావేశంలో ఆమోదించబడింది. కేంద్ర ప్రభుత్వ సంప్రదింపులతో సమగ్రమైన పథకం రూపొందించబడింది. ఖర్చు రూ. 1¼ కోట్లు వుంటుంది. కేంద్ర సహాయం పొందే వీలుకూడా వుంది.

విశ్వవిద్యాలయ స్థాపన సత్వరంగా జరిగేందుకై కావలసిన ప్రాథమిక కార్యక్రమాలను త్వరగా పూర్తిచేసేందుకుగాను ఒక ప్రత్యేక అధికారిని నియమించటంకూడా జరిగింది. 1964_65 విద్యా సంవత్సరం నుంచి ఈ విశ్వవిద్యాలయం పనిచేయాలని ఉద్దేశ్యం.

సహకార వ్యవసాయం అనేది ప్రత్యేకంగా పరిగణించవలసినట్టి విషయం. ఇప్పటివరకు 91 సంహకార వ్యవసాయ సంఘాలు (39 జాయింట్ వ్యవసాయ సంఘాలు, 52 కలెక్టివ్ వ్యవసాయ సంఘాలు) రిజిస్టర్ చేయబడినవి. వీటిలో 28 సంఘాలు వ్యావసాయిక కార్య కలాపాలను ప్రారంభించినై. రాష్ట్రప్రభుత్వపు వాటాక్రింద 1963_64 వార్షిక ప్రణాళికలో రూ. 3.30 లక్షలు, 1964_65 వార్షికప్రణాళికలో రూ. 6.60 లక్షలు కేటాయించబడినై. 1964_65లో పైలట్ ప్రాంతాల్లో 77 సంఘాలను, ఇతరప్రాంతాల్లో 71 సంఘాలను ఏర్పాటు చేయాలని ఉద్దేశించబడింది.

## పారిశ్రామిక అభివృద్ధి

ఈ ఏడాది హెవీ ఎలెక్ట్రికల్స్ ప్రాజెక్టు, సింథటిక్ డ్రగ్స్ ప్రాజెక్టు వీటిపని చురుగ్గానే సాగిపోయింది. సివిల్ కట్టడాలు నిర్మింపబడుతున్నయ్. సిబ్బందినికూడా నియమించడం జరుగుతోంది. శిక్షణకూడా పొందుతున్నారు. ఇంకెక్కువగా కేంద్ర పారిశ్రామిక ప్రాజెక్టులను రాష్ట్రంలో ఏర్పాటు చేయించాలని రాష్ట్ర ప్రభుత్వం చేసిన ప్రయత్నాల ఫలితంగా, కేంద్ర ప్రభుత్వం మన రాష్ట్రంలో డిఫెన్స్ ఎలెక్ట్రానిక్సు ఫ్యాక్టరీని, హిందుస్తాన్ మెషీన్ టూల్స్ పరిశ్రమకు చెందిన ఒక విభాగాన్ని నెలకొల్పటానికి నిశ్చయించింది. ఈ రెండిటికి కావలసినస్థలంలో చాలా భాగాన్ని సేకరించి, ఈ పరిశ్రమలకు రాష్ట్ర ప్రభుత్వం ఉచితంగా ఇవ్వటంకూడా జరిగింది. బొగ్గుగనుల పరికరాలను తయారు చేసే ఫ్యాక్టరీని

ఒకదాన్ని మన రాష్ట్రంలో స్థాపించాలనే ప్రతిపాదన కేంద్ర ప్రభుత్వ పరిశీలనలో ఉన్నది.

ప్రైవేటు రంగంలో లైసెన్సులను పొందిన కొన్ని పెద్ద ప్రాజెక్టుల విషయంలో కొంత పురోగమనం సిద్ధించింది. రాష్ట్ర ప్రభుత్వం ఈ పురోగతిని పరికిస్తూ ఇంకా ఎక్కువగా ప్రగతి సిద్ధించేందుకై తగిన సౌకర్యాలను సమకూరుస్తోంది. ఆ మధ్య లైసెన్సులు పొందిన కొన్ని నూలు మిల్లు ఇప్పుడు ఏర్పాటవవచ్చునని అనుకుంటున్నాం. రాష్ట్రంలో పరిశ్రమలను నెలకొల్పేందుకై ఈ ఏడాది 21 లైసెన్సులు సంపాదించబడినవి. వీటిలో కొన్ని లైసెన్సులు విద్యుచ్ఛక్తితో నడిచే మగ్గాలకు, వెల్డింగ్ ఎలెక్ట్రోడ్సు, గొట్టాల ఉత్పత్తికి సంబంధించినట్టివి. ఒక కొత్త ఫోర్జ్ యూనిట్టుకు, ఒక సిమెంటు ప్లాంటుకుకూడా డ్రాఫ్ట్ లైసెన్సులు ఇవ్వబడినై.

కొత్తగూడెం, విశాఖపట్నాల్లో ప్రైవేటు రంగంక్రింద ఏర్పాటు కావలసివున్న రెండు ఎరువుల ఫ్యాక్టరీలపని కొంచెం మందగించింది. వచ్చేయేడాది పని చురుగ్గా జరిగేట్టు నిర్వాహకులు చూస్తారని ఆశిస్తున్నాం. విశాఖపట్నంలోని కోరమేండల్ ఎరువుల లిమిటెడ్ పెట్టుబడి ఇష్యూను రు. 75 లక్షల దాకా అండర్‌రైట్ చేయటానికిగాను పారిశ్రామిక అభివృద్ధి కార్పొరేషన్‌కు గ్యారంటీలను ఇవ్వటానికి రాష్ట్రప్రభుత్వం అంగీకరించింది.

ఇటీవల ఏర్పాటుచేసిన కొన్ని సహకార పంచదార ఫ్యాక్టరీలు చెరకు దొరకని కారణాన ఏమంత పురోగమించటంలేదు. ఏమైనా మొత్తంమీదపరిస్థితులు అభివృద్ధిచెందినయ్. మూడు నాలుగు ఫ్యాక్టరీలు గరిష్ఠప్రమాణం ప్రకారం పనిచేస్తున్నయ్. తమతమ ప్రాంతాల్లో కొత్త సహకార పంచదార ఫ్యాక్టరీలను నెలకొల్ప వలసిందిగా వివిధజిల్లాల నుంచి రైతులు దరఖాస్తులు పెట్టుకున్నారు. ఇప్పటివరకు ఆరు దరఖాస్తులను కేంద్ర ప్రభుత్వానికి రాష్ట్రప్రభుత్వం సిఫార్సు చేసింది.

భారీ పరిశ్రమల విషయమై సలహాలిచ్చేందుకై, ప్రభుత్వం ఒక సలహా సంఘాన్ని ఏర్పాటుచేసింది. దానికి మన ముఖ్యమంత్రి అధ్యక్షులు. గౌరవ సభ్యులు కొంతమంది అందులో ఉన్నారు. ప్రభుత్వానికి ఆధిపత్యం లేని పరిశ్రమల్లో ప్రభుత్వానికున్న ధనాన్ని అన్యథా వినియోగించవలసిందిగా ఈ సంఘం సూచించింది. అలా లభించిన మొత్తాన్ని మనరాష్ట్రంలో కొత్తపరిశ్రమలకు వినియోగించాలని దీని ఉద్దేశ్యం. తత్ఫలితంగా, రాష్ట్రాని కావలనున్న పరిశ్రమల్లో పెట్టిన పెట్టుబడిని విక్రయించటానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఇలా వచ్చిన ధనాన్ని కొన్ని నిర్దిష్ట ప్రాజెక్టుల అభివృద్ధికిగాను ప్రభుత్వం పారిశ్రామిక అభివృద్ధి కార్పొరేషన్‌కు సమకూరుస్తుంది. రాష్ట్రంలోని ఆజంజాహి మిల్సులోని ప్రభుత్వపు పెట్టుబడినికూడా ఉపసంహరించాలనే విషయాన్ని ప్రభుత్వం పరిశీలిస్తోంది.

పరిశ్రమల్లో ఫిలింపరిశ్రమ. దీని అభివృద్ధికోసం, తెలుగు చిత్రాలు మనరాష్ట్రంలోనే తయారయ్యేందుకు, స్టూడియోల స్థాపనకుగాను సౌకర్యాలను సమకూర్చటానికి ప్రభుత్వం నిశ్చయించింది. స్టూడియోల నిర్మాణానికి భూమిని సేకరించి, మొదటి రెండేళ్ళపాటు వడ్డీలేనిఋణాలిచ్చి ఆర్థికంగా సహాయపడుతుంది ప్రభుత్వం. ఫీచర్ ఫిల్ము, డాక్యుమెంటరీ, పిల్లలచిత్రాలకు, విద్యాచిత్రాలకు వార్షికంగా రొక్కపురూపంలో బహుమతులు ఇవ్వబడుతున్నయ్. ఇందునిమిత్తమై వచ్చేయేడాడకి తగిన డబ్బు కేటాయించబడింది.

## నీటిపారుదల

పెద్దరకం, మధ్యరకం, చిన్నరకం నీటివసర్ల ప్రాజెక్టులపని చురుగ్గా సాగిపోతోంది. చిన్ననీటివనర్ల విషయంలో పని ఎంతో వేగంగా జరుగుతోంది. పరిశోధన, అమలు జరపటం సత్వరంగా జరుగుతున్నయ్ చిన్న నీటి వనర్ల పథకపు ప్రమాణాన్ని రు 10 లక్షలనుంచి రు. 15 లక్షలదాకా పెంచవలసింపగా కేంద్రప్రభుత్వ ఆహార వ్యవసాయ మంత్రిత్వ శాఖను కోరటమైంది. వారు అంగీకరిస్తే, చిన్ననీటివనర్ల కార్యక్రమానికి ఇంకెక్కువ వేగం లభిస్తుంది. రాష్ట్రంలోని జిల్లాలన్నిటికీ ప్రయోజనాలు లభించేట్టుగా కార్యక్రమాన్ని రూపొందించటం జరిగింది. పంచాయతీ సమితులు, గ్రామపంచాయతీలు ద్వారా ప్రజలు ఉత్సాహంతో ఈ కార్యక్రమాల్లో పాల్గొనటానికి తగిన వసతులు సమకూర్చబడినవి.

విద్య, ఆరోగ్యం, రోడ్లు, వెనుకబడిన వర్గాల సంక్షేమం వగైరా అభివృద్ధిరంగాలకు తగినంతధనాన్ని రెండవ, మూడవ ప్రణాళికల్లో మనం కేటాయించలేకపోయాం. దానికి కారణం, మొత్తం ప్రణాళికా వినియోగంలో విస్తారంగా నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు కేటాయించవలసి వచ్చింది. మూడవప్రణాళిక ముగింపునాటికి ఈ ప్రాజెక్టుపై రూ 90 కోట్లు ఖర్చు అవుతుంది. మొదటిదశ పూర్తిచేయుటానికి నాల్గవ ప్రణాళికలో మరొక రూ. 50 కోట్లను కేటాయించవలసి వుంటుంది. ఇలాంటి భారీ ప్రాజక్టులను ప్రారంభించిన మిగతా రాష్ట్రాలు కూడా కొన్ని ఇలాంటిపరిస్థితిని ఎదుర్కొంటున్నయ్. కాగా ఈ ప్రాజెక్టులు పూర్తి కావటానికి చాలా కాలం పట్టుతుంది. తగినంత రాబడేవుండదు. కాబట్టి ఋణాలకేకాక, వడ్డీ వ్యవహారాలకు కూడా రాష్ట్ర ప్రభుత్వం సర్దుబాటు చేసుకోవలసివుంది. ఇందుమూలంగా మన రివిన్యూ, పెట్టుబడిఖాతాల వసతులపై తాకిడీ బాగా వుంది. క్రితంసారి జరిగిన జాతీయ అభివృద్ధి సమితి సమావేశంలో, మన ముఖ్యమంత్రి, ఇలాంటి ప్రాజెక్టులకయ్యే ఖర్చును రాష్ట్ర ప్రణాళికలకు వర్తింపజేయకుండా వుండాలని కోరారు. ఈ దృక్పథమును ఇతర రాష్ట్రాల ముఖ్యమంత్రులు బలపర్చారు. అంటే కేంద్రమే వీటిని భరించాలి. కేంద్ర ప్రభుత్వం

ఈ విషయాన్ని సానుభూతితో పరిశీలిస్తున్నది.

ఏసంగతీ తేలేదాకా, నాగార్జునసాగర్ ప్రాజెక్టుకిచ్చిన కేంద్ర ఋణాల వడ్డీ వసూలును వాయిదా వేయవలసిందిగా కేంద్ర ప్రభుత్వాన్ని కోరటమైంది.

## విద్యుచ్ఛక్తి

అంతర్రాష్ట్రీయ వ్యవహారాలుగాని, నదీ జల వివాదాలుగాని ఉన్న ప్రాజెక్టులు మినహా, మిగతావాటన్నింటినీ 1-4-1963 నుంచి ప్రభుత్వం ఆంధ్ర ప్రదేశ్ స్టేట్ ఎలెక్ట్రిసిటీ బోర్డుకు అప్పగించింది. కంటిన్యూయింగ్ స్కీములో—ఇవి ప్రభుత్వ బాధ్యత—మచ్‌కండ్ జలవిద్యుచ్ఛక్తి పథకానికి చెందిన ఆరు యూనిట్లు రెండవ ప్రణాళిక ముగింపునాటికి ముందే ఏర్పాటుచేయబడి, విద్యుచ్ఛక్తి ఉత్పాదన ప్రారంభమైంది. ఈ మధ్యనే కొంటూరు ఛానెల్ ఏర్పాటువలన, ఉత్పాదనశక్తి అదనంగా సుమారు 20 మె. వా. కు పెరిగింది. తుంగభద్ర జల విద్యుచ్ఛక్తి పథకం, తుంగభద్ర—నెల్లూరు హైడ్రో థర్మల్ పథకం, వీటి క్రింద ఒక్కొక్కటి 9 మె వా. వుండే 8 హైడ్రో సెట్లు—ఆనకట్టవద్ద 4, కెనాల్ పవర్ హౌస్ (హంపీ) వద్ద 4, నెల్లూరులో 30 మె వా. థర్మల్ సెట్ ఏర్పాటవుతయ్. ఎనిమిది హైడ్రో సెట్లలో నాలుగు రెండవ ప్రణాళిక కాలంలో ఏర్పాటయినై. మిగతా నాల్గింటి విషయంలో పని చురుగ్గా సాగిపోతోంది. ఈ నాల్గింటిలో రెండు 1963-64 లో పనిలోకి వస్తయ్. మిగతావి 1964-65 ప్రారంభంలో పనిచేయ ప్రారంభిస్తయ్. ఎగువ సీలేరు జలవిద్యుచ్ఛక్తి పథకపు సివిలు పనులు అనుకొన్నవిధంగా జరుగుతున్నయ్. "స్విస్ క్రెడిట్" క్రింద యంత్ర పరికరాలకు ఆర్డరు ఇవ్వటమైంది. ఆంధ్ర ప్రదేశ్ ఒరిస్సా ప్రభుత్వాల సంయుక్త పథకమైన బలిమెల ఆనకట్టకుగాను 1963-64 సవరించిన అంచనాలో రూ. 150 లక్షలు కేటాయించబడినై. ఈ పథకాన్ని బలిమెల కంట్రోలు బోర్డు అమలు జరుపుతుంది.

రాష్ట్ర ఎలక్ట్రిసిటీ బోర్డుకు చెందిన కంటిన్యూయింగ్ స్కీములో తుంగభద్ర—నెల్లూరు హైడ్రోథర్మల్ పథకంక్రింద, నెల్లూరులో 30 మె వా సెట్ ఏర్పాటవుతుంది. ఇది 1964 జూన్‌కు వినియోగంలోకి రాగలదని అనుకుంటున్నాం. 132 కె వి. హంపీ గుత్తి—కడప లైన్ ఇటీవలనే వినియోగంలోకి వచ్చింది.

తెలంగాణా హైడ్రో—థర్మల్ పథకం పని బాగా జరుగుతోంది. హుస్సేన్‌సాగర్ బాయిలర్ పనిలో అధికభాగం పూర్తి అయింది. 1964 మార్చిలో బాయిలర్ పని చేయటం ప్రారంభంకావచ్చు. రామగుండం బాయిలర్ పునాది పనులు పూర్తయినై. 1963 డిశంబర్‌లో మిగతా నిర్మాణపు పని ప్రారంభమైంది కొత్తపథకాల్లో కిన్నెరసాని ప్రాజెక్టుపై పని అనుకొన్నట్లు సాగిపోతోంది. కొత్తగూడెం థర్మల్ స్టేషన్ ప్రాథమిక సివిల్ పనులు పూర్తయినై. బాయిలర్ల తయారీకి, స్థాపనకు, వినియోగానికి, అనుబంధ పరికరాలకు జపానులోని మిట్సూయ కంపెనీకి ఆర్డరివ్వటమైనది. టర్బో జనరేటర్స్ విషయంలో టోకియోలోని హిటాచీ లిమిటెడ్‌కు ఆర్డరివ్వటమైనది. రామగుండంలో 60 మె వా. సెట్ స్థాపనకు కావలసిన పరికరాలను కేంద్ర జల విద్యుచ్ఛక్తి సమితి ద్వారా గుత్తకొనుగోలు క్రింద సేకరించటం జరుగుతోంది. హైదరాబాద్-సికింద్రాబాద్ జంటనగరాల్లో విద్యుచ్ఛక్తి కొరతను తగ్గించటానికి ఎర్రగడ్డవద్ద రెండు 10 మె. వా. గ్యాస్ టర్బోసెట్లు ఏర్పాటవ్వాలి. వీటిలో ఒకటి 26-1-1964 న వినియోగంలోకి వచ్చింది.

## సాంఘిక భద్రతా కార్యక్రమాలు

సమాజంలో ఆర్థికంగా వెనుకబడిన వర్గాలవారికి సాంఘిక భద్రతను సమకూర్చే విషయమై ప్రభుత్వం కొంతకాలంనుంచీ ఆలోచిస్తూనే ఉంది. 1963 నవంబరులో కొత్తఢిల్లీలో జరిగిన రాష్ట్ర ఆర్థికమంత్రుల సమావేశంలో ఈవిషయం చర్చకుకూడా వచ్చింది. రాష్ట్రప్రభుత్వం ఈ సాంఘిక భద్రతా పథకాలను ఇటీవలే ప్రకటించింది. వీటిపై సాలుసరి ఖర్చు కోటిరూపాయలు దాటుతుంది.

## స్వర్ణకారుల పునరావాసం

స్వర్ణకారుల పునరావాసానికై వివిధ కార్యక్రమాలను గురించి విచారించేందుకై రాష్ట్రప్రభుత్వం కార్మిక రవాణాశాఖల మంత్రి అధ్యక్షుడుగా ఒకసలహా సంఘాన్ని ఏర్పాటు చేసింది. ఇప్పటివరకు జరిగిన కృషిలో కొన్ని కార్యక్రమాలు. ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజిల్లో స్వర్ణకార నిరుద్యోగులకు ప్రాధాన్యం చూపటం, వారిపిల్లలకు 12వ తరగతిదాకా ఉచితంగావిద్య, ఏడాదికి రూ 20ల పుస్తకాల అలవెన్సు; ఆదాయం రూ. 1800లకు తక్కువ ఉన్నవారికి ఇది వర్తిస్తుంది. జంట నగరాల్లో వీరు చిన్న పరిశ్రమలను నెలకొల్పుకొనేందుకై గ్రాంట్లుగా, ఋణాలుగా ఇవ్వటానికి రూ. 2.5 లక్షలు మంజూరు చేయబడినై. కేంద్ర ప్రభుత్వం మంజూరుచేసిన రూ. 20 లక్షల ఋణంలో, రాష్ట్ర ప్రభుత్వం ఋణాల గ్రాంటుకు రూ. 10 లక్షలను, ఋణపద్ధతి మీద కుట్టుయంత్రాలను సప్లయి చేయటానికి రూ. 4 లక్షలను మంజూరు చేసింది. మిగతా రూ. 6 లక్షలలో ఈ క్రింది పథకాలను ప్రారంభించాలని ఉద్దేశించబడింది.

(1) విజయనగరంలో కాస్ట్ ఐరన్ ఫౌండ్రీ.

(2) పశ్చిమగోదావరి జిల్లాలో పూర్తిగా ఉక్కుతోనే ఉండే వ్యవసాయ ప్లాంట్.

(3) కడపలో రేకు కమ్మరం యూనిట్టు.

(4) వరంగల్‌లో సర్వే పనిముట్లు.

(5) కరీంనగర్‌లో ఫ్యాన్సీ వస్తువులు, నగలు, వెండి ఫిలిగ్రీ పనులు.

స్వర్ణకారుల పునరావాసానికై కేంద్ర ప్రభుత్వం ఇటీవలనే మరొక రూ. 10లక్షల ఋణం మంజూరు చేసింది.

## కరువుభత్యంలో పెరుగుదల

1958, 1961 లో రూపొందించిన జీతాల విధానాల్లోని లోటుపాట్ల విషయమై విచారించేందుకై గతసంవత్సరం ప్రభుత్వం ఆర్థిక శాఖ, ప్రణాళికాశాఖల కార్యదర్శులతో ఒక సంఘాన్ని ఏర్పాటుచేసింది. ఆ సంఘపు నివేదిక ప్రభుత్వపు ఉత్తర్వుతోసహా సభ ముందు ఉంచబడుతుంది. సంఘ సిఫార్సుల మూలంగా అవసంగా అయ్యే ఖర్చు ఏడాదికి రు. 37 లక్షలు ఉంటుంది. బడ్జెట్టుపై తక్షణ ప్రభావం రు. 24 లక్షల దాకా ఉండగలదని అనుకుంటున్నాం. అందుకు తగిన కేటాయింపు చేయబడింది. కొత్త సమస్యలకు తావీయకుండా వున్న లోటుపాట్లను ఈ సంఘం మనస్ఫూర్తిగా కృషి చేసింది. అందుకు నా సంతోషాన్ని ప్రకటిస్తున్నాను.

పెద్ద నగరాలకు, పురపాలక నగరాలకు ప్రస్తుతం పరిమితమైన కాంపెన్సేటరీ అలవెన్సు చెల్లింపు సౌకర్యాలను తాలూకా ప్రధాన కార్యాలయ నగరాల్లోని ఉద్యోగులకు కూడా వర్తింపజేయాలని నిర్ణయించబడింది. ఈ అలవెన్సు పురపాలక నగరాలలో అమలులో ఉన్న రేట్ల ప్రకారం ఇవ్వబడుతుంది. ఇందువల్ల ఏడాదికి రు. 10 లక్షలు ఖర్చు కావచ్చు.

కరువు భత్యపు రేట్లను తాత్కాలికంగా పెంచి, ఆ విధంగా తక్కువజీతాల ప్రభుత్వోద్యోగులకు సహాయపడే విషయం కొంత కాలం నుంచి ప్రభుత్వదృష్టిలో ఉన్నది. యన్. జి. ఓ. లు పదేపదే కోరుతున్నారు కూడా. క్రితం శాసన సభ సమావేశంలో గౌరవ ముఖ్యమంత్రి ఈ విషయాన్ని పరిశీలించేందుకు సిద్ధంగా ఉన్నట్లు ప్రకటించటం గౌరవ సభ్యులకు గుర్తువుంటుంది. నిజానికి అభివృద్ధి కార్యక్రమాలకు భంగం కల్గించని విధంగా ఇందుకు పూనుకోగల ఆర్థిక స్తోమత లేదు. అయినప్పటికీ, ప్రభుత్వం సానుభూతితో పరిశీలించి రు. 150 ల దాకా జీతం ఉన్న ఉద్యోగుల విషయంలో రు. 5 ల పెరుగుదలకు, రు. 151 నుంచి రు. 300 దాకా జీతాలున్నవారి విషయంలో రు. 6 ల పెరుగుదలకు సమ్మతించింది. కరువుభత్యపు ఈ పెరుగుదల స్థానికసంస్థల ఉద్యోగులకూ వర్తిస్తుంది.

ఇది 1964 ఏప్రెల్ ఒకటవ తేదీనుంచి అమలులోకి వస్తుంది ఇందుమూలంగా వెంటనే రూ. 1.84 కోట్లు ఏడాదికి ఖర్చు అవుతుంది. దీనివలన, Compensatory allowance తాలూకా కేంద్రాలకు కూడా వర్తింప చేసినందువలన (Two - man Committee recommendations వల్ల అయ్యే రూ. 24 లక్షల ఖర్చుకాక), రూ. 1.94కోట్ల ఖర్చుఅవుతుంది. అంటే రివెన్యూ కాతాక్రింద అనుకున్న రూ. 15 లక్షం మిగులు, రూ. 1.79 కోట్లు తరుగుగా మారుతుందన్నమాట. ఇక లోటు రొక్కపు నిల్వలోకూడా తదనుగుణంగా వుంటుంది పెరుగుదల.

(రాష్ట్ర శాసనసభలో 1964 ఫిబ్రవరి 21వ తేదీన చేసిన బడ్జెటు ప్రసంగంలోని భాగాలు)

---

(3 వ పేజీ తరువాయి)

గస్తులకు అదనపుభత్యం ఇవ్వడానికి ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం పత్రికలలో చూచే ఉంటారు. ఈవిధంగా పంచవర్షప్రణాళికలో వేసుకోకపోయినా, అదనపు ఖర్చులు పెట్టి ప్రజలకు, రైతులకు, ప్రభుత్వ చిన్న ఉద్యోగులకు సౌకర్యాలు కలుగజేయడానికి ప్రభుత్వం తీసుకున్న చర్యలకు అదనపు ఖర్చులను ప్రజలు మోయవలసి ఉంటుంది.

### ప్రజాసహకారం

ఇదంతా ప్రజాక్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని చేస్తున్న కార్యక్రమం. కాబట్టి ప్రజ సహకారం సంపూర్ణంగా ఇవ్వడం అవసరం. కొత్త ప్రభుత్వానికి కూడ నాకు మీరు ఏ సహకారం ఇచ్చారో అది ఇవ్వండి. వారితో చర్చించండి. ఇబ్బందులుంటే సరిచేసుకోండి. ఇంకా ఏమైనా అవసరముంటే శాసనసభలో చర్చించుకోండి. ఇది సరియైన పద్ధతికాని, యీ పద్ధతులు మానుకొని సత్యాగ్రహం పేరుతో తాలూకా కచేరీలలో, కలెక్టరు ఆఫీసులలో పనులు జరుగకుండా అభ్యంతరం కల్పిస్తూ ఉంటే ఎవరికి నష్టం? మంత్రులకేనా, దేశానికికాదా అని ప్రజలను అడుగుతున్నాను. వీరికి సహకారం ఇవ్వకండి, ఇది మంచిది కాదు. ఇలాంటి పద్ధతులను, ఇలాంటి పనులను ప్రోత్సహించకండి అని ఇంకొకపర్యాయం వినయపూర్వకంగా చెబుతున్నాను. ఇంక, రాష్ట్రంలో ఇంతవరకు రాజకీయ ఖైదీలు అని అవసరంలేకుండా జరుపుకున్నాము. ఎమర్జన్సీ రోజుల్లో జైలులో కొద్దిమందని ఉంచడం జరిగింది. ఇతర రాష్ట్రాలకంటే ముందుగా జైళ్లనుంచి రాజకీయ ఖైదీలను విడుదలచేయడం జరిగింది. పదేళ్లుగా సంచలనం లేకుండా జరుపుకున్నాము. ఇప్పుడు యీ వాతావరణాన్ని మార్చకండి. ప్రభుత్వం జైళ్ళలో రాజకీయ ఖైదీలను పెట్టినదనే అప్రతిష్ఠ ప్రభుత్వానికి రాకుండా చేయగలరని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను.

శాసన సభ ప్రారంభమైంది. మనమందరం శాసనసభలో కూర్చుంటాము. కూర్చుని నిర్ణయాలు తీసుకుంటాము. ప్రజల విశ్వాసం పొందడానికి కావలసిన కార్యక్రమాలు చేస్తున్నాము. ప్రాజెక్టులు పూర్తిచేసుకోడానికి కావలసిన వసతులు కల్పించి–ఇంకా ఎన్నో కార్యక్రమాలు చేసుకోవలసి ఉంటుంది. నేనొక వినతి చేస్తున్నాను. సత్యాగ్రహంపేరుతో చేస్తున్న కార్యక్రమానికి మీరు తోడుగా లేరని నాకు తెలుసు. ఎవరో కొందరు పార్టీ సభ్యులు తప్ప రైతులెవ్వరూ పాల్గొన లేదని నాకు తెలుసు. అందువల్ల ప్రజలందరినీ అభినందిస్తున్నాను. ఇలాంటి చట్టవిరుద్ధమైన చర్యలకు సహకారం ఇవ్వవద్దని ప్రార్థిస్తూ, మీకు సుఖం, జయం కలుగుగాక! ఈ రాష్ట్రం ప్రశాంతమైన వాతావరణంలో ఎంతో ముందుకు పోవుగాక అని నేను దేవుడిని ప్రార్థిస్తూ మీ అందరి దగ్గర సెలవు తీసుకుంటున్నాను.

*[ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంనుంచి 1964 ఫిబ్రవరి 22 తేదీన ప్రసారం చేయబడిన సందేశంనుంచి.]*



# అమెరికన్ చిత్రకళ

కె. దివ్యజ్ఞాన సరోజినీదేవి

*

అమెరికన్ చిత్రకళ రెండువేల అయిదు వందల సంవత్సరముల నాడు ఆదిమ చిత్రకళతో ఆరంభమైనదని చెప్పవచ్చు. కాని నేడు ఆస్ట్రేలియన్ చిత్రకళ వలెనె అమెరికన్ చిత్రకళగా పేరుగాంచినది ఈ ఆదిమ చిత్రకళ గాదు, నాలుగువందల సంవత్సరములనాడు ఆరంభమైన చిత్రకళ మాత్రమే. ఈ రెండవ అమెరికన్ చిత్రకళ కర్తలు పదహారవ శతాబ్దపు ప్రారంభమునందు క్రొంగ్రొత్త ఖండమైన అమెరికాకు వలసవచ్చిన ఐరోపియనులు. అందును ముఖ్యముగా ఆంగ్లేయులు. వారనతి కాలములోనే ఆదిమ వాసులను పారద్రోలి తమ ఆచార వ్యవహారములను, సంస్కృతిని, చిత్రకళను ఆ నూతన ఖండమునందు స్థాపించసాగిరి. ఐకోపియన్ చిత్రకళా సంస్కృతులమీద వారికి వనితలకు పుట్టినింటిపైనుండే యంత వ్యామోహము, మమకారము. ఒకప్రక్క ఈ వ్యామోహము, మరియొక ప్రక్క విన్నూతన ఖండములోని పరిమితియైన సదుపాయములు. ఈ రెండింటి సమ్మేళనమునుండే జనించినవి అమెరికన్ కళాసంస్కృతులు.

ఆస్ట్రేలియాకు వలె అమెరికాకు వచ్చిన మొట్టమొదటి చిత్రకారులు కూడ కేవలము ఆ నూతనఖండమందలి వింతలను, విశేషములను చిత్రించి తమ స్వదేశములైన ఐరోపా ఖండపు దేశములలో ప్రదర్శించుటకు మాత్రమే వచ్చెడివారు. వీరి చిత్రములలో చిత్రకళాకౌసల్య మెక్కువ కానరాదు.

పదిహేడవ శతాబ్దినుండి అమెరికాకు కేవలము చూచిపోవుటకుగాక, అక్కడ స్థిరపడుటకే అనేక చిత్రకారులు రాసాగిరి. వీరు గూడ పెద్ద నైపుణ్యముగల చిత్రకారులు గాదు. అయిననేమి వారు తమ చిత్రకళా వ్యాసంగము నేమాత్రము సంకోచము లేకుండా సాగించెడివారు. వీ రెక్కువగా రూపచిత్రములనే చిత్రించెడివారు ఈ రూపచిత్రములు ఆ వ్యక్తుల యథాతథ రూపచిత్రములు కాకపోయినప్పటికిని కొంతవరకు వారిని పోలియుండెడివి. కానొకొక్కసారి ఒకే చిత్రకారునిచే చిత్రింపబడిన రూపచిత్రములందలి వ్యక్తు లందరు, ఒకే ముఖకవళికలను కలిగి యుండెడివారు. మరియు నా చిత్రములు నిర్జీవముగా నుండెడివి. ఆ చిత్రములందు చిత్రింపబడిన వ్యక్తుల కాళ్లు చేతులు కట్టెలవలె అచేతనముగా వుండెడివి. ఇదే వాటి ముఖ్యలోపము. కానా చిత్రముల విశేష మేమన అందు చిత్రింపబడిన ఆయా వ్యక్తులు ధరించియున్న వస్త్రములను, నగలను, రిబ్బన్లను, వారి తలవెంట్రుకలను మాత్ర మానాటి చిత్రకారు లెంతో సహజముగా చిత్రించెడివారు.

అమెరికాకు వలసవచ్చిన మొట్టమొదటి వా రొకటి రెండు గదుల చెక్క గృహములతోనే సంతృప్తి చెందెడివారు. వారొక్కొక్కసారి వారి గృహములను నారింజ ఛాయగల మట్టితో గిలాబా చేసెడివారు. ఆ కాలమున అమెరికాలోని కొన్ని ప్రాంతములలో యిటుక, చెక్కకన్నను ఖరీదగుటచే బహుళ ప్రచారములో నుండెడివి గావు. అయినను అక్కడక్కడ కట్టడములందు యిటుకలు సైతము వాడబడెడివే. ఈ యిటుకలు పసుపు, నారింజ, ముదురు నీలము, ధూమ్ర, పాటల వర్ణములలో నుండి, చక్కటి ఆకారము లేర్పడునట్లు పేర్చబడెడివి. క్రమముగా పదిహేడవ శతాబ్దపు తుదినాటికి యిటుక లెక్కువగా వాడుకలోకి రాసాగినవి. ఆనాటికే కేవలము రెండుగదుల గృహములే గాక పెద్దగృహముల నిర్మాణము సైతమారంభమైనది.

అమెరికాలో మొట్టమొదట చర్చిలకంత ప్రాముఖ్య తుండెడిది గాదు. నలుచదరపు సభామండపము, దానిపై ఒకగంట గోపురము, యిదే ఆనాటి చర్చి. కాని రానురాను ఈ చర్చిలు కొన్ని ప్రదేశములలో పెద్ద యెత్తున గోతిక్ విధానమున నిర్మించబడసాగినవి. అయినను ఐరోపాలో చర్చి కున్నంత ప్రాముఖ్యత మట్టుకు అమెరికాలో యెన్నడు లేదు.

పదిహేడవ శతాబ్దపు అమెరికన్ కొయ్య సామాను అతిసాధారణముగాను, చేయుటకతి సులభసాధ్యముగాను నుండెడిది. కానా శతాబ్దపు తుదియందీ సామానులు నాజూకుగా ఐరోపియన్ రెనైసాన్స్ శైలిలో పలు సుందర ఆకారములలోను, నగిషీలతోను చెక్కబడ సాగినవి.

ఆనాటి మృణ్మయ, వెండిపాత్రలు సైతము చూచుటకు రమ్యముగానే గాక, యుపయోగించుటకు గూడ అతి సదుపాయముగా చేయబడెడివి. కానీనాడు మిగిలియున్న ఆనాటి పాత్రలు బహు స్వల్పము. ఈ పది

హేడవ శతాబ్దపు మృణ్మయ పాత్రలు యినుకతోగాని, గాజుపొడితోగాని కలప బడిన మెగ్నీసియపు భస్మపు మిశ్రమముతో మెరుగు పెట్టబడెడివి. ఒక్కొక్కసారి మెఱుగు పెట్టే మిశ్రమములో మాంగనీసు, రాగి మొదలగు పదార్థములనుగూడ కలిపెడి వారు. ఇట్టి మృణ్మయ పాత్రలపై వారొక రకమైన తెల్లని పదార్థముతోగాని, పదునైన పనిముట్టుతోగాని చుక్కలు, గీతలు చిత్రించెడివారు.

పదిహేడవ శతాబ్దపు అమెరికాలో బ్యాంకులు మొదలగునవింకా స్థాపింపబడ కుండుటచే, ఆనాటివారు తమ ధనమును వెండిసామానుల రూపములో దాచుకొనెడి వారు. అందుచే ఆనాడు వెండిసామానులకు, అందును ముఖ్యముగా పాత్రలకు బహు గిరాకి యుండెడిది. చర్చిలలో సైతము వెండిసామానుల కెక్కువ వాడుకుండెడిది. ఆనాటి వెండి పనివారందరు సామాన్యముగా ఇంగ్లండునుండి వచ్చినవారే. వారు వెండిపాత్రలను తమ స్వదేశీయ శైలిలోనే తయారు చేసెడివారేగాని, యింగ్లీషు వెండి పాత్రలపై చేయబడేటంత నగిషీపని మాత్ర మీ వెండి పాత్రలపై చేసెడివారు గాదు.

ఆనాటి కమ్మర్లు చేసెడి యినుప సామానులయందు సైతము ఆనాటివారి కళాభిరుచి ద్యోక్తమగుచుండెడిది. ఆనాటి ద్వారబందులు కీళ్ళుగూడ చక్కటి ఆకారములలో తయారుచేయబడుచుండెడివి.

ఆ శతాబ్దమునందు అమెరికన్ గృహములలో వాడబడే వస్త్రములేమి, దుప్పట్లేమి, సమస్తం ఆ గృహిణులే నేసెడివారు. ఇన్ని వస్త్రములు నేయవలసియున్నను వారు విసుగుచెందక యెంతో వోపికతో ఆ వస్త్రములపై ఫలపుష్పములు, పక్షులయొక్క ఆకృతులను చక్కగా నేయుటయో, కుట్టుటయో చేసెడివారు. ఆనాడు కుట్టుపనిలోను, నేతలోనునేర్పరితనము గృహిణులయొక్క ముఖ్యలక్షణమైయుండెడిది.

ఈ విధముగా యిరోపా చిత్రకళను అనుకరించుచు అమెరికాలో పదిహేడవ శతాబ్దమున జన్మించిన చిత్రకళ పదునెనిమిదవ శతాబ్దములో తనదైన ఒక ప్రత్యేకతను కొంతవరకు యేర్పరుచుకొనగలిగినది.

పదునెనిమిదవ శతాబ్దపు తొలి భాగమునకు చెందిన అమెరికన్ చిత్రకారులు కొందరు అమెరికాలోనే పుట్టినవారు, మరికొందరు యిరోపానుండివచ్చి స్థిరపడినవారు. వీరికి గూడ పెద్ద చిత్రకళా కౌసల్యముండెడిదిగాదు. అయినను వీరి చిత్రములం దచ్చుటచ్చట మనము అమెరికన్ చిత్రకళపు ప్రత్యేకతలను చూడగలము. వీరు గూడ సాధారణముగా వ్యక్తుల రూపచిత్రములనే చిత్రించెడివారు. ఈ చిత్రముల ప్రత్యేకత అందు ప్రతిబింబించే యదార్థత, నిరాడంబరత, జీవకళ. మరియు ఆ చిత్రములందు చిత్రింపబడే వ్యక్తులు ప్రత్యేకవ్యక్తిత్వముగల వ్యక్తులుగా చిత్రింపబడెడివారు.



శ్రీమతి 'ఎక్స్'        చిత్రకారుడు : సార్జెంట్.

ఆ శతాబ్దపు తుదియందు అమెరికన్ చిత్రకళలో మరల ఐరోపియన్ రోకో చిత్రకళా ఛాయలు స్పష్టముగా కానరాసాగినవి. అంతటితో మరల అమెరికన్ చిత్రకళలో ఆడంబరత ప్రవేశించసాగినది. అమెరికన్ రోకో చిత్రకారులు వ్యక్తుల ప్రతిరూపములను చిత్రించునప్పుడు ఆయా వ్యక్తుల వస్త్రములకు, అలంకారములకు నెక్కువ ప్రాధాన్యత నిచ్చెడివారు. మరియు వారు తమ చిత్రములందు కనులు మిరుమిట్లుగొలిపే యెఱ్ఱటి యెఱుపు, నీలము, బంగారు వన్నెలనుగాక, గులాబి, లేతనీలము, లేతపసుపు వర్ణముల నెక్కువగా వాడెడివారు.

ఆనాటి అమెరికన్ చిత్రకారులు కేవలము చిత్రపటములనేగాక, పుస్తములందు గాని, పత్రికలందు గాని అచ్చువేయుటకుగాను సంఘములోని వ్యక్తులను విమర్శించుచు హాస్య వ్యంగ్య చిత్రములను గూడ చిత్రించెడివారు.

పదునెనిమిదవ శతాబ్దపు తుదివరకు అమెరికన్ చిత్రకళయందు చిత్రలేఖనమునకున్నంత ప్రఖ్యాతి శిల్పమున కుండెడిది గాదు. అమెరికన్ శిల్పులు ప్రప్రథమముగా కఱ్ఱ, ఱాతి మీదనే చెక్కెడివారు. ఆనాటివారెక్కువగా ఈ శిల్పములను పడవలు, దుకాణములు, సమాధులు, గృహోపకరణములు మొదలగువాటి నలంకరించుటకునూ, బొమ్మలగాను, వాయువువీచెడి దిక్కును సూచించెడి యంత్రములగాను వుపయోగించెడివారు. ఆనాటి శిల్పము కేవలము నిత్యావసరముల అలంకరణ సాధనము. ఈనాడు మన మా పదిహేడు, పదునెనిమిది శతాబ్దముల శిల్పకళ నెక్కువగా సమాధుల యందే చూడగలము. వాటిపై ఆనాటి శిల్పులు సాంకేతిక చిత్రములను చిత్రించి యున్నారు. మరియు, వారు దుకాణముల నలంకరించుటకును, సూచించుటకును వాడెడి శిల్పములకు కంటికి నదురుగా నుండునట్లు పలువర్ణములు పూసెడివారు. ఈ విధముగా ఆనాటి అమెరికన్లకు శిల్పవిద్యయందు కొంత ప్రవేశమున్నను రెవల్యూషన్ పిమ్మటగాని వారు నిజముగా శిల్పవిద్యయందు ప్రావీణ్యత సంపాదించలేక పోయిరి.

పదునెనిమిదవ శతాబ్దపు అమెరికన్ వాస్తుశాస్త్రజ్ఞులు తమ కట్టడములందు యింకను ఐరోపా పద్ధతులనే అవలంబించుచుండిరి. అయినను ఆనాటి అమెరికన్ కట్టడములు అందును ముఖ్యముగా గృహములు కొన్ని ప్రత్యేక అంశములను కలిగి యున్నవి. ఆనాటి వాస్తుశాస్త్రజ్ఞులు గృహముల నిర్మించునప్పుడు వాటి ప్రధానద్వారములకు, పొగగూండ్లకు ప్రధాన్యత నిచ్చెడివారు. ప్రతి గృహమందలి ప్రధానద్వారము నగిషీచెక్కడపు పనితోనో, స్తంభముతోనో అలంకరించబడెడిది. ఆనాడు ప్రధాన ద్వారమునకు గల ప్రత్యేకత గృహములందే గాక, ఆనాటి చర్చిలందు కళాశాలలు, పాఠశాలలందు, ప్రభుత్వపు కట్టడములందు సైతము ద్యోతకమగు చుండెడిది. ఆనాటిగృహములు పదునేడవ శతాబ్దపు గృహముల కన్నా విశాలమైనవి.

ఆ శతాబ్దపు అమెరికనులు చెక్కసామానులందును, వెండిసామానులందును సైతము ఐరోపియన్ శిల్పులనేఅనుకరించుచుండిరి. కానీ అమెరికన్ గృహోపకరణముల ప్రత్యేకత యేమన, అవి ఐరోపియన్ సామానులంత యెక్కువగా నగిషీ చేయబడెడివి గావు వెండి సామానులందున్నంత ఐరోపియన్ అనుకరణ వీరి యితర లోహపు సామానులందు కానరాదు.

ఆనాటి మృణ్మయ పాత్రలు పూర్వ పద్ధతులలోనే గాక క్రొత్త పద్ధతులలో గూడ చిత్రింపబడ సాగినవి. ఆనాటి వారా మృణ్మయ పాత్రలపై యెఱుపు, పచ్చ, తెలుపు వర్ణములలో పలువిధ చుక్కలను, గీతలనేగాక ఫల పుష్పములను, పక్షులను, మృగములను, మానవ ప్రతిమలను గూడ చిత్రింప సాగిరి. మరియు వారీ మృణ్మయ పాత్రలనే యెక్కువ వుష్ణోగ్రతయందు కాల్చి పటిష్ఠమైన కూజాలను, జాడీలను తయారు చేసెడివారు. వాటిని వారు ఱాతి పాత్రలుగా పేర్కొనెడివారు. ఆ పాత్రలపై వారు ముదురు నీలివర్ణముతో అనేకచక్కటి ఆకారములను చిత్రించెడివారు. ఒక్కొక్కసారీ పాత్రలపైననే ముందు పదునైన పనిముట్టుతో కావలసిన చిత్రములను గీసుకొని ఆ గీతలను నీలివర్ణముతో నింపెడివారు.

పదునేడవ శతాబ్దములో అమెరికాయందు ఆరంభమైన గాజుసామాను పదునెనిమిదవ శతాబ్దములో అభివృద్ధి చెందసాగినది. ఆనాటికి గాజుతో కేవలము కిటికీలు సీసాలే గాక పలువిధములైన గాజుపాత్రలు సైతమనేక ఆకృతులలో తయారు చేయబడ సాగినవి. ఆ గాజుపాత్రలు ఈనాటి పాత్రల వలె యిసుకతోగాక ఒక విధమైన చెకుముకి ఱాయిపొడితో తయారుచేయబడుతుండెడివి. అవి పలువర్ణములలో నుండెడివి గాని, ముదురు నీలపు గాజు పాత్ర లెక్కువగా వాడుకలో నుండెడివి. వీటిపై అప్పుడప్పుడు ఆనాటివారు యెనామిల్ వర్ణములతో చక్కటి చిత్రములు సైతము చిత్రించెడివారు.

ఆనాటి అమెరికన్ గృహిణులకు తమ గృహములకు కావలసిన వస్త్రములన్నీ తామేనేయవలసిన అవసరము లేకపోవుటచే నేసెడి కొలది వస్త్రములనే పలువిధ మాదిర్లతో చక్కగా నేసెడివారు. వీరు

కుట్టుపనియందుగూడా బహు ఆశక్తి, శ్రద్ధ చూపెడివారు.

అమెరికాలో పదునెనిమిదవ శతాబ్దపు తుదియందు రెవల్యూషన్ వచ్చినది. అంతటితో అమెరికన్ చిత్రకళ ఐరోపా అనుకరణననెడి పొరలను తొలగించుకొని వినూతన శోభతో రంగములో ప్రవేశించినది. దీనితో అమెరికన్ చిత్రకళలో మరొక క్రొత్తశక మారంభమైనది. అమెరికన్ చిత్రకారులు తమకు ఐరోపా చిత్రకళందలి వ్యామోహము పోవటముతోనూ, ప్రత్యేకముగా అమెరికన్ చిత్రకళఅనునది యింకను ఒకటి యేర్పడకపోవటము వలనను తమకు వచ్చిన ప్రాచీన చిత్రకళలన్నింటిని తమ శీతోష్ణకాల పరిస్థితులకుతగినట్లు అనుకరించసాగిరి. ఈఅనుకరణ ఒక అరశతాబ్దకాలము గానసాగినది. ఇట్టి వివిధ దేశపు చిత్రకళల అనుకరణ, సంయోగములనుండే జనించినది స్వచ్ఛమైన అమెరికన్ చిత్రకళ.

రెవల్యూషన్ పిమ్మట అమెరికన్ చిత్రకారులు పూర్వపు చిత్రకారులవలె చిత్రకళా కౌశల్యము లేనివారు గాదు. వీరు విదేశములలోని ప్రఖ్యాతిగాంచిన కళాకేంద్రములలో శిక్షణ పొంది, ఐరోపా దేశములు పర్యటించి, అక్కడి చిత్రకారులను కలుసుకొని, వారి చిత్రములను పర్యవేక్షించి, పదిమందితో చిత్రకళను గురించి చర్చించి చిత్రకళా కౌసల్యముతోపాటు చిత్రకళాను భవము గూడ సంపాదించిన వృద్ధులు. రెవల్యూషన్ పిమ్మట చరిత్ర సంబంధమైన చిత్రములపై అమెరికనులకు వ్యామోహమెక్కువైనది. ఈ చిత్రములను ఆనాటి చిత్రకారులు సహజముగాను, మనోహరముగాను, వుండునట్లు యెంతో నేర్పుతో చిత్రించెడివారు. ఆ చిత్రపటములందు చిత్రింపబడిన వ్యక్తుల ముఖములలోను,



స్నానం చిత్రకారుడు : కెస్సట్

వారు నిలుచుని, లేదా కూర్చునియున్న భంగిమలలోను భావము, వ్యక్తిత్వము ద్యోతకమగుచుండెడివి; మరియు ఆ చిత్రములు చిత్రించుటకు వాడిన వర్ణములందు సైతము భావము ప్రతిబింబించుచుండెడిది. అయినను ఆచిత్రములందు, ఆనాటి చిత్రకారులు భావమునందుగల వ్యామోహము సహజ చిత్రీకరణయొక్క కట్టుబాట్లను మాత్రము దాటిపోకుండ చూసుకొని యున్నారు. ఇదే పంతొమ్మిదవ శతాబ్దపు వ్యక్తుల యథాతథ రూపచిత్రములందలి ప్రత్యేకత.

ఈ విధముగా పంతొమ్మిదవ శతాబ్దపు అమెరికాలో ఒక ప్రక్క చిత్రకళా కౌశల్యముగల చిత్రకారులు తమ చిత్రకళా వ్యాసంగము సాగించుకొనుచుండ, మరియొక ప్రక్క కొందరు చిత్రకారులు చిత్రకళను ప్రసిద్ధిగాంచిన పాఠశాలలందు నభ్యసింపక పోయినను కేవలము చిత్రకళందుండే వ్యామోహముతో తమంతటతామే చిత్రములు చిత్రించసాగిరి. వీరి చిత్రకళ నేడు 'అమెరికన్ జానపద చిత్రకళగా' పేర్కొనబడుచున్నది. వీరుగూడ వ్యక్తుల యథాతథ రూపచిత్రములను చిత్రించెడివారేగాని, ఆ చిత్రములందు అతిస్వల్ప విషయములను గూడ అతివివరముగా చిత్రించెడివారు. ఉదహరణకు ఒకవ్యక్తి రూపచిత్రము చిత్రించునప్పుడు, ఆ జానపద చిత్రకారులు

ఆ వ్యక్తి కూర్చునియున్న కుర్చీని, అందు గల నగిషీని, కుర్చీక్రింద పరచియున్న కంబళిని, అందు నేయబడిన బొమ్మలను అతి వివరంగా చిత్రించెడివారు.

ఈ శతాబ్దమునందే అమెరికాలో ప్రకృతి చిత్రములుగూడా బహుళ వ్యాప్తిచెంద సాగినవి. ఆనాటి ప్రకృతి చిత్రకారులు ప్రకృతిని వున్నదున్నట్లుగా గాక భావోక్తముగా చిత్రింపసాగిరి. కొందరు చిత్రకారులు కల్పిత, అద్భుత, ప్రణయ సంబంధమైన ప్రకృతి చిత్రములు చిత్రింపసాగిరి. మరికొందరు సాంకేతిక ప్రకృతి చిత్రములు చిత్రింపసాగిరి. మరికొన్ని ప్రకృతి చిత్రములలో ఆధ్యాత్మిక సంబంధమైన చింతనలు గూడ కానవచ్చెడివి.

1830నుండి అమెరికన్ చిత్రకళలో సామాన్యప్రజల నిత్యజీవితమునకు సంబంధించిన చిత్రపటముల చిత్రీకరణ గూడా ఆరంభమైనది. ఆ చిత్రములందు ఆనాటి చిత్రకారులు అమెరికన్ల నిత్య జీవితమునే గాక, రెడ్ యిండియన్ల నిత్యజీవితమును సైతము చిత్రించియున్నారు. ఈచిత్రములు బహు సహజముగాను, భావోక్తముగాను వుండెడివి. ఆ కాలమునందే అమెరికన్ చిత్రకారులు నిర్జీవ వస్తువుల యథాతథ చిత్రములుగూడ చిత్రింప నారంభించిరి. ఇవి గూడ నతి సహజముగా నుండెడివి.

అమెరికాలో మతమునకు ఐరోపాలో వున్నంత ప్రాముఖ్యతలేదు. అందుచే వీరి చిత్రములందు మతసంబంధమైన చిత్రములు బహుస్వల్పము. ఆ వున్న మతసంబంధమైన చిత్రములు సైతము అమెరికన్, ఆదిమ చిత్రకళల సంయోగమునుండి వుద్భవించిన జానపద చిత్రకళా విధానమున చిత్రింపబడినవే. ఈ జానపద చిత్రకళ ఆనాడొక చిత్రకళగా యేమాత్రము గుర్తింపబడెడిదిగాదు.

పంతొమ్మిదవ శతాబ్దపు మధ్యభాగము నాటికి అమెరికాలో చిత్రకళా సంబంధమైన కళాశాలలు, ప్రదర్శనశాలలు అనేకము వెలసినవి.

అమెరికన్ సివిల్‌వార్ పిమ్మట చిత్రకళలో కొంత కాలము స్తబ్దత వ్యాపించినను, మరల పెద్ద భేదములు లేకుండానే అమెరికాలో చిత్రకళ కొనసాగినది. ఆనాటి గృహాలంకారమునందు చిత్రపటములు తప్పనిసరగుటచే చిత్రపటముల వెలయెక్కువ కాసాగినది. ఆనాటి చిత్రకారులు గూడ పూర్వ చిత్రకారులవలెనె వ్యక్తుల రూప చిత్రములను చిత్రింపసాగిరి. కానీ చిత్రములు భావోక్తముగా నుండుటేగాక, అందు చిత్రింపబడే వ్యక్తులు సైతము తమ ప్రియమైన పరిసరములలోనో, లేదా రమ్యము, భావోక్తమైన పరిసరములలోనో చిత్రింపబడెడివారు. మరియు ఆ చిత్రకారులు పూర్వము వలెనే ప్రకృతి చిత్రములను సైతము చిత్రించెడివారే గాని ఆ ప్రకృతి చిత్రములు కేవలము కల్పిత, అద్భుత, ప్రణయ సంబంధమైన ప్రకృతి చిత్రములే గాక సామాన్య ప్రకృతి చిత్రములు గూడానై యుండెడివి. ఇంకను, వారి నిత్యజీవితమునకు సంబంధించిన చిత్రములందు సైతము ఒక నూతనత్వము ప్రవేశించినది. ఆ చిత్రములలో కొన్ని, యేదోవొక ఘట్టమునేగాక గాథలను సైతము వ్యక్తపరిచెడివి. ఇట్టి చిత్రములు పంతొమ్మిదవ శతాబ్దపు తుది వరకు బహుళవ్యాప్తిలో నుండసాగినవి. వీరి నిర్జీవ వస్తువుల యథాతథ చిత్రములందు సైతము భావము ప్రతిబింబింప సాగినది.

పంతొమ్మిదవ శతాబ్దపు తుదినాటికి అమెరికన్ చిత్రకళలో యింప్రషనిజమ్ చోటు చేసుకొన సాగింది. చిత్రపటములు అందు చిత్రింపబడిన వ్యక్తుల కోసరముగాని, ప్రకృతి కోసరముగాని, సన్నివేశముల కోసరముగాని గాక, కుంచెలతో నవి చిత్రింపబడిన విధానమునుబట్టి విలువ కట్టబడెడివి. క్రమ క్రమముగా యిరువదవ శతాబ్దము నాటికి అమెరికన్ చిత్రకళలో అధునాతన చిత్రకళాఛాయలు ప్రవేశించ సాగినవి.

ఆ శతాబ్దమునందు ఛాయా చిత్రములు సైతము చిత్రపటములుగనే పరిగణింపబడెడివి. ఈ ఛాయా చిత్రములు కుంచెతో చిత్రింపబడిన చిత్రములవలె నుండుటకై గఱుకు కాగితముపై ముద్రింపబడెడివి.

అమెరికాలో జానపద శిల్పముగా నారంభమైన శిల్పము పంతొమ్మిదవ శతాబ్దకాలము నాటికి ఆ దేశ చిత్రకళందు ఒక విశిష్టస్థాన మాక్రమించుకో గలిగినది. ఆనాటి శిల్పము మూడు విధములుగా నుండెడిది. ఒకటి జానపద శిల్పములు, రెండు యథాతథ రూప చిత్రములు, మూడు జ్ఞాపకార్థ చిహ్నములుగా నుపయోగించబడెడి అతి సహజ శిల్పములు. రెవల్యూషన్ పిమ్మట క్రొత్త కట్టడముల నిర్మాణముతోపాటు, ఆ కట్టడముల నలంకరించుటకై ప్రఖ్యాత పురుషుల శిల్పములకు జ్ఞాపకార్థ చిహ్న శిల్పములకు గిరాకీ యెక్కువవసాగినది. ఇట్టి శిల్పములలో జార్జి వాషింగ్టన్ శిల్పము ప్రప్రథమము.

పంతొమ్మిదవ శతాబ్ది ఆరంభమునందు అమెరికన్ శిల్పులు ఐరోపా దేశములకు శిక్షణార్థముపోయి, తిరిగి తమ స్వదేశమునకు వచ్చి గ్రీకు మొదలగు శిల్పములననుకరించుచు తమ శిల్పములను మలచ సాగిరి. 1830 నుండి 1850 వరకు అమెరికన్ చిత్రకళందు శిల్పము యేకచ్ఛత్రాధిపత్యము వహించినది. ఆ వత్సరములందు చిత్రలేఖనపు ప్రాముఖ్యత తగ్గిపోయినది. ప్రజలు చిత్రలేఖనము కన్నను శిల్పమునకే ఆర్థికముగా నెక్కువ దోహద మివ్వసాగిరి. దానితో ఆనాటి యువకులు చిత్రలేఖనము కన్నను శిల్పమునే యెక్కువుగా వృత్తిగా

చేసుకొనసాగిరి. ఈ విధముగా ఆనాటి శిల్పము బహుళ ప్రచారములో నున్నను, ఆనాటి చిత్రలేఖనములో వున్న విశిష్టత దీనిలో కానరాకపోవటము శోచనీయము. ఇందుల కానాటి చిత్రలేఖులు శిల్పులవలె ధనముకోసరముగాక, చిత్రలేఖనమును కేవలము చిత్రలేఖనము కోసర నువలంబించుటయే కారణమై యుండవచ్చు.

అమెరికాలో పంతొమ్మిదవ శతాబ్దము నందు సైతము జానపద శిల్పములు బహుళ వ్యాప్తిలో నుండెడివి. ఈ శిల్పములు సాధారణముగా చెక్కతోచేయబడి వర్ణములు పూయ బడెడివి. వీటి నానాటివారు తమ పడవలను, దుకాణములను, పూతోటలను నలంకరించుటకు వుపయోగించెడి వారు. ఇందు పడవల కుపయోగించెడి శిల్పములు కొంతవరకు ప్రాచీన గ్రీకుశిల్ప శైలిలో మలచ బడెడివి. ఇవి సాధారణముగా స్త్రీ ప్రతిమలై యుండెడివి. అప్పుడప్పుడు వారు సముద్ర సర్పములు, బెడిస చేపలు, మొదలగువాటి ప్రతిమలను గూడ మలచెడి వారు. దుకాణముల నలంకరించుటకు మలచెడి శిల్పములందు వారు రెడ్ యిండియనుల రూపములను గూడ చెక్కెడివారు. ఈ జానపద శిల్పములందు మత సంబంధమైన శిల్పములు కూడా కొన్ని వుండెడివి. వాటియందలి కొన్ని క్రీస్తుభగవానుని ప్రతిమలను వస్త్రములతోనూ, నిజమైన వెంట్రుకలతోనూ అలంకరించెడివారు. కానానాటి అమెరికాలో శిల్పులుగా శ్లాఘింపబడినది వ్యక్తుల ప్రతిరూపములు, విలువెత్తు శిల్పములు చేసెడి శిల్పులేగాని జానపదశిల్పులు మాత్రము గాదు. ఆ శిల్పులు ఈ జానపద శిల్పులకన్నను సహజముగా తమ శిల్పములను మలచెడివా రనునదిమాత్రము నిజము.

పంతొమ్మిదవ శతాబ్దపు పూర్వభాగమున పాలరాతి శిల్పము లెక్కువగా వాడుకలో నుండెడివి. ఇందుల కానాటివారికి గ్రీకు మొదలగు ప్రాచీన శిల్పములందుగల వ్యామోహమే కారణము. సివిల్‌వార్ పిమ్మట లోహపు శిల్పములు గూడ బహుళ ప్రచారము పొందసాగినవి. ఆ కాలమందే కేవలము వ్యక్తుల ప్రతిరూప శిల్పములే గాక సామాన్యజీవుల నిత్య జీవితమునకు సంబధించిన శిల్పములుగూడ మలచబడ సాగినవి. అక్కడక్కడ నగ్నమానవ శిల్పములు, సాంకేతిక శిల్పములు సైతము కానరాసాగినవి. ఈ శిల్పములన్నిటియందు సహజత్వము, భావము ప్రతిబింబించెడివి. ఒకొక్కప్పుడు ఈ సహజత్వము శిల్పములందు అతిగా కూడ వుండెడిది. ఇది అమెరికన్ శిల్పముల ప్రత్యేకత.

పంతొమ్మిదవ శతాబ్దపు అమెరికన్ వాస్తుశాస్త్రమందు ఆ నాటి అమెరికనులకు ప్రాచీన చిత్రకళల పట్లగల వ్యామోహమును స్పష్టముగా చూడగలము. ఆ నాటి అమెరికనులు తమ కట్టడములందు గ్రీకు, రోమన్, ఈజిప్షియన్, ఓరియంటల్, గోతిక్ పద్ధతుల అనుకరణతో నారంభించి యిటాలియన్, ఫ్రెంచి, స్పానిష్ పద్ధతుల అనుకరణతో ముగించిరి. ఈ అనుకరణలోని ముఖ్యాంశ మేమన వారా పద్ధతులను తమ శీతోష్ణకాల పరిస్థితులకు తగినట్లు మార్పు జేసుకొని అనుకరించియున్నారు. ఉదాహరణకు గ్రీకు కట్టడములు, చలువరాతితో నిర్మింపబడిన కట్టడములు. మేడలు, కిటికీలు వుండెడివికావు. స్తంభము లెక్కువగా నుండెడివి. అందుచేత అమెరికనులు తమ కట్టడములను గ్రీకు శైలిలో నిర్మించు నప్పుడు, ఆ కట్టడ మెన్ని అంతస్థులదైనను దూరమునుండి చూచునప్పు డట్లగపడకుండు నట్లుగను, స్తంభముల మయముగా నుండు నట్లును నిర్మించెడివారు. కిటికీలకు ప్రాధాన్యత నిచ్చెడివారుగాదు. మరియు, ఆ కట్టడము లేపదార్థముతో నిర్మింపబడినప్పటికి పైకి చలువరాతివలె కన్పడునట్లు పైపూతలు పూసెడివారు.

ఆ శతాబ్దపు తుదియందు వాస్తు శాస్త్రమున ఈ ప్రాచీనకళల అనుకరణ క్రమముగా కనుమరగవసాగినది. ఆనాటికి అమెరికన్ వాస్తు శాస్త్రము తనదైన ప్రత్యేకత నొకటిని యేర్పరుచుకొనగలిగినది. ఈ అమెరికన్ కట్టడముల ప్రత్యేకత వాటి విశాలత యెత్తు. ఏడంతస్థులు మొదలు పదహారంతస్థులు సైతము వుండెడివి. కట్టడములు వీటి మరియొక ప్రత్యేకత. నవి ఐరోపియన్ కట్టడములవలె నగిషీలతో గాక, అతిసాధారణముగా వుండెడివి. సాధారణతలోనే సౌందర్య ముండగలదన్న నూతన భావమును వాస్తు శాస్త్రములో ప్రవేశపెట్టినది వీరు.

పంతొమ్మిదవ శతాబ్దమునకు చెందిన అమెరికన్ చెక్కసామాను, వెండిసామాను, మృణ్మయ, గాజు పాత్రలు, నేత వస్త్రములు, కుట్టుపని, మొదలగు వాటియన్నిటియందును నేడు మనము గ్రీకువంటి ప్రాచీనకళల ప్రభావము చూడగము. ఆ శతాబ్దపు తుది యందు యంత్రముల రాకతో అమెరికాలో ప్రాచీన చిత్రకళల అనుకరణకు స్వస్తి చెప్పబడసాగినది. ఈ యంత్రసాహాయముతో తయారుచేయబడే సామానులందు, అందముకన్నను ఉపయోగమే ముఖ్య అంశముగా భావింపబడెడిది. ఈ శతాబ్దములో గాజు, గాజు సామానులు గూడ విరివిగా వాడబడసాగినవి. ఈ గాజు సామానులు పలువిధ ఆకృతులలో తయారుచేయబడసాగినవి.కట్టడములందుపయోగించెడి టైల్సు కూడ బహుళప్రచారము పొందసాగినవి.

ఈ విధముగా పదిహేడవ శతాబ్దమున ఐరోపా చిత్రకళల అనుకరణతో ఆరంభమైన అమెరికన్ చిత్రకళ పదునెనిమిదవ శతాబ్దములో ఈ అనుకరణ నుండి వైదొలగాలని ప్రయత్నించినది. ఆ శతాబ్దపు తుది యందు ఆ ప్రయత్నములో సఫలీకృతమైనది గాని, మరల వెంటనే ప్రాచీన చిత్రకళల ప్రభావమునకు లొంగిపోయినది. పంతొమ్మిదవ శతాబ్దపు మధ్యకాలమున మరల కనులు విప్పిన అమెరికన్ చిత్రకళ అనుకరణలకు స్వస్తిచెప్పి, తనదైన ఒక ప్రత్యేకత నేర్పరుచుకొనసాగినది.ఇరువదవ శతాబ్దము నాటికి అమెరికన్ చిత్రకళలో మరల అధునాతన చిత్రకళా ఛాయలు గోచరింపసాగినవి.



# మాచ్ ఖండ్ - సీలేరు నదీలోయ అభివృద్ధి

వెలుగు బాటలు

సీలేరు నదిని మాచ్ ఖండ్ అని కూడా అంటారు. ఇది 170 మైళ్ళ పొడవున ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాల మధ్య సరిహద్దుగా వుంది. ఈ నది తూర్పు కనుమలలో సుమారు 5000 అడుగుల ఎత్తు నుంచి తూర్పుకనుమల పశ్చిమ ఏటవాలు ప్రాంతంలో బయలుదేరుతుంది. దీని ఆరగాణి విస్తీర్ణం 2,465 చ.మైళ్ళు. ఈ నది గోదావరి ఉపనదులలో ముఖ్యమైనదైన శబరిలో మోటు అనే గ్రామంవద్ద కలుస్తుంది.

ఈ ఆరగాణి ప్రాంతంలో వార్షిక వర్షపాతం 55 అంగుళాలు. సీలేరు నది మార్గమధ్యంలో "డుడుమ జలపాతం" వద్ద 550 అడుగుల ఎత్తునుంచి ప్రవహిస్తుంది. గుంటవాడ, పొట్లూరు గ్రామాల సమీపంలో ఇది రెండు ధారలుగా వరుసగా 260 అడుగులు, 350 అడుగుల ఎత్తుమీది నుంచి వడిగా క్రిందికి ప్రవహిస్తుంది. ఇవి 'యు' ఆకృతిలో 4 మొదలు 5 మైళ్ళ పొడవున వుంటాయి. భారీఎత్తున నీరు నిలువచేయడానికి జలాశయాలు నిర్మించడానికి ఈ లోయ అనువైనది. ఆరగాణి ప్రాంతంలో వర్షపాతం అధికం కావడం వల్ల, నది మార్గమధ్యంలో ఎత్తుమీది నుంచి ప్రవహిస్తుండడంవల్ల, పెద్ద జలాశయాలను నిర్మించడానికి అనువైన స్థలాలు వుండటంవల్ల సీలేరు నది మితవ్యయంతో జలవిద్యుచ్ఛక్తిని అభివృద్ధి పరచడానికి చాలా అనుకూలమైనది.

జల విద్యుచ్ఛక్తి అభివృద్ధికి ఈ నదిని ఉపయోగించుకోవడానికి ఈ శతాబ్ది నాల్గవ దశాబ్దం నుంచీ ప్రయత్నాలు సాగుతున్నాయి. వీటి ఫలితంగా డుడుమ జలపాతాల వద్ద 1946వ సంవత్సరంలో మద్రాసు (ఇప్పుడు ఆంధ్రప్రదేశ్), ఒరిస్సారాష్ట్రాల సంయుక్తాధ్వర్యం క్రింద "మాచ్ ఖండ్ జలవిద్యుత్ పథకం"అనే పేరుతో విద్యుదుత్పత్తి కార్యక్రమం చేపట్టబడింది. ఈ విషయంలో పై రెండు రాష్ట్రాలు, పథకానికయ్యే ఖర్చులనూ, దానివల్ల సిద్ధించే ప్రయోజనాలనూ 70 : 30 నిష్పత్తిలో పంచుకోవడానికి ఒక ఒప్పందం కుదుర్చుకున్నాయి, ఈవిధంగా ఈ రాష్ట్రంలో తొలి జలవిద్యుత్ ప్రాజెక్టు ఏర్పడి రాష్ట్రంలో జలవిద్యుచ్ఛక్తి అభివృద్ధి శకానికి శుభారంభం చేసింది. 51,000 కి. వా. ల విద్యుదుత్పత్తికై ఈ ప్రాజెక్టు తొలిదశకు 1955వ సంవత్సరంలో రాష్ట్రపతి స్వర్గీయ డాక్టరు రాజేంద్రప్రసాద్ ప్రారంభోత్సవం చేశారు. రెండవదశ క్రింద రూ. 18.5 కోట్ల ఖర్చుతో విస్తరణ కార్యక్రమాలను అమలుజరిపి ఉత్పాదక శక్తిని 1,15,000 కి. వా. లకు పెంపొందించారు. ఈ ప్రాజెక్టునుంచి లభించే విద్యుచ్ఛక్తి, విశాఖపట్నం జిల్లాలలోని గనుల త్రవ్వకం, నౌకా నిర్మాణం, తైల పరిశ్రమలకూ, కొరాపుట్ జిల్లాలోని 'మిగ్' ఫ్యాక్టరీకి చెందిన నూత్న రక్షణ సంస్థకూ, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలోని వివిధవ్యవసాయ, పారిశ్రామిక సంస్థలకూ ఉపయోగిస్తున్నది. ఇంతేకాక ఇది గ్రామాల స్వరూపాన్ని చాలావరకు మార్చివేసింది. నూనె దీపాలస్థానే విద్యుద్దీపాలు వెలిశాయి. వ్యవసాయ పనులకు పశువుల స్థానాన్ని విద్యుత్ యంత్రపరికరాలు ఆక్రమించాయి.

## ఎగువ సీలేరు ప్రాజెక్టు

మాచ్ ఖండ్ ప్రాజెక్టు. సమీపంలో గుంటవాడ గ్రామందగ్గర 'యు' ఆకృతి వంపువద్ద విద్యుచ్ఛక్తిని అభివృద్ధి పరిచేందుకు ఎగువ సీలేరు ప్రాజెక్టును చేపట్టారు. అప్పుడు కేంద్ర జలవిద్యుత్ సంఘం సభ్యులుగావున్న ప్రస్తుత కేంద్ర విద్యుచ్ఛక్తి, నీటివనరుల శాఖా మంత్రి డాక్టర్ కె. ఎల్. రావుగారి అమూల్యమైన మార్గదర్శకత్వం ఈ ప్రాజెక్టు విషయంలో లభించింది.

మాచ్ ఖండ్ విద్యుత్కేంద్రంనుంచి విడుదల చేయబడే ప్రవాహాలను, 1,20,000 కి.వా.ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసేందుకై వినియోగించుకోవడానికిగాను ఎగువ సీలేరు ప్రాజెక్టు మొదటి దశను 1959వ సంవత్సరంలో చేపట్టారు. జాలాపుట్ ఆనకట్ట దిగువన లభించే ప్రవాహాలను క్రమబద్ధం చేయడానికి ఆనకట్టను గుంటవాడవద్ద నిర్మించాలా లేక ప్రవాహానికి ఎగువన 9 మైళ్ల దూరంలో "చిత్రకొండ" గ్రామంవద్ద నిర్మించాలా అనే అంశాన్ని ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా, ప్రభుత్వాలు దీర్ఘకాలం పరిశీలించాయి.

(మిగతా 83 వ పేజీలో)

# దీక్ష

పడ్డాది సీతారామాంజనేయ కవి

శ్రీలుప్పొంగ స్వతంత్ర
పాలనము వర్ధిల్లన్ నిరాఘాటమై,
యాలంబున్ బొనరించి
ధైర్యమున, ఘోరారిచ్చటన్ వేగ ని
ర్మూలింపం గలశక్తి మా
కొసఁగి, మమ్మున్ బ్రోవుమా మాపయిన్
జాలిన్ నింపుచు భారతాంబిక !
నమస్కారమ్ము లర్పించెదన్.

ఎప్పటికేని శత్రుభయ
మీగుటకై సమరమ్ము సేయుటల్
తప్పనియట్టు లెన్నియొ
యుదాత్తనిమిత్తములే యవార్యమై
యిప్పుడు తోఁచుచున్న ;
వీఁక నెల్ల ప్రజావళి కూడియుండు న
ట్లెప్పగిదిన్ ఘటించెదవొ ?
యేగతిఁ బ్రోతువో? భారతాంబికా.

పెంకూడన్ దలవాయఁగొట్టి
మిగులన్ బింకాన నంకానకున్
హుంకారించుచు నీవు పిల్వ,
భయ మెంతో పొంది పర్వెత్తుచున్
డొంకల్ లొంకలు పట్టుకుండుదురె
నీడుట్టుచ్చికిన్ జంకుచున్ ?
సంకోచం బిఁక నేల ? కూల్పఁ
గదవే చైనీయ దౌర్జన్యమున్.

క్షోభముఁ దీర్చి, దేశ మిఁక
గొప్పగ నొప్పఁ బ్రణాళికల్ ప్రజా
ప్రాభవ ముజ్జ్వలించుగతి
వర్తిలఁజేసెడు దీక్షఁ గొంటి; ము
ర్వీభర మెల్ల మోయుటకుఁ
బ్రేమ ధనమ్ముగఁ గొన్నవారమై;
శోభిలు మా స్వతంత్రత
వసుంధరకున్ శుభ మిచ్చుఁగావుతన్!

కావర మెచ్చి, డీకొని,
జగత్ప్రళయంకర మైన ధాటి నీ
చావలి మా వసుంధరకు
నౌర! ప్రమాదముఁ గూర్పనుండె; నీ
వేవిధి నా యలక్ష్మి నిఁక
నిక్కడఁ గాలిడకుండఁ ద్రోలి నీ
పావన నామదీప్తి నెఱపన్
దొరఁకొందువొ ? భారతాంబికా !

హద్దులుమీఱి, బూటకము
లాడుచు, నిందలు మోపి, యెవ్వరున్
బెద్దలు కానె కా రనుచుఁ బ్రేలి,
ప్రమాణపుఁ బత్రముల్ దగా
పద్దులె యంచు ధిక్కృతులు
పల్కి, దురాక్రమణమ్మె కాని వే
ఱెద్దియు వద్దటన్న రిపు
నెట్టు లడంతువొ ? భారతాంబికా!

గిల్లి కయ్యాలు తెచ్చిన గెలుపు గలదె?
నొల్లుకొనిపోవునది యేమి ? నుగ్గగుటకె
మాపయిన్ శత్రువులు నేఁడు మారుకొనుట ;
బల మనుగ్రహింపవే మాకు భారతాంబ !

నీ చావలిని నసభ్యాచారగతిఁ జేర
లక్ష్మియా ? యద్ది యలక్ష్మి గాని;
సత్యకాంతిని వీడి సాధుబాధ ఘటింప
నది .దురాక్రమణమా ! హత్యగాని ;
శత్రుకాంతలు దుష్టజల్పముల్ సల్పంగ
నది నాటకమ ? మహాహవము గాని ;
మణిగర్భభేదకారణ మెట్టు కాకుండు ?
నాటయా యది ? బాంబువ్రేటు గాని;

హైమవతి కృప వర్ధిల్లు నట్టి మమ్ము
నిరసనము చేయు కుజనులు నరకగతులు
కాక తప్పదు నీ వొండు కాకవలన;
వైరి హరణోద్యమాలంబ ! భారతాంబ !
వటములను మార్చివేసి క
పటములఁ గావించుచున్న పాపాత్ముల కె
ప్పటికిని నాశము తప్పదు;
కిటుకు లిడునె భారతాంబ ! గెలు పెపుడేనిన్ ?

చైనీయుల్ సఖు లంచు
నెంచితిమి విశ్వం బెల్ల మన్నించు చం
దానన్ వారికిఁ దోడు సూపితిమి;
బాండంగే యిడున్ సాత్వ్య; మా
హా ! నీతిన్ విడనాడి చైన యదె
ద్రోహం బూని మార్కొన్న; ద
ద్దానిన్ జూచిన నాగ్రహం
బొదవదే ? దౌర్జన్యముల్ సైఁతుమే ?

వైరి విధించుచుండిన
నిబంధనముల్ మన కాత్మగౌరవ
స్ఫూరత కెంత యేనియును
భంగకరమ్ముగ నుంట తెంపుతో
భారతజాతి పోరుటకె
పట్టుదలన్ వహియించె; నింకఁ జై
నారజనీచరవ్రజ వినాశము
తప్పదు తప్ప దెప్పుడున్.

కోరి యుపద్రవమ్ము నొనఁ
గూర్చిన చైన దురాక్రమక్రమం
బారసి, యాగ్రహించి,
సముదంచితదీక్ష వహించి, ధర్మ మే
పారఁగ మాకు సాయపడి
నట్టి పరాయి ప్రభుత్వ సంస్థలన్
సారెఁ గృతజ్ఞతన్ దెలిపి,
సఖ్యముఁ జూపనె కోరుచుండమే ?

గాంధిమహాత్ము శాంతిపథకమ్ము
జగాన జయించి మించఁగా
సంధిపథమ్ముఁ గైకొనుచు,
సర్వజనమ్ములకున్ హితమ్మనే
సంధిలఁ జేయుచున్ భరత
జాతి ప్రవర్ధిలునట్లు సత్కృపా
కంధివిగా నెసంగి, నుతిఁ
గాంచుము నిత్యము భారతాంబికా !

స్వాతంత్ర్యమ్మును భారత
క్షితిని నిల్పన్ దీక్షతో నాఁడు నీ
చేతన్ దాల్చిన తోరమున్,
విజయలక్ష్మీ సత్కృపోద్ధారమున్,
ఖ్యాతిస్ఫారము నేఁడు విప్పకుము
లోకక్షేమ సంధాన గీ
తా తత్త్వమ్మది బోధ
సేయును గురూత్తంసప్రభావాఢ్య మై.

దురహంకారముఁ బూని
రావణుఁడు మున్ దోర్దర్పమున్ జూపుచున్
గిరిరాజేంద్రుని మూల
మట్టముగనే నిర్మూలమున్ జేయఁగా
దొరఁ కొన్నంతనె కాలివ్రేలి
కడిమిన్ ద్రుళ్ళింతయున్ మాన్ప శం
కరుఁ డోమున్ మన భారత
క్షితిని దీక్షన్ వైరులన్ ద్రుంచుచున్.



# నూనెగింజలు - ఉత్పత్తి

జి. ప్రభాకరరెడ్డి

వ్యవసాయం నాగరికతకు చిహ్నం. "కృషితో నాస్తి దుర్భిక్షం" అని నానుడి. వ్యవసాయం అంటే తిండిగింజల ఉత్పత్తితో పాటు భూమాత సహకారంతో మానవునికి కావలసిన ముడిపదార్థాలను పండించడం. తిండిగింజలు మనిషికి చాలా అవసరం; దానితో పాటు చమురు గింజలు కూడా జీవితావసరమే. ఎందుకంటే పిండి పదార్థాలు; మాంసకృత్తులు, విటమినులతో పాటు క్రొవ్వుపదార్థాలుకూడ ప్రాణావసరం. వ్యవసాయ రంగంలో మానవుని ముఖ్యావసరాలదృష్ట్యా తిండిగింజల తర్వాత స్థానం చమురు గింజలకే లభిస్తుంది. కనీసం మనిషికి రోజుకి 5 ఔన్సుల క్రొవ్వుపదార్థం అవసరం. ఇవి ముఖ్యంగా చెట్లద్వారా లభించవలసి వుంది. ఎక్కువ క్రొవ్వు పదార్థాలు ఎక్కువ చమురుగింజల వుత్పత్తి ద్వారా మాత్రమే లభిస్తాయి. ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా నూనెగింజల వుత్పత్తి ఎక్కువచేయటం ఎంతైనా అవసరం. చమురుగింజలు మానవునకు అత్యవసరమైన క్రొవ్వు పదార్థాన్ని యివ్వడమే కాక, మానవాభ్యుదయానికి తోడ్పడే పరిశ్రమల్లో అవసరమైన ముడిపదార్థాలుగా వినయోగించబడుతున్నాయి. వ్యవసాయదారునికి తదితరావసరాలకు కావలసిన ఆర్థిక స్తోమత కలగజేసే పంటగా చమురు గింజలు ఎన్నికకన్నాయి. మన దేశాభ్యుదయానికి ముఖ్యమైన విదేశీ మారకద్రవ్యాన్ని యితోధికంగా సంపాదించి పెట్టగలిగిన ముడి పదార్థాల్లో నూనెగింజలు ముఖ్యమైనవి. ఎందుకంటే సాలీనా సుమారు రు. 27కోట్లు విదేశీ మారకం నూనెగింజల ఎగుమతుల ద్వారా సంపాదిస్తున్నాం. జనాభా పెరుగుదలతోపాటు వ్యవసాయ వుత్పత్తి పెరగవలసి వుంటుంది. అందులో అతి ముఖ్యమైన నూనెగింజల విషయం వేరే చెప్పనవసరం లేదు.

"భారత భూమి సువర్ణ భూమి" అనీ "సస్యశ్యామలం" అనీ అంటూ వుంటాం. ఇవిఅతిశయోక్తులు కావు. మన భారతదేశములో భూమి సాగుబడి బహు పురాతన కాలం నుండీ జరుగుతూ వస్తూ నాగరికతతో పాటు అభివృద్ధి చెందుతూ వచ్చినది. ఇంత పురాతన కాలంనుంచీ సాగుచేయటం ద్వారా భూమి సారం తగ్గిపోయినమాట వాస్తవమే. అందుకే నేడు అమెరికాతో పోల్చి చూస్తే సగటు ఎకరాకు దిగుబడి మన దేశంలో చాల తక్కువ. మన వ్యవసాయ పద్ధతులు మారాలి. ఎక్కువ దిగుబడి సంపాదించాలి. ఈ నినాదాలతో పాటు ఆధునిక శాస్త్రీయ పద్ధతులు రైతాంగానికి అందుబాటు లోనికి ప్రభుత్వ వ్యవసాయ విభాగాలు తెస్తున్నాయి. వ్యవసాయ వ్యవస్థ పరిష్కరింప బడుతున్నది. ఈ పని చేయటానికి సర్వాంగ పటిష్టమైన వ్యవసాయ శాఖ అవసరం. దానిని కూడా చేకూర్చుకుంటున్నాం.

అభ్యంగనం నుంచి ఆవకాయ వరకు మనకు నూనెగింజలు అవసరం. మన రాష్ట్రంలో సుమారు 33 లక్షల ఎకరాలలో వేరుశనగ, 8.5 లక్షల ఎకరాలలో ఆముదాలు, 6.5లక్షల ఎకరాలలో నువ్వులు ముఖ్యంగా సాగు చేయబడుతున్నాయి. అవిశెలు, కుసుమలు, గడ్డినువ్వులు మొదలైన చిరు నూనెగింజలు కూడా విస్తారంగా పండిస్తున్నాం. మనదేశపు నూనెగింజల విస్తీర్ణాన్ని బట్టిచూస్తే మన రాష్ట్రంలో వేరుశనగ 20 శాతము, ఆముదాలు 73శాతము, నువ్వులు 11 శాతము అని తెలుస్తుంది. ఇవి మామూలుఅంకెలు కావు. చాల ముఖ్యమైన విషయాన్ని చూపే సూచికలు. ఎందుకంటే మన రాష్ట్రానికి వేరుశనగలోనూ, ఆముదాలలోనూ, దేశంలో ప్రధమస్థానం వుందని తెలుస్తుంది. అయినప్పటికీ మనకు కావలసినంత ముడి పదార్థాన్ని పండించలేకపోతున్నాం. ఇదివరలో చెప్పినట్లు జనాభా పెరుగుదల, దినదినాభివృద్ధి చెందుతున్న అవసరాలు, పరిశ్రమలు దీనికి కారణం.

పంటల దిగుబడి పెంచటం సాంద్ర పద్ధతి ద్వారాను, విస్తృత పథకాల ద్వారాను సాధ్య మవుతుంది. ఈ పద్ధతులనే మనం నూనెగింజల వుత్పత్తి విషయంలో కూడ అవలంబించాలి. విస్తృత పథకాలద్వారా మరింత భూమిని నూనెగింజల సాగుక్రిందకు తీసుకోవచ్చు. అలాగే సాంద్రపద్ధతి వలన, వున్న భూమిలోనే అధికోత్పత్తిని సాధించ వచ్చు. ప్రస్తుత అవసరాల దృష్ట్యా మరింత భూమిని నూనెగింజలకు కేటాయించటం కొంచెం అసమంజసంగా కనిపిస్తుంది. అయితే సాంద్రపద్ధతిద్వారా మన లక్ష్యాన్ని సాధించుకోవచ్చు. దీనికి కావలసిందల్లా శాస్త్రీయపద్ధతుల అనుసరణ. మన రాష్ట్రంలో ఎకరాకు దిగుబడి ఆముదాలలో 134 పౌనులు, వేరుశనగ 547పౌన్లు, నువ్వులు 149పౌనులు. మరికొన్ని రాష్ట్రాలతోను, దేశపు సగటుదిగుబడితోను పోల్చిచూస్తే యీ అంకెలు చాలా తక్కువ. దేశపు సగటు అంకెలు ఆముదాలు 192 పౌనులు, వేరుశనగ 636 పౌనులు, నువ్వులు 132 పౌనులు. వ్యవసాయమే ముఖ్య పరిశ్రమగా గల మన రాష్ట్రంలో, అన్ని యితర రంగాలలోను అగ్రగామిగా వున్న మన రాష్ట్రంలో యిట్టి అధమ పరిస్థితులు కన్పించడం చాల శోచనీయం. దీనిని మనం ఎదుర్కొని మన రాష్ట్రాన్ని ముందుకు తీసుకొని పోవలసివున్నది. వివిధపథకాల ద్వారా యీ గురుతర కార్యాన్ని సాధించటానికి రాష్ట్ర వ్యవసాయశాఖ కృషీవలుల సహకారంతో పూనుకొన్నది. త్వరలో సాధించగలుగుతా మని చెప్పవచ్చు.

సాంద్ర వ్యవసాయ పద్ధతికి కావలసిన ముఖ్యాంశాలు ఎంచిన విత్తనాలు, ఎరువులు, నీటి పారుదల, సస్యరక్షణ సకాలంలో జరగడం — వీటన్నిటికీ మూలకందము వ్యవసాయ పరిశోధన.

సుమారు 30 సంవత్సరాల నుంచీ ఆముదాలలో పరిశోధనలు జరుగుతున్నాయి. వీటి ఫలితంగా హెచ్. సి. 1 నుంచి హెచ్. సి. 7 అను ఏడు ఎంచిన వంగడాలు రైతులకు విడుదల చేయడమైనది. ఇందులో హెచ్. సి. 6 అనే రకం ఎకరాకి సుమారు 350 పౌన్లు దిగుబడి నిస్తూ 49 శాతం నూనె కలిగి రైతులచే మెప్పు గొన్నది. పెద్ద ఎత్తున రైతులకు వుత్పత్తికై సరఫరా చేయబడింది. ఇది తెలంగాణంలో సుమారు 5 లక్షల ఎకరాలలో సాగు అవుతున్నది. ఆముదాలు 8—9 నెలల పంట. దేశీరకం 47 శాతం నూనెతో సుమారు 200 పౌన్లు దిగుబడినిస్తే యీ హెచ్. సి. 6 అంతకు మిన్నగావుండి యితోధికంగా అధికోత్పత్తికి సాయపడుతున్నది. ఇదే విధంగా ఆంధ్ర ప్రాంతానికి టి. యం. వి. 1 అనే వంగడం తగి వుండటాన దానిని యిప్పటికి 10,000 ఎకరాలలో విస్తరింపచేయటం జరిగింది. ఇంకా కృషి జరుగుతూనే వుంది. పై చెప్పిన 7 రకాలేకాక 22 సంకర రకాలను కూడా తయారించటం జరిగింది. ఇవన్నీ కూడా హెచ్. సి. 6 కంటే అధిక దిగుబడి నివ్వడమే కాక నూనె దిగుబడి 56 శాతం వరకూ కలిగి ఆకుపచ్చని కాండంతో చూడ ముచ్చటగా వుంటాయి. త్వరలో వీటిలో కొన్నింటిని రైతాంగానికి జారీచేయటం జరుగుతుంది.

పరిశోధనల వలన ఆముదాలను జులై రెండవ వారంలో విత్తవలెననీ, చాళ్ళమధ్య 3' మొక్కలమధ్య 1½' దూరంలో నాటాలని, ఎకరాకు 12 పౌనుల విత్తనాలు చాలని, ఎకరాకి 30 పౌనులు నత్రజని నిచ్చేటట్లు పెంటఎరువుగాని, కంపోస్టుగాని వాడడం లాభకరమని తేలింది. ఇవేకాక యీ మధ్య జరిగిన విస్తృత పరిశోధనలవల్ల ఆముదాలకి కృత్రిమ ఎరువులనికూడ వాడవచ్చునని, నత్రజని 20 భాస్వరము 10 పొటాసు 10 పౌనులు ఎకరాకు వాడితే మంచిదిగుబడి యిస్తుందని తేలింది. ఈ సలహాని ప్రభుత్వ వ్యవసాయశాఖ, రైతులకి యిస్తున్నది. ఎరువులు సరఫరా అయేటట్లు చూస్తున్నది కూడ. ఆముదాలపై ప్రాథమిక పరిశోధనలు కూడా జరిగాయి. తత్ఫలితంగా మంచి వంగడాలు ఎంచే పద్ధతిని మెరుగులు దిద్దటం కూడ జరిగింది.

వేరుశనగ మన దేశానికి మొత్తానికి కొత్తఅనే చెప్పాలి. మనరాష్ట్రంలో వేరుశనగ, నువ్వులపై పరిశోధనలుకూడ యీ మధ్యనే ప్రారంభించబడ్డాయి. ఆంధ్ర ప్రాంతానికి TMV 2 అనే గుత్తిరకం (105 రోజులు) TMV 3 అనే తీగెరకం (135 రోజులు), తెలంగాణానికి Spanish Improved అనే గుత్తిరకం (105 రోజులు) తగి వుంటాయని తెలుసుకున్న తర్వాత యీ రకాలని పెద్దఎత్తున విస్తరింప చేయటానికి పథకాలు నడిపి యిప్పటికి 14 లక్షల ఎకరాలలో మేలురకం విత్తనాలు సాగులోకి తేవటం జరిగింది. ఎంచిన వంగడం దేశీకన్న కనీసం 10-15% ఎక్కువ దిగుబడి యిస్తుందని అందరికీ తెలిసినదే. అంటే సుమారు 14 లక్షల ఎకరాలలో వేరుశనగనూ, 5 లక్షల 10 వేల ఎకరాలలో ఆముదాల వలననూ 10-15% అధికోత్పత్తి సాధించటం జరుగుతున్నదన్నమాట. యీ విస్తృత కార్యక్రమాన్ని (IODS) సంఘటిత నూనెగింజల విస్తృత పథకంద్వారా అమలు జరుపడం జరుగుతున్నది. మేలురకం విత్తనాల వుత్పత్తి ప్రథమ దశలలో నిపుణుని పర్యవేక్షణలో 8 కేంద్రాలలో (ప్రతితోట 50 ఎకరాలు) జరుగుతున్నది. ఈ గింజలనే

అంచెలవారీగా విస్తరణచేస్తారు. నువ్వులలో T.85 అనురకం తెల్లగింజ తెలంగాణానికి, TMV3 అను ఎర్రగింజ ఆంధ్రకి తగివుంటా యని తెలిసిన దరిమిలా భారీ సరఫరా మరి విస్తరణ జరుగుతున్నాయి. ఇప్పటికి సుమారు 10 ఎకరాలు మేలు రకాలు క్రిందికి వచ్చినదని చెప్పవచ్చును. ఇది అంతా నిరంతర పరిశోధనా కృషి అని చెప్ప వలసి వున్నది. "కృషితో నాస్తి దుర్భిక్షం" కదా. కృషి అన్నిపరిశ్రమలలోను జరుగ వలసి వున్నది. అన్నింటికి మూలం "పరిశోధన". ఇటీవల జరిగిన పరీక్షల ద్వారా ఒక ముఖ్యమైన విషయం తెలిసింది. అది ఏమంటే కృత్రిమ ఎరువులు వేరు శనగకీ వాడవచ్చునని ఖరీఫ్‌లో వర్షాధారపు పంటకి నత్రజని 10, భాస్వరం 20, పొటాసు 30 పౌన్లు ఎకరాకి సరియైన మోతాదని రబీలో నీటిపారుదలక్రింద నత్రజని 15, భాస్వరం 30, పొటాసు 45 పౌనులు సరైన మోతాదని తెలిసింది. ఇలా ఎరువులు వాడిన ఎకరా ఒకటికి కనీసం రు. 40/– నుంచీ రు. 175/– వరకు నికరలాభంచేకూరగలదు.

రాష్ట్రంలోని వివిధ నైసర్గిక పరిస్థితుల దృష్ట్యా వాతావరణ పరిస్థితులు పరిశీలించి వివిధ ప్రాంతాలలోను పంటలు పండించే విధం ఋతువులను అంచనా వేసి రైతులు ఎదుర్కొనే సమస్యలను పరిష్కరించ టానికి రాష్ట్రప్రభుత్వం పూనుకొని అసం ఖ్యాకమైన ప్రణాళికలను, పథకాలను అమలు జరుపుతున్నది. ఇట్టిపథకాలలో నూనెగింజల పరిశోధనకూడ అతి ముఖ్యమైనది. రైతులు ఎదుర్కొనే సమస్యలు పరిష్కరించటానికి నూనెగింజలపై పరిశోధనలు యీ క్రింది ప్రదేశాలలో జరుగుతున్నాయి. *

ఇవన్నీకూడా ఇప్పటివరకు అమలులో వున్న పంచవర్ష ప్రణాళికలలోనే ప్రారం భించ బడాయి. అధిక దిగుబడిని ఇచ్చి, హెచ్చు నూనెశాతంకల్గి ఋతువులకనువైన, క్రిమి కీటకాదులను ఎదుర్కొన గలిగిన మేలురకం గింజలను వుత్పత్తి చేయడం, యితర వ్యవసాయ పద్ధతులను కనుక్కోవడం యీ పథకాల ఆశయం. మాగాణంలో వేరు శనగ పండించటం చాలా లాభదాయకం అని తెలిసికొన్న తర్వాత రైతులు యీ పద్ధతిని స్వయం విస్తృతం చేస్తున్నారు. వారెదు ర్కొనే సమస్యలను ఛేదించటానికి మచిలీ పట్టణంలోనూ, రుద్రూరులోనూ పరిశీలనలు పరిశోధనలు జరుగుతున్నాయి. ఇదేవిధంగా మనకుగల ప్రాజెక్టులక్రింద నీరుపాదలతో నూనెవిత్తనాలుపండించవచ్చును. ఐతేముందు ముందు చాలసమస్యల నెదుర్కొనవలసి వస్తుంది. వాటిని అధిగమించటానికి పరి శోధనలు చేయటానికై తుంగభద్రా ప్రాజెక్టు క్రింద ఒక నూనెగింజల పరిశోధన క్షేత్రాన్ని స్థాపించటానికి కేంద్ర నూనెగింజల సంస్థ తయారుగావుంది. అయితే ప్రస్తుత విపరీత పరిస్థితులదృష్ట్యా రాష్ట్రప్రభుత్వం అమలు చేయలేకపోతోంది. కనీసం నాల్గవప్రణాళిక కాలంలోనైనా తుంగభద్రా ప్రాజెక్టుక్రింద ఒకటి, నాగార్జున ప్రాజెక్టుక్రింద ఒకటి పరిశోధనాక్షేత్రాలు నూనెగింజలకై తెర వటం చాల అవసరం. నీరు వుంటే సాధించ లేనిది లేదు. నూనె గింజలలో సాంద్రవ్యవ సాయ పథకాన్ని కర్నూలుజిల్లా ఎమిగ నూరులో ప్రవేశపెట్టి అధిక వుత్పత్తి సాధించగలుగుతున్నాం. అలాగే అన్ని ప్రదేశాలలోనూ సాంద్రవ్యవసాయ పథకాలు అమలులోనికి తేవాలి. సుమారు అన్ని పథ కాలకీ కేంద్రసహాయం వుంటూనే వుంది. కేంద్ర నూనెగింజల సంస్థని హైద్రాబాదులో నెలకొల్పి భారత ప్రభుత్వం మన రాష్ట్రానికి నూనెగింజలలోగల ప్రాముఖ్యతని చాటిందని చెప్పవచ్చును.

పరిశోధనలు కొన్ని సమస్యలను తొలగించటానికి జరుగుతాయి. అంతిమ ఫలితం అధికోత్పత్తి. మన రాష్ట్రానికి 3వ పంచవర్ష ప్రణాళికాంతానికి 17.08 లక్షలు నూనె గింజలు పండించవలసిన బాధ్యత కేంద్రం మనపై మోపింది. కాని యిటీవలి ప్రకృతి వైపరీత్యాల వలన; అతివృష్టి, అనా వృష్టి, క్రిమి కీటకాల బాధలవలన మన దిగుబడి తగ్గిపోయింది. అయితే మరల సాధించటానికి అన్ని ప్రయత్నాలు జరుగు తునే వున్నాయి. కొంత ముందుకి నడిచాం కూడా. పరిస్థితులు సవ్యంగా వుంటే మనకి కేటాయించిన ధ్యేయాన్ని సాధించగలం.

కొబ్బరిచెట్ల విభాగంకూడ నూనె గింజల నిపుణుని ఆధీనంలో, పర్యవేక్షణలో వుడడం వల్ల కొబ్బరి తోటలను గురించి కూడా ప్రస్తావించవలసి వున్నది. మన రాష్ట్రంలో ప్రస్తుతం 86000 ఎకరాలలో కొబ్బరి తోటలు పెంచబడుతున్నాయి. దిగుబడి 315 మిలియను కాయలు. అందులో కొనసీమ, శ్రీకాకుళం జిల్లాలోని ఉద్దానము చాల ముఖ్యమైనవి. కొబ్బరితోటల పెంపకంలో ఎదురయ్యే సమస్యలు ఎదుర్కోవటానికి పరిశోధనలు అంబాజీపేటలోని ప్రాంతీయ కొబ్బరిమొక్కల పరిశోధనా కేంద్రంలో జరుగుతున్నాయి. దీనికి కేంద్ర కొబ్బరి మొక్కల సంస్థ యితోధికంగా ధనసహాయం చేస్తున్నది. ఎంచిన మంచి కాయలను సంపా దించి శాస్త్రీయ పద్ధతులలో నారుమళ్ళను పెంచి ప్రభుత్వం సంవత్సరానికి 17500 కొబ్బరి మొక్కలను రైతులకు సరసమైన ధరలకు సరఫరా చేస్తున్నారు. దీనికొరకూ, రైతులకు కొబ్బరిమొక్కలు పెంపకంపై సలహాలు యివ్వటానికీ కొబ్బరి మొక్కల విస్తరణ పథకం అమలులో వున్నది. దీని స్థానం రాజమండ్రి.

| | | |
|---|---|---|
| *రాజేంద్రనగర్, హైద్రాబాదు జిల్లా | — | ఆముదాలు, వేరుశనగ, నువ్వులు, కుసుమలు, అవిశెలు, గడ్డినువ్వులు |
| కదిరి, అనంతపురం జిల్లా | — | ఆముదాలు, వేరుశనగ, నువ్వులు |
| కరీంనగర్, కరీంనగరు జిల్లా | — | నువ్వులు |
| ఎలమంచిలి, విశాఖ జిల్లా | — | నువ్వులు, వేరుశనగ మొ॥ |
| మచిలీపట్టణం, కృష్ణా జిల్లా | — | మాగాణంలో వేరుశనగలు. |
| రుద్రూరు, నిజామాబాదు జిల్లా | — | మాగాణంలో వేరుశనగలు. |

# ఆంధ్రభాష - హకారాది పదములు

—తూమాటి దోణప్ప

'సర్వజ్ఞం తదహం వందే
పరంజ్యోతి స్తమోపహం
ప్రవృత్తా యన్ముఖాద్దేవీ
సర్వభాషా సరస్వతీ'

—నాగవర్మకృత కర్ణాటక భాషాభూషణం.

ఏ భాష యందయినను పదజాలము నిసర్గము (Indigenous), ప్రతి దేయము (Borrowed) అని ద్వివిధావిభక్తము. మూల భాషనుండి పైతృకముగా సంక్రమించిన పదములు నిసర్గములు; తదితరములు ప్రతిదేయములు. పరిసరస్థములగు సజాతీయ సోదర భాషల (Cognate languages) నుండిగాని, సమీపవర్తి విజాతీయ భాషల నుండిగాని, మత వాణిజ్య రాజకీయాది సంసర్గ సంబంధముల మూలమున దూరవర్తి విజాతీయ భాషలనుండి గాని ఎరవుతెచ్చిన పదములు ప్రతిదేయములు. పైతృకము శుద్ధదేశీయము; ప్రతిదేయము అన్యదేశీయము.

ఆంధ్ర భాష యందలి నిసర్గదేశ్య భాగము[1] ను శుద్ధాంధ్ర దేశ్యముగను, తదన్యమును అన్యదేశ్యముగను పరిగిణించుట ఆధునిక భాషాశాస్త్ర పద్ధతులకు సంవాదకమగు సమన్వయము. కాని, సంస్కృత ప్రాకృతములనుండి ప్రతిదేయమయిన పదజాలమును తత్సమ తద్భవము లనియు, తదితర పదసముదాయమును దేశ్యమనియు వ్యవహరించుట ప్రాక్తనాంధ్ర వ్యాకరణ సంప్రదాయము. ఈ సంప్రదాయమును ప్రాకృత భాషావ్యాకరణ మర్యాదానుసారి. తత్సమ తద్భవ దేశ్యములను విభాగ ప్రక్రియ ప్రాకృత భాషా పదతత్త్వ ప్రకాశకము.

ప్రాకృత వ్యాకరణములలోని తచ్ఛబ్దము సంస్కృత భాషా పరముగా వ్యవహృతము. ప్రాదేశికమును, అవిజ్ఞాత ప్రకృతికమును నగు పదజాలము ప్రాకృత భాషావ్యాకర్తల దర్శనములో దేశ్యము. ఆంధ్రమునందలి తత్సమ తద్భవ విభాగము ప్రాకృతము నందలి విభాగ ప్రక్రియకు అనుప్రాసము. దేశ్యభాగము ఆంధ్రలాక్షణికుల చూపులో అవ్యుత్పత్తికము. ఆంధ్రమునందలి దేశ్యమునకు ప్రాకృతము నందలి దేశ్యమునకు నామమాత్రపు సాదృశ్యము తప్ప స్వరూప స్వభావములలో యత్కించిత్ సామ్యమును అసంభావ్యము.

ఆంధ్రమునందలి దేశ్యభాగము పైతృకము; తక్కిన ద్రావిడ భాషలకు సగోత్రకము. విశేషించి, నిత్యవ్యవహారోపయోగి. ప్రాకృతములలోని దేశ్యభాగము వ్యుత్పత్తి దుర్జ్ఞానము గావున ప్రాకృత వ్యాకర్తలు దానిని వేఱుగా పేర్కొనుట. అవిజ్ఞాత ప్రకృతికమని భావించిన ఈ భాగములో చాల పాలు అనార్య భాషా పదమయమని ఆధునిక భాషా పరిశోధకుల సోపపత్తిక నిర్ణయము[2]. ప్రాకృతిములలో అత్యల్పమయిన ఈ భాగము యొక్క ప్రయోజనము అనుకల్పము కావున నది లుప్తమయినను ప్రాకృతములలో వ్యవహారహాని సంధిల్లదు. నామమాత్రపు సాదృశ్యము నాధారముగాఁ గొని ప్రాకృతాంధ్రములకు సజాతీయతను స్థాపింప బూనుట వృథా ప్రయత్నము.

ప్రాచీనాంధ్ర లాక్షణికుల నిర్వచన నిరూపణములలో అన్యదేశ్య స్వరూపము అస్పష్టము. దేశ్యమున అన్యదేశ్యమును అంతర్భూతము. ఏతద్విషయకములయిన మన శాస్త్రార్థములు బహుధా విప్రతిపత్తి మూలకములు— ప్రస్తుత సమీక్షలో ఏతద్విచారము అప్రసక్తము. నిసర్గము, ప్రతిదేయము— అను సుస్పష్టమయిన విభాగ దృష్టితో ఆంధ్రభాషయందలి హకారాది పదజాలము ప్రస్తుత పరిశీలనమున పరామృష్టము. ఇట తత్సమ తద్భవ దేశ్య రూపమగు సమాహారాంధ్రము ఉదిష్టము.

---

1. 'ఇప్పటికి బహు పండిత సమ్మతమైన సిద్ధాంతము, తెలుగు ద్రావిడ భాషావర్గము లోనిదని. ఆర్య భాషా స్వభావమునకు భిన్నములును, ద్రావిడ భాషకు సాధారణములును అగు లక్షణములు మనభాషలో చాల కలవు. పుట్టుకనుగూర్చి ఈ రహస్య మంగీకరింపక తప్పదు. పోషణలో మాత్రము తెలుగునకు సంస్కృతమువలని యుపకారమే యెక్కువ కలిగినది.' (పింగళి లక్ష్మీకాంతం, గౌతమ వ్యాసములు, ద్వి. ముద్రణము. 1961, పు. 2.)

2. John Beames, A Comparative Grammar of Modern Aryan Languages, 1872, Vol. I, Introduction, p. 12, Rev. Dr. R. Caldwell, Comparative Grammar of the Dravidian or South Indian Family of Languages, 1875, pp. 56–64, Dr. R. Pischel, Comparative Grammar of the Prakrit Languages, Introduction, para 9.

ప్రాచీన ద్రావిడ భాషయందు 'హ' వర్ణము ఉనికి సందేహాస్పదమనియు, ద్రావిడ భాషావికాసమున అనంతరదశయం దేర్పడిన నూతనరీతి (Innovation)కిది తార్కాణ మనియు తత్త్వ ప్రవణులు నిర్ధారించిన యంశము[3]. తమిళ వ్యాకర్త లలో ప్రసిద్ధుఁడును, ద్రావిడభాషా వ్యాకర్త లలో ప్రాచీనుఁడును అగు తొల్కాప్పియనారు హకారకల్పక మయిన 'ఆయ్దమ్' (ంºం)ను ప్రధాన వర్ణమాలలో పఠింప లేదు. ప్రాచీన తమిళమున దీనివ్యాప్తి ఇంచుమించు అజాగళస్తనమువంటిది. పరాశ్రయ భాగిత్వముకల ఈ 'ఆయ్దమ్' సంస్కృత భాషయందలి విసర్గకు వికృతికాఁబోలు నని డా. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ఊహ.[4] మీఁదు మిక్కిలి అపదాదిగానే దీని అస్తిత్వము; అదియును అతివిరళము. ఐదంయుగీన మగు తమిళములో హను మూలీయ స్పర్శ (Velar stop) వర్ణమగు 'క' ను అజ్మధ్యముగా 'హ'గా నుచ్చరించుట తమిళుల అలవాటు. తిరుమాళిహై (< తిరుమాళికై = తిరుమాళిగ), తిర్వడి హళ్ (< తిరువటికళ్ = శ్రీపాదములు) సాగరాంధ్రమున ఇహ (= ఇఁక). ఒహటి (= ఒకటి), మొహం (= మొగము), మొహమాటం (= మొగమోటము) సహం (= సగము) మొదలగు వానిలోని హకారోచ్చారణము అర్వాక్కాలికము; సాగరాంధ్రమునకు పరిమితమగు విశిష్ట మాండలిక పరిణామము.[5]

పదాది పకారము హకారముగా మాఱుట కర్ణాట భాషావికాసమున విశిష్టలక్షణము. క్రీ. శ. పదియవ శతాబ్దము నుండియు కర్ణాట భాషా వ్యవహారమండలము లన్నింటను ప్రవర్తితమయినదీ ధ్వనిపరిణామము. క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దాంతము దాఁక కన్నడము నందలి 'ప_' ఈ మార్పునకు లోనుగాలేదు. ఆ పిమ్మట పదాది 'ప'కారము 'హ' కారముగా వికృతినందినది[6]. పత్వమునకు హత్వవ్యవస్థ కర్ణాట భాషాలాక్షణిక సమ్మతము. పదునొకండవ శతాబ్దికిచెందిన నాగవర్మకృత కర్ణాటక భాషాభూషణము నందు 'పేహూవా' అని సూత్రితము[7]. 'పకారస్య స్థానే హకారోవా భవతి' అని వృత్తి. ఇది వికల్పమనుట స్పష్టము. పదుమూఁడవ శతాబ్దినాఁటి కేశిరాజకృత శబ్దమణి దర్పణమునందును 'అద్విరుక్తమగు పకారమే హకారమగు చున్నదనియు, ఈ పరిణామమును వికల్పమనియు, ఇది కావ్య సౌందర్య హేతువనియు, ద్విత్వపకారము హకారమగుట లాక్షణిక మతమునకసమ్మత' మనియు వివృతము[8]. ఈ పరిణామ ప్రక్రియను స్పష్టపఱుచుట కీ క్రింది పట్టిక.

| తెలుఁగు నందలి జ్ఞాతిపదము | కన్నడము ప్రాచీనరూపము: | నవీనరూపము: |
|---|---|---|
| పగలు | పగల్ | హగలు |
| పల్లు | పల్ | హల్ |
| పాలు | పాల్ | హాలు |
| పాము | పావు | హావు |
| పిండు | పిండు | హిండు |
| పిసుకు | పిసుకు | హిసుకు |
| పీర్చు | పీర్ | హీర్ |
| పీలి | పీలి | హీలి |
| పుట్టు | పుట్టు | హుట్టు |
| పులి | పులి | హులి |
| పూ, పూవు | పూ· | హూ |
| పూడు | పూడు | హూడు |
| పెట్టు | పెట్టు | హెట్టు |
| పెంపు | పెంపు | హెంపు |
| పేను | పేన్ | హేను |
| పేర్-(= పెద్ద) | పేర్_ | హేర్ |
| పొగ | పొగె | హొగె |
| పొగరు | పొగర్ | హొగరు |
| పోరు | పోరు | హోరు |
| పోలిక | పోలికె | హోలికె |

దేశ్యములయందే గాక తద్భవముల యందును కన్నడమున ఈ పరిణామము ప్రసారితము.

| సంస్కృతము: | ప్రాకృతము: | కన్నడము: |
|---|---|---|
| ప్రచ్ఛద - | పచ్ఛద - | పచ్ఛడ, హచ్ఛడ |

3. గంటి జోగిసోమయాజి, ఆంధ్రభాషా వికాసము. పుటలు 356,357.

4. Dr. P. S. Subrahmanya Sastri, History of Grammatical Theories in Tamil, pp. 65–70.

5. వడ్లమూడి గోపాలకృష్ణయ్య, వ్యావహారిక భాషా వ్యాకరణం, శబ్దపరిచ్ఛేదం, సూ. 259.

6. Dr. A. N. Narasimhia, A Grammar of the Oldest Kannada Inscriptions, pp. 1–25.

7. సూ. 115, యుష్మదాది విధానం, కర్ణాటక భాషాభూషణం, Ed. by R. Narasimhachar, Mysore Govt. Central Press Bangalore, 1903.

8. సూ. 159, నామప్రకరణం, అక్షరపరిణామం, శబ్దమణిదర్పణ, Ed. by Rev. Dr. F. Kittel, Re-edited by P. Mangesh Rau, Mangalore, 1920.

| సంస్కృతము: | ప్రాకృతము: | కన్నడము: |
|---|---|---|
| ప్రహార - | పహార - (= దెబ్బ, వ్రేటుపడినతావు) | పారె,హారె (= పార, భూమిని త్రవ్వెడు సాధనము) |
| పిష్ట- | పిట్ఠ- | పిట్టు, హిట్టు (= తండులాదిక చూర్ణము) |
| పూర్ణిమా | పుణ్ణిమా | పుణ్ణిమె, హుణ్ణిమె (=పున్నమ) |
| పోలికా | పోలిఅ | పోళిగె, హోళిగె |

అల్ప ప్రాణమును, ఉభయోష్ఠ్య స్పర్శము (Bilabial stop)ను అగు 'ప' కారము, మహా ప్రాణమగు 'ఫ' గా ఉచ్చరిత మగుచుండి కాలక్రమమున స్పర్శ స్వభావ మును గోల్పోయి 'హ' గా పరిణమించి యుండునని కర్ణాట భాషా పరిశీలకుల తలంపు[9]. తెలుఁగునందును పదిహేను (< పదియేను), పదహారు (< పది యాఱు), పదిహేడు (< పదియేడు), పద్దెనిమిది (< పదియెన్మిది), పంధొమ్మిది (< పందొమ్మిది), ఇరభయ్ (< ఇరువది), ముప్ఫయ్ (< ముప్పది), నలభయ్ (< నలువది), యాభయ్ (< ఏఁబది), అరభయ్ (< అఱువది), డెబ్భయ్ (< డెబ్బది), యనభయ్ (< ఎనుబది), తొంభయ్ (< తొంబది) – మొదలగునవి సోష్మ మహా ప్రాణ వర్ణఘటితము లగుటయు, ఏంభది (< ఏఁబది) అను రూపము ప్రాచీనాంధ్ర శాసనములలోఁ గన్పట్టుటయు గమనార్హము[10].

ఆంధ్రమునందలి తత్సమ తద్భవేతరములగు హకారాది పదములతో పెక్కులు కన్నడమునుండి ఎరవు తెచ్చినవి. హకారాది క్రియావాచకపదములు తెలుఁగున రెండే రెండు. హత్తు, హెచ్చు అను ఈ రెండును కన్నడమునుండి ఎరవుతెచ్చిన పదములని డా. భద్రిరాజు కృష్ణమూర్తిగారి నిరూపణము[11]. ఇవితప్ప పదాది హకార ఘటిత క్రియావాచక పదములు తెలుఁగున లేవని తాత్పర్యము

ప్రాచీన దక్షిణ ద్రావిడమున 'చ' వర్ణాది పదముల తొలివర్ణము లోపించి అజాది రూపముగా పరిణమించుట తఱుచగు లక్షము. చవర్ణాది పదమునకును, దీని పరిణత రూపమగు అజాది పదమునకును నడుమ హకారాది దశ [చ – > హ – > ం – (= లోపము, అభావము)] ఒకటి ఉండి యుండవలయునని వేత్తల అధ్యాహారము. ఈ మధ్య దశను సూచించు హకారాది పదములు దక్షిణ ద్రావిడమున సాహితీ వ్యవసాయము సాఁగిన నాగరక భాషల యందును సంగ్రథితము కాలేదు. మధ్య ద్రావిడ భాషలలో నొకటియగు 'కువి'యను గిరిజనులభాష[12] లో ఈ దశకు చెందిన పదములుకొన్ని నేఁడును వ్యవహృతములు. మచ్చుకు కొన్ని మాటలు :

| కువి : | తెలుఁగు : |
|---|---|
| హన్(= పోవు) | చను |
| హర్కు(= వస్తువులు, ఉగ్రాణపు సామగ్రి) | సరకు |
| హారు, హారూ(= ఉప్పు) | సోరుప్పు |
| హిజ్జు, హీచూ(= నిప్పు) | చిచ్చు |
| హీరు | చీర(పోతు) |
| హుక, హూక(= నక్షత్రము) | చుక్క |
| హెల్లొ, (= అనుమతి) | సెలవు |
| హేపొరి | చీపురు |
| హేరు, హేరూ(= వ్యవసాయ సాధనము, నాఁగలి) | సేరీ(=వ్యవసాయము) ఏరు=నాఁగలి |
| హొమ్ము, హోమూ(=నగలు డబ్బు, సంపద)[13] | సొమ్ము |

కాని, 'కువి' భాషనుండి తెలుఁగునకు ఎరవు తెచ్చిన పదములు నాస్తి.

ఆంధ్ర భాషయందలి హకారాది పద ములలో రమారమి మూఁడింట రెండు వంతులు తత్సమములు. తద్భవములు పదికి బొటాబొటి. కన్నడమునుండి ప్రతి

9. Dr. A. N. Narasimhia, op. cit.

10. స్వార్థాతిశయమున కొన్ని పదాల పరుషసరళములకు మహాప్రాణములు వైకల్పికముగా వచ్చుటకు చూ. వఝమూడి గోపాలకృష్ణయ్య, పూర్వోదాహృతగ్రంథము, శబ్ద. సూ. 280.

11. Dr. Krishnamurthi, Telugu verbal Bases, A Comparative and Descriptive Study, University of California Publications in Linguistics, Vol. XXIV, Berkeley, 1961, p. 23.

12. కువిభాష, ఆంధ్రప్రదేశము విశాఖమండలములోని మన్యప్రాంతములయందును, ఒరిస్సారాష్ట్రము కలహంది, కోరాపుట్టి, గంజాము మండలములలోని మన్యప్రాంతములయందును గిరిజనుల వాగ్వ్యవహారరూపము. ఈ భాషావ్యవహర్తలు 1951 జనాభా లెక్కల ననుసరించి ఇంచుమించు మూఁడులక్షలు. కువిజ, కోజు, కోందు, జాతాపు, సామంతు అను ప్రాదేశికవ్యవహార నామములు కల పలుతెగల గిరిజనులందఱును కువిభాషా వ్యవహర్తలు.

13. F. V. P. Schulze, Vocabulary of Kuvi-Kond Language, Madras, 1913; A. G. Fitzgerald, Kuvinga Bassa (the Language of Western Khonds), Catholic Press, Calcutta, 1913.

దేయములు నలువది పై చిలుకు. మిగిలిన వానిలో ముక్కాలు మువ్వీసము అరబ్బీ పారసీకాది భారతీయేతర భాషలనుండియు, మరాఠ్యాది నవీనోత్తరాహ భాషల నుండియు సంసర్గవశమున ప్రవేశించిన అన్య దేశ్యములు. ఆంగ్ల పదములు ఒక కొన్ని. పండితులును, పామరులును సృష్టించిన కృతక ప్రామాణికములు (Hyperforms) మఱి కొన్ని. తక్కినవి వ్రేళ్ళమీఁదికి చాలని ధ్వన్యను కరణములు. ప్రవృత్తి పరముగా ఆంధ్రభాషయందున్న హకారాది పదములు వెరసి ఇన్ని పద్దులక్రింద చెల్లుపడఁగా, మన సొంతమునకు మిగిలినది హాళ్ళికి హాళ్ళి, సున్నకు సున్న. కాఁగా, వ్యుత్పత్తి పరముగా ఆంధ్ర భాషయందు హకారాది పదములు లేవని సిద్ధాంతము.

ప్రవృత్తి పరముగా ఆంధ్ర భాషయందున్న హకారాది పదములు వివిధ శీర్షికల క్రింద, అకారాద్యనుక్రమముగా ప్రపంచితము. ప్రాయికముగా కావ్య ప్రయుక్తములే ఇట ప్రదర్శితము. ముఖ్య శీర్షికలివి : i. తత్సమములు, ii. తద్భవములు, iii. కన్నడ పదములు, iv. అన్యదేశ్యములు, v. ఆంగ్ల పదములు, vi. కృతక ప్రామాణికములు. vii. ధ్వన్యనుకరణములు. క్రమముగా నీ శీర్షికల విస్తరము.

I. *తత్సమములు :* తత్సమముల స్వరూప నిరూపణ మనావశ్యకము. మాదిరికి నన్నయ భారతము. ఆదిపర్వము నందలి హకారాది పదములు కొన్ని :

(చరణ) హతిన్ (6_2_7)
(బ్రహ్మ) హత్యయు (6_270)
హయంబు (1_113)
హరణ (హారికయు) (1_34)
హరా (జగజానన) (1_21)
హరిణముల (4_76)
హరితనయుండు (8_201)
హరి దంతరంబులన్ (8_275)
హరి దశ్వుఁడు (6_174)
హరి నందను (6_84)
హరి నీల సమవర్ణుఁడు (8_185)
హరియించు (7_103)
హర్మ్యతలంబుల (4_216)
హర్ష పులకలు (4_108)
హర్షంబుగా (4_105)
హర్షించి (5_136)
హవ్యకవ్యములు (1_139)
హవ్యములు (5_79)
హవ్య వాహనుఁడు (8_249)
హవ్యాసన (8_248)
హంస (1_48; 6_231)
హస్తమ్మున (5_243)
(ముకుళిత) హస్తలమై (8_158)
హస్తిఘటావలి (6_78)
(పృథుదండ) హస్తుఁడై (6_78)
(షష్టి) హాయన (6_207)
(కేయూర) హారాదిభూషణ (6_48)
(హరణ) హారికయు (1_34)
హారి (హిరణ్మయ) (4_53)
హాసాస్పదీభూతుఁడై (7_49)
హితభాషణు (7_157)
హితమును (3_205)
హితుఁడపోలె (6_146)
హితోపదేశంబు (6_219)
హిమకరు (1_14)
హిమద్యుతి (4_114)
హిమవంతంబు (2_124)
హిమవన్నగ (5_47)
హిరణ్మయ (4_53)
హిరణ్యబిందు (తీర్థంబు) (8_135)
హిరణ్యాది (దానంబుల) (6_136)
హింస (5_59; 7_145)
(ఉపాయ) హీనత (5_210)
హీనమతులు (6_254)
హీనసత్త్వంగా (6_301)
హీనుఁడై (6_68)
హీనులై (6_194)
హుంభుక్ (ప్రళయంబు) (8_305)
హుతాశనంబు (6_90)
హృదయంబు (1_10)
హృద్యంబై (4_90)
హృద్వనజంబు (1_75)
హృష్టహృదయుండై (6_81)
హేతుభూతుండు (1_142)
హేతువు (2_131)
హేమకవచావృతుఁడు (6_16)
హోత (2_210)
హోమకర్త (8_194)
హోమ కార్యము (8_128)
హోమధేనువు (3_111)
హ్రద ప్రవేశంబు (1_50)

II. *తద్భవములు :* ఆంధ్రము నందలి సంస్కృత ప్రాకృత భవములు నాలుగు వేలు _ హకారాదు లీ దిగువప్రదర్శితము[14].

*1. హంకారము :* అభిమానము, అహంకారము. 'హంకారములకెల్ల నాటపట్టు' (చంద్రా. 2 _) (శ. ర.)

ప్రాకృత. అహంకార :_ అభిమానము, గర్వము

సంస్కృత. అహంకార _

*2. హత్తము :* చేయి

ప్రాకృత. హత్థమ్, హత్థో

సంస్కృత. హస్త _

---

14. వీనికి అత్తెము, అనుమ, అరిదళము, అరుసము, అళది, ఆమిత, ఇతవు, ఉడుక్కు ఇట్టి అజాదిరూపములను సిద్ధము. అంచ, ఇంగువ మొదలగు తద్భవములలో హకారాది రూపములు మృగ్యము.

3. హత్తి : ఏనుఁగు. 'హత్తినాదంతి' (వేంకటే. తిర్య. 93; సాంబ. తిర్య. 72); '...సింగంబనా హత్తిగొంగ...' (చౌడప్ప సీసములు 10)[15]. ..తా వాచకము. 'బత్తి వత్తిల్ల నారాచహత్తి వలికె' (బహులా. 3-30).

ప్రాకృత. హత్థి.

సంస్కృత. హస్తిన్.

4. హనుమ : హనుమంతుఁడు. 'హనుమకనిలజుఁ డనియెన్' (అరణ్య 3-345).

ప్రాకృత. హణుమ –, అణుఁఅ.

సంస్కృత. హనుమత్, హనూమత్.

5. హరిదళము : తాళకము. పీతకము. 'నిద్ర మేల్కాంచిన నెత్తమ్మి మొగడల పరువంపుఁ బుప్పొళ్ళు హరిదళములుగ' (కాశీ. 1-123). 'హరిదళము చుట్టువెలయ నంతరము గిరి (పార్వతీ. పంచమా., పు. 90).

ప్రాకృత. హరి అల, హరి అలీ, హరి తాల.

సంస్కృత. హరితాల –

6. హరుసము : సంతోషము. 'పర హితుఁడైన వానికి శుభంబు లభించిన నెల్ల వారలున్ హరుసమెకంద్రు...' (ఉ. రా. 2-194). 'హరి రమ్మనియె నటన్న న్ హరుసముతో వారు నలువు రతివినయము నన్' (దశా. 9-18).

ప్రాకృత. హరిస –

సంస్కృత. హర్ష –

7. హళ(ళి)ది: హరిద్రావర్ణము. 'హళది పట్టంబు కటిసీమ నమరువాని' (పాండు. 3-166). (హళది పట్టె సమ్మాళిగెల' (బహులా. 1-105). 'పట్టుతలాడయున్ హళదిపచ్చ...' (పాంచాలీ. 5-10). 'పైనిండఁ బర్విన పద్మరాగముల్ హళది తాపిత చాయ ననుకరింప...' (వాల్మీకి. ప్రథమా. పు. 29). సబిందుక మనుటకు నిర్ధారక ప్రయోగములు మృగ్యము.

ప్రాకృత. హరిద్దా, హలద్దా, హలద్దీ, హలిద్దా, హలిద్దీ.

సంస్కృత. హరిద్రా

8. హామిక : క్రొవ్వు, గర్వము, మదము. 'హామిక' (రాధికా. 3-3, యామినీ. 4-83), 'హామికల్' (సత్యభామా ద్వితీ.: అనిరుద్ధ. 3-102). హామిక సంస్కృతమని శబ్దార్థదీపిక, పు. 1418.

ప్రాకృత. అహమహమిఅ, అహమహమిగా, అహమహమియా: అత్యుత్కంఠ

సంస్కృత. అహమహమికా.

9. హితవు : శ్రేయము. 'నీవు హితవు క్రియగొనఁగాఁ బల్కెడు వాఁడవు...' (ఆది. 8-40); యుక్తము. 'హితవుమఱచు రాజులు...' (శాంతి. 3-247).

ప్రాకృత. హిఅ, హియ –

శౌ. ప్రాకృత. హిద –

సంస్కృత. హిత –

10: హుడుక(క్క) : చిన్న డమరుకము. 'హుడుకు నాఁదనర్చు హుడుక్కపేరు' (ఆం. భా. 1-128). దేశ్యమనియు, వస్తుతః అజాదియనియు ధ్వన్యనుకరణమనియు దీని వ్యుత్పత్తి వివాదగ్రస్తము.

దే. ప్రాకృత. హుడుక్క : వాద్య విశేషము

సంస్కృత. హుడుక్కా.

III. కన్నడ పదములు[16] : 1. శుద్ధ దేశ్యములు. (ఎ) పతి గన్నడమున పకారాదులుగానుండి, హళగన్నడమున హకారాదులుగా వికృతులు, తెలుఁగున కర్ణాట దేశానేయములు –

1. హంగు : అనుకూలము, సౌకర్యము, యుక్తము. 'వేసమునకునైన దాసరిగావచ్చు హంగు దప్పువేళ జంగమగును' (వేమన; బ్రౌణ్యము, పు. 1111). 'హంగుగ వేడఁ బోయి...' (కవిచౌడప్ప)

కన్నడ. హంగు, పంగు: కృతజ్ఞత, గౌరవము; ఉచితము

2. హణిగ : నతివిశేషము, ఫాలము వంచి నమస్కరించుట. 'నీలాచలనమున నెలకొను పురుషోత్తమునకు హిణిగలు దండిగఁ జేర్చుచు' (హంస. 4-214)

కన్నడ. హణి; హణె : నుదురు; పణె: నుదురునకు సంబంధించిన.

3. హత్తు : జతచేయు. చేర్చు, కలుపు. 'గోదిగజాతిలోఁ గొదమపెంటులనేర్చి మావుల హత్తించు మార్దవంబు' (విరా. 1-94). 'కుంకుమ హత్తించి కొనగోరఁ దీర్చిన...' (ఉ. హరి. 3-86). 'క్రొత్తు లత్తుక హత్తించె...' (నై. 6-44). 'మంత్రుల్ హత్తియిరుగడల నుండఁగ. (ప్రబంధ. 599).

కన్నడ. హత్తు. పత్తు: జోడించు, జతకలుపు.

4. హదను : యుక్తసమయము, అక్కఱగలతతి. '...మాన్యసుహృజ్జన బంధుకోటికిన్ హదనున మేలుసేఁత...'

15. చౌడప్ప సీసములు, Ed. by N. S. Sundareswara Rao, Bulletin of the Govt. Oriental Manuscripts Library, Madras, 1950. pp. 55-70.

16. రాయలసీమలోని హగరి, హంచన హాళ, హనకన హాళ, హాలహర్వి, హావళిగి, హిరేహాళ, హువ్విన హడగలి, హొన్నూరు, హొళగొంది, హొసకోట, హొసపేట, హొతూరు - మున్నగు హకారాది గ్రామ నామములు కన్నడ ప్రభావ ద్యోతకములు. హత్తు మువ్వరగండ, హన్నిబ్బరగండ ఇత్యాది హకారాది బిరుదావళి ప్రస్తుత పట్టికలో పరిత్యక్తము.

(నై. ౘ_14), 'ఒహారి నాహారిం ... ఆ హదనం జెలంగు జనమాంతము నూళ్ళకుఁ బోవరామియున్' (ఆము. 4_93, 'హ' ప్రాసఘటితము), 'ముదుసళు లవ్వయుఁ దాతయు. హదనునజనకుండు తీర్థయాత్రకు వెడలెన్' (కృ. శకుం. 3_17).

కన్నడ. హదను, పదను: యుక్తము, తగినది; కార్యానుకూలము.

*5. హరిగోలు* : అరిగోలు, ఏఱుదాటుట కుపకరించు తోలుపుట్టి. 'పరంగులహరిగోలు గుంపునా...' (శుక. 3_319).

కన్నడ. హరి గోల్: పరుగెత్తు; హరి = ప్రవహించు; ప్రవహించుట; పరి = ప్రవాహము.

*6. హరివాణము* : తట్ట, పళ్ళెరము. '...కుందనంపు హరివాణమునన్ మధుపర్కమయ్యెడిన్' (వేం. పంచ. 4_356). '...పసిఁడి హరివాణమునన్ ... మధుపర్కంబునన్' (మను. 5_77). 'పసిఁడి హరివాణముతో' (అచ్చ. రా. బాల. 48). 'తెలెహరివాణంబు తలియ కంచము తట్ట పల్లెరమనఁ జెల్లుభాజనంబు' (వేంకటే. మానవ. పద్య. 47). '...హరివాణమనన్.. పళ్ళెరముపేరు' (రామాయణము కృష్ణయ మాత్యునిదేశవామూర్థకోశము, పద్య. 23). హరివాణము సంస్కృత పదమను కొందఱ (శ. ర.. ఆం. వాచ. శబ్దార్థ చంద్రిక, శబ్దార్థ దీపిక, శ. ర. అను.) నిరూపణము నిరాకరము. సంస్కృత కోశములలో మృగ్యము.

కన్నడ. హరివాణ, పరివాణ: పళ్ళెరము, తట్ట.

*7. హరువు (ర్వు)* : మనోహరము, యుక్తము. 'హరువైనహూనాణి యరఁగుల' (సుదక్షిణా. 5_195). 'జవ్వాది పదనిచ్చి క్రొవ్విరులుమ్మడిచెఁ బెన్నెఱివేణి కొక వింత హరువు లెసఁగ' (శుక. 1_226). 'హరువొప్పన్...' (తారాశ. 3_101). 'హరువు మీఱఁగఁ గై సేసి...' (దశా. 8_225). 'అందు విశేషములందుహర్వులు' సారంగ. 2_63).

కన్నడ. హర్వు, హరువు : రీతి; సాధనము; యుక్తము.

*8. హళ (ళా) హళి* : త్వర. 'హళాహళిన్' (మను. 4_98). 'హళా హళి మెయిరాగ' (సారంగ. 3_117); ఉద్ధతి. 'సైనికావళి హళహళికిన్ జెదర్విఱిఁగె...' (ఆము. 3_16). '....మారుండు తీవ్ర సుమాస్త్ర ప్రహతిన్ హళాహళి యొనర్పన్...' (శుక. 1_199); ధ్వని. 'చంచలవీచీ సంచయ సముచిత హళహళి కలతో రాయంచలు మ్రోయన్...' (కళా. 6_225)' 'మంచపు హళహళలును' (రాధికా. 4_102).

కన్నడ. హళహళ, హళహళి, హళహళికె, ఫళఫళ : ధ్వన్యనుకరణశబ్దము. తెలుఁగునందలి ఫళఫళ, పెళపెళ, ఫెళఫెళ_లు దీనికి తోఁబుట్టువులు. 'పెళపెళ యనుచు నుఱిమె' (నిప్ర. 3_64). '.... ఫళఫళని, దవుడలు కరములఁ దాటించుకొనుచు' (ద్వి. పరమ. ద్వితీ. పు. 138). ఫళఫళ పయః పృషత్పరం పరలు గురియ' (హంస. 5_61) 'ఫెళఫెళఫెళ మంచు పటిలు పడిన' (దశా. 4_217).'ఫెళ ఫెళ ఫెళ మంచు విల్లువిఱిఁగె' (దశా. 7_204) తెలుఁగున నివి ఆమ్రేడిత ధ్వన్యనుకరణములు. 'హళ (ళా) హళి' సంస్కృత సమాసమున నుండుటయె కారణముగా సంస్కృతమని నిరూపించిన నిఘంటుకర్తల నిర్ణయము అగ్రాహ్యము.

*9. హవణికె* : ఒప్పిదము. 'హవణికె' (రాధికా. 1_131); హవణు : రీతి. 'ధవళముల్ విని చొక్కు హవణుఁదెల్పెడు లీల' (విజయ. 1_129); హవణించు : అందగించు. 'మించు హవణించు కనుంగవ' (సుదక్షిణా. 3_67) 'హవణించు వన్నె దగంవడి తళ్కొ (సత్యభామా ద్వితీయా.); అలంకరించు. 'పయ్యెద చెంగావి పావడ హవణించి' (తారా. 4_81). 'హవణింపఁగా నేర్చు' (పాండు. 1_52).

కన్నడ. హవణిగె = ఉచితము; ఒప్పిదము; కూర్చుట, చేర్చుట.

*10. హాయి*: సౌఖ్యము. 'హాయి న్నన్ను లాలించి' (సత్యభామా. తృతీయా). 'హాయిగ మను నుచితవృత్తి నచలుం దనఁగన్' (పైది. చతుర్థా.). 'హాయిగా' (అహల్యా 3_97, రాధికా. 1_145)

కన్నడ. హాయి, పాయ్, పాయి : ఇంపు; ఆహ్లాదము; సౌఖ్యము. తెలుఁగునందలి 'హాయి' భారతీయేతరమగు అన్యదేశ్యమును చిలుకూరి వారి నిర్ణయము (ఆం. భా. చ. పు. 598) ప్రామాదికము.

*11. హాళి* : వరుస. క్రమము 'హాళి నేఁ జేఁట మీరు వేటాడుకతన (యయా. 1_106) 'ఆయా వినోదంబు లెల్లను హాళిన్ విని' (సారంగ 1_118); ఆసక్తి. ప్రీతి. 'హాళింబుట్టిన కాఁక నొద్దతివి' (జై. 3_42) 'భువనాళిని హాళిఁ జరింతు' (పాండు. 2_217). 'బ్రహ్మరుద్రాది దేవతా ప్రభులు మీఁది హాళియును మాని...' (ఉ. రా. 1_28). 'నీపై హాళిం జిక్కితి' (వి ప్ర. 3_88).

కన్నడ. హాళి, హాటి: క్రమము; నియతి; యుక్తరీతి.

*12. హావడి (ళి)* : ఉపద్రవము. 'సమీప దేశముల్ హావళిఁబోవకుండ..' (విష్ణు. పు. 2_132). '...ఇంచుక యగ్గెనేని లోకావళి హావళిం గను...' (ఉ. రా. 5_76).

'హావడి యావడి యన నుపద్రవసంజ్ఞ...' (ఆం. భా. 2_223); బాధ; చిక్కు. 'వర్షంపు నెవ్వన్ రుజన్ హావళ్ళం దిగునన్య భూప్రజల...' (ఆము. 4_245), 'మరునిహావళి' (హంస.1_101); కష్టము. 'ఆవర్షాభూవిభునకు హావళి దఱచయ్యె' (పాండు. 5_309); నాశము. 'హావడి హావడి సేయును, సావడి లింగన్నమంత్రి..' (శేష. 1_84).

కన్నడ, హావళి: కష్టము; చిక్కు; కలఁత, తొందఱ; హాడు + వళి; హాడు < పాడు: బాధ; నాశము: తద్భవ మని డా. చిలుకూరి. కన్నడమునుండి యని బ్రౌణ్యము, పు. 1129.

*13.* హుటాహుటి : గమన వేగము. 'తేరు హుటాహుటిం గదలి' (జై. 6_77), 'హుటాహుటిఁ జేరనరిగి' (వరాహ. 2_4), 'హుటాహుటిం బఱచి' (వేం. పంచ. 2_192), 'తవతవలేకరుగుదుము హుటాహుటి నడలన్' (మను. 1_76), 'హుటాహుటి నడలతో' (శుక. 1_254).

కన్నడ. పుట; పుటపుట: గంతులు వేయు; దూఁకు; హుటహుట; 'వీప్సానుకరణాభీక్ష్ణ్య...చాపలాదౌ పదస్య ద్విర్వచనం' అని కర్ణాటక భాషాభూషా భూషణము, 192 సూ, ఇట ధ్వన్యనుకరణము. 'పుటపుటగా వీధివెంట...తిరుగు...' (హంస. 5_24) 17.

*14.* హుళ(ళి)క్కి : అసత్యము, దబ్బఱ; వ్యర్థము. 'ధనము నిప్పచ్చరము విద్యయు హుళిక్కి' (కాశీ. 4_111), 'లేదరంబు తత్తడి హుళిక్కి సహాయము సర్వమంగళంబు...' (మను. 4_105), 'హుళక్కి' (బహులా. 5_169, యామినీ. 3_129, ఆంధ్రనామసం. మానవ. 58, రాధికా. 4_70), 'హుళక్కి' (అచ్చ. రా. అయో. 32, నీలా. 2_72; రామా. పు.6; పెద్దాడ. శకుం. 1_50) హంస. 2_146, ఆం. భా. 1_119).

కన్నడ. హొళ్ళు, పొళ్ళు.

*15.* హుసి: పొల్లు, అసత్యము; వ్యర్థము. '...దివాణపువారి చేతికాఁకలు హుసివోవఁగాఁ గఱవు కాల మెఱుంగ...' (శుక.2_406), 'హుసియని... పుళిందులు కఱకుమీఱి' (ప్రబంధ. 788).

కన్నడ. హుసి, పుసి: వ్యర్థము; పొల్లు, బొంకు; హుసిగ: అసత్యవాది; 'పుసియిల్ల దాట్మి' (వెంకయ చోడని దొంగలసాని కనుమ శాసనము, పంక్తి 21). 'పుసియిల్ల దాట్మి' (= పొల్లుకాని తాలిమి కలవాఁడు) కర్ణాటభాషా ప్రభావద్యోతకమగు బిరుదము. 'సీకేడ నిజభక్తి సీకేడపాటి, పుసిగప్పు మాటలఁ బ్రొద్దుపుచ్చితిరి, వసుధేశులే యూరు వ్రతము లేయూరు...' (చితారు – గంగాధర కవికృత మగు భల్లాణ చరిత్ర, పు. 61). పుసి > పొయ్, పొయి: కృత్రిమము, మాయ; పొయిదల: కృత్రిమ శిరస్సు, చోరసాధన విశేషము. 'పొయిదల నీలిదిం దొలికి బూడిద ముండులబంతి ..' (దశకు. 5_72); పొయ్ + ంకు > బొంకు: అసత్యము.

*16.* హూ : పూవు. 'వలపలి చలిగాలి వలన నల్లాడు, వెలఁది హూబాళెలె వీచో పులుగను' (ద్వి.పరమ. తృతీ. పు. 241).

కన్నడ. హూ, పూ; హూవు, హువ్వు: కుసుమము.

*17.* హెగ్గడి : పరిచర్య నిమిత్తము రాజ సన్నిధినుండు వ్యక్తి, హుజూరుతైనాతి హెగ్గడి (కువల. 4_40) 'హెగ్గడులు' (కళా. 8_30, బహులా.3_23), '...వాకిటి వారి నచటి హెగ్గళ్ళఁ బరిచారకులఁ బెక్కుభంగుల నడిగి' (ద్వి. పరమ.తృతీ పు209), 'హెగ్గడుల్ కైవార ముగ్గడింప' (పాంచాలీ. 2_13), 'హెగ్గడి కత్తియలు' (శుక. 3_315, తపతి. 1_12 రాధికా. 3_5), 'హెగ్గడికత్తెలు' (కళా. 2_73) 18.

కన్నడ. హెగ్గడె, పెగ్గడె: ప్రధాన మంత్రి; పర్యవేక్షకుఁడు; కంచుకి; పెగ్గడె < పెర్గడె. పెర్గడ అనునది తెలుఁగున వర్ణవ్యత్యయమునంది ప్రెగ్గడ ప్రెగడ యయినది. కన్నడమున వర్ణసమీకరణమునంది పెగ్గడె, హెగ్గడె యయినది. అమాత్యుఁడు, నియోగి అను నర్థముల తెలుఁగున ప్రెగ్గడ ప్రసిద్ధము. 'దగ్గఱ కొండెము చెప్పెడు ప్రెగ్గడ పలుకులకు రాజుప్రియుఁడై మఱిదా నెగ్గు ప్రజ కాచరించుట' (సుమతి), 'ప్రెగడల మనసులు విరసము - లగుగతి...' (ఆశ్రమ. 1_70), 'భృత్యులుఁగరణముల్ ప్రెగడలుగాగ' (పండితా పర్వత. పు. 474). అక్కనప్రగడ, అన్నాప్రగడ, కేసన ప్రగడ, చెన్నాప్రగడ, తల్లాప్రగడ, మంత్రి ప్రగడ, మానాప్రగడ, యల్లాప్రగడ, రామా ప్రగడ, రెబ్బాప్రగడ, విస్సాప్రగడ, సిరి ప్రగడ – మొదలగు గృహనామములలోని ఉత్తరభాగమగు 'ప్రగడ' పెగ్గడకు వికృతి. మన కవులలో ఎఱ్ఱన యొకఁడే 'ఎఱ్ఱాప్రెగ్గడ'గా కీర్తితుఁడు. ఈ 'హెగ్గడి' సంస్కృత 'హేడక' పదజన్యమను అంచనా అగ్రాహ్యము. కన్నడమునుండి యని బ్రౌణ్యము, పు. 1133.

---

17. Cf. మరాఠీ. హుట హురణేఁ. అ. క్రి, ఆత్రపడు. సంస్కృతము నందలి 'హూడ్' గతౌ (ఆత్మనే.) హూడతే – తో ముడిపెట్టుట చింత్యము

18. హిగ్గడీ, హిగ్గడికత్తె, హిగ్గడు, హొగ్గడి (బ్రౌణ్యము, పుటలు 1130, 1133, 1136) అను రూపములు పరిహార్యములు.

*18.* హెగ్గాళ : పెద్దకాహళ. '...తద్దళ కంతు నెట్టనెదురున్ రాకాసు లవ్వేళ హెగ్గాళల్ వట్టిరి...' (రామా. 8_74); హెగ్గాళెలు (అ. మ. క. పు. 191).

కన్నడ. హెగ్గాళె. పెగ్గాళె, పెర్‌గాళె; పెర్(=పెద్ద) + కాళె(= సం. కాహళ).

*19.* హెచ్చు : అతిశయము; అతిశయించు, వర్ధిల్లు. '... అమరవర్యుల మొనలకున్ హెచ్చుగ దిక్పతి సేనలు వచ్చుటయును...' (నిర్వచ. 6_126). 'రాలచ్చికినై పెనంగిన బలంబులు రెండును గెల్వనేర్చునే హెచ్చుగుఁ గుందగున్...' (విరా. 4_234), 'హెచ్చుగుందాడఁ బని లేదు...' (హర. 4_22). 'మన కనురక్తి హెచ్చ నిదెమందని కంఠముఁగౌఁగిలించి..' (ఆము. 1_70).

కన్నడ. హెచ్చు, పెచ్చు పెర్చు: అతిశయించు, వృద్ధి యగు, పెంపొందు.

*20.* హెద్దొర : పెద్దనది; ఒకానొక నది. 'ఉరవడి నుప్పొంగి యుడుపీథి దాఁకి, హెద్దొర యనునది యిల నిండి పాఱఁ' దద్దయు నుద్వృత్తి ధరఁదన్ని నిలిచి...., (బస. పు. పంచమా). 'హెద్దొర యనునది యిల నిండిపాఱ' అని కాశీనాథుని నాగేశ్వర రావుగారి ప్రతి, పు. 160; వావిళ్ళవారి ప్రతి, 1952, పు. 376 'హెద్దొర యనునది యిల నిండిపార' (అని తాళపత్ర ప్రతి, ఆంధ్ర విశ్వకళా పరిషద్గ్రంథాలయము. నెం. 32377, 281 వ ఆకు, రెండవవైపు. 1 వ పంక్తి), హెద్దర యనునది యిలనిండి పార (అం. విశ్వ. గ్రంథాలయ తాళపత్ర ప్రతి, నెం. 29745, 103 వ ఆకు, రెండవ వైపు). బ్రౌనుదొరగారికి లభ్యమయిన తాళపత్ర ప్రతులయందును 'హెద్దొర' యను పాఠమే ఉండినట్లు స్పష్టము (చూ. బ్రౌణ్యము, పు. 1134); తులనాత్మక పరిశీలనము వలనను 'హెద్దొర' యే సాధు పాఠము[19].

కన్నడ. హెద్దొఱె, పెర్దొఱె, పెర్ + దొఱె (పెర్ < పేర్ = పెద్ద). కన్నడ బసవపురాణమునను 'హెద్దొఱె' యను పాఠమే కలదు.

*21.* హేమాహేమీలు : దొరా దొరలు; అధికులు, పూజ్యులు; ఘనులు. (వరాహ. 10_8, హంస. 1_212).'బహుత నన్యులఁ దెల్పు పట్ల హేమాహేములను పల్కు పూజ్యార్థమగుచు నుండు' (ఆం. భా. 3_16), భారతీయేతరమయిన అన్యదేశ్యమని డా॥ చిలుకూరి (ఆం. భా. చ. పుటలు 593, 598), హెడ్ మాస్టర్, హెడ్‌మిస్ట్రెస్‌లే (పొడి అక్షరాల కూటమిచే) హేమాహేమీలయినా రని మిత్రులు, ఏలేశ్వరోపాధ్యాయులు శ్రీ సురభి నరసింహముగారి చమత్కారము.

కన్నడ. హెమ్మె: ఆధిక్యము; ప్రభుత; శ్రేష్ఠత; ప్రభవిష్ణుత; హెమ్మెగాఱ: ఉద్ధతుఁడు; అధికుఁడు; గర్వి; పెర్మె: పేర్మి. *హెమ్మె హెమ్మె. వీప్సాద్యర్థేషు వివక్షితేషు పదస్య ద్విర్వచనం భవతి' (కర్ణాటక భాషాభూషణ వృత్తి, పు. 70).

*22.* హేరాళము : ఆధిక్యము; సమృద్ధి. 'ఎడవెల్తైననులేక పెక్కుదినముల్ హేరాళమై వర్షముల్ జడిగాఁబట్టి...' (హర. 2_26). 'ఇంద్రాణితోఁగూడ హేరాళముగఁ దీర్చెఁజాముండదివ్యభూషావ్రజంబు'(పై ది. 4_90). 'ధనము హేరాలమబ్బె...' (కాశీ. 7_254), హేరాళపుంగాంతులన్' (మను. 5_48), 'హేరాళములైన మోహపువిరాళితనంబుల' (విష్ణు పు. 6_21). హేరాళంబగు వేడ్క' (దశా. 2_419); హేరాళము సంస్కృత మను మన నిఘంటుకారుల నిర్ణయము సత్యదూరము. హేరాళక్రీడా సంచారిణి నూకాంబ భక్తజనరక్షకునై, (భీమ. 1_101), 'ముక్తికాంతా హేరాళసుఖంబు గోరెదవు' (నిరంకుశో' 3_44) మున్నగు ప్రయోగములు ఉద్ధతులగు ఆయా కవుల ప్రౌఢవాక్పాటవమునకు నిదర్శనముగా స్వీకరించుట సముచితము.

కన్నడ. హేరాళ, ఘేరాళ: ధారాళము, వెగ్గలము; ఔదార్యము; విస్తారము; ఆధిక్యము.

*23.* హేళగీఁడు : కథలు చెప్పువాఁడు. 'పొరిఁగులచ్చిరియారు భువిహేళగీఁడు' (బసవ. పు. ద్వితీ. పు. 105)[20].

కన్నడ. పేట్, పేటు, హేటు: చెప్పు, పేర్కొను; పేటికె. హేటికె: కథనము; ఆజ్ఞ; హేళిగ.

*24.* హొనరు : అందము; ఇంపు; పొందిక. 'పెంపుమీఱు వసంత ఫేషవాహుజురునుండి చెలామణి హొనరు దెలుప...? (అనిరుద్ధ. 3_19), 'నీహొనరెల్ల నేర్పఱుపు నేర్పరి వాదువు విస్పురద్వరా రోహయటన్న పేరు దగు రూఢిగ నీయెడ సుందరీమణీ' (గోగులపాటి కూర్మనాథకవి సుందరీమణి శతకము, పద్య.37).

కన్నడ. హొణరు. పొణర్, పొణరు: కలయిక, చేర్పు; జోడు; అందగింపు.

*25.* హొన్ను : బంగారము; బంగారు నాణెము. 'లాలనతో నిచ్చెలకహొన్నులను'

19. 'కనియెన్...స్వర్ధునికిన్ బెన్నుద్ది హొద్దొరు వరనది...' (పిడపర్తి బసవ పురాణము, 5_200, వావిళ్ళ, 1925), ఇందలి 'హొద్దొరు' సాధు పాఠముగా కన్పట్టదు. 'హెద్దొర' అని యుంట యుక్తము.

20. హేళగీ (K) a large basket. బ. పు. 2_986 అను బ్రౌణ్యము (పు. 1135) నర్థము సరిపడదు.

(చిత్తారు గంగాధరకవి శృంగార భల్లాణ చరిత్ర, పు.20). హొంగాళె; హెంగిండ్లను' (కృష్ణరా. 4–75). 'హొంగుబ్బలి' (అచ్చ. రా. యు. 598). 'హొంగోక' (రాధికా. 1–78). 'హొందగటు' (యామినీ. 4–70). 'హొన్నంచు' (మను 5–42, ఘటికా. 2–11, ప్రబంధ–605, దశా.2–66, హంస. 5–359). 'హొన్నందెలు' (ప్రబంధ.273). 'హొన్నాణియరఁగుల' (సుదక్షిణా. 5–195). 'హెన్నాణిపట్టు' (పైది.2–128). 'హెన్నుజిగిమేనులు' (ఉ. రా. 5–248). 'హొంబట్టుకులాయలు' (దశా. 7–34). 'హొంబట్టు గవిసెన' (వాల్మీకి. తృతీ. పు. 119). 'హొంబట్టు జిలుగురెండెంబు' (అము. పీఠిక, 12). 'హొంబట్టు తలగడ' (ప్రభా. 4–144). 'హొంబట్టు దట్టి' (సారంగ. 1–79). 'హొంబట్టు పట్టెడ' (పైది. 3–147). 'హొంబట్టుపఱపు' (రంగా. 3–254). 'హొంబట్టుపాగ' (కళా. 8–35). 'హొంబట్టుపుట్టముల్' (పాండు. 1–165). 'హొంబట్టు బటువులలో' (కళా. 2–167). 'హొంబట్టుబొందు' (యామినీ. 4–70). 'హొంబట్టు రవిక' (పల్నాటి. పు. 65). 'హొంబట్టులోడీలు' (హంస. 5–360). 'హొంబట్టు వలెవాటు' (పాండు. 1–198). 'హొంబట్టుహరువుతెర' (భోజసుతా. 4–112). 'హొంబుట్టము' (రామా. 3–35). 'హొంబొమిడిక' (అచ్చ. రా. సు. 34).

కన్నడ. హొన్, హెన్ను, హొం, పొన్, పొన్ను, పొం: బంగారు; బంగారపు

*26.* హొమ్ము : స్థూలమయినది; పెంపు; అతిశయము. 'హొమ్మైనకుతి నీ గుడారులోన' (సత్యభామా. తృతీ). 'తోరముహొమ్మ...స్థూలము చెలంగు' (సాంబ, మానవ. 49).

కన్నడ. హొమ్మ: వృద్ధి, పెంపు; స్థూలమగు' దశసరియగు.

*27.* హొయలు : విలాసము 'వివిధ విచిత్ర నవీనవస్త్రముల నవధరించిన లింగ నివహంబు హొయలు' (పండితా. పర్వత. పు. 319), 'హొయలు గుజ్జరినేఁత' (సారంగ. 3–147), "హొయలు గాగంధంబు మెయినిండఁ బూయుచో...' (రాధా మాధవ సంవాదము, పు. 10). 'ముద్దు గుమ్మ హొయలు' (హంస. పు. 2–146), 'హొయల్ బందులు' (ప్రబంధ. 605).

కన్నడ. హొయల్, హొయిలు.

*28.* హొరంగు : విలాసము. 'బంగారు హొరంగు సింగపు రతనంపు గద్దియ' (కృష్ణరా. 1–20), 'మేల్ హొరంగు చందువలు' (తారాశ. 4–170), 'తళుకు హొరంగు పెండియము' (రాధికా. 2–107), 'దానిహొరంగు' (సత్యభామా. తృతీ).

కన్నడ, హొరె, పొరె = వర్ధిల్లు, అతిశయించు; ఉత్సాహము

*29.* హొస : క్రొత్త, నవీనము, 'హొసయనఁగ మీఱునవంబు (ఆం. భా. 3–23) 'హొసతమ్మి' (ప్రబంధ–750) హొసపరి : మనోహరము, సుందరము. 'బిసబిస విసరెడి హొసపరి సురటిపిట్టల...' (రాధికా. 4–102) 'ఈహొస' మన అకారాది నిఘంటువుల కెక్కలేదు. క్రొత్తది, నూతనము, నవము, అను నర్థములతో 'హాస'యను ఆరోపము కొన్నింట (లక్ష్మీనా; ఆం. వాచ.) సంగ్రథితమయి ఆంధ్రభాషార్ణవ ప్రయోగమే ఉదాహృతమగుట వింత. ఈ నిఘంటువులను నమ్మిన శబ్దార్థదీపిక (చూ. పు. 1419)యు 'హాస' ను ఆరోపముగా నిచ్చినది 'క్రొత్తమిహి హొసయనఁగ మీఱును నవంబు' అను ఆంధ్ర భాషార్ణవము నందలి 'హొస'ను 'హాస'గా పఠించుట వలన కలిగిన తబ్బిబ్బిది. ఆంధ్రభాషార్ణవము ముద్రిత ప్రతులు – చెన్నపురి, వ – ఎతిరాజులు నాయునిచే శ్రీ చింతామణి ముద్రాక్షరశాలయందు, 1899 లో ముద్రితమయి ప్రచురితమయిన ప్రతి. (పు 86), 1912, 1931 నాఁటి వావిళ్ళ ప్రతులు (పు 88)–'హొస' పాఠఘటితములు – 'హా', 'హొ'లు రెండును కంటికి ఒకటిగా కన్పట్టునవి కావున ఈ ప్రమాదము దొరలియుండ నోపు; లేక లక్ష్మీనారాయణీయ కర్త చూచిన ఆం. భా. ప్రతిలో 'హాస' యను పాఠమే ఉండినదేమో? ఏది ఎట్లయినను 'హాస' పరిహార్యము[21].

కన్నడ. హొస, పొస : క్రొత్త; క్రొత్తది, క్రొత్తదనము; హొసగన్నడ : నవీనకర్ణాటభాష; హొసపేట; క్రొత్తపేట ( = ఒకానొక పట్టణనామము); హొసదు = క్రొత్తది.

*29 a.* హోర; నేర్పు, ఉపాయము; తెలివి. హోరగల కోరమీసల హొయలువాని' (కృ. శకుం. 2–45).

కన్నడ. హోఁగె, హోరె, హోరెవు : ఉద్యమము, వ్యాపారము; సామర్థ్యము.

*30.* హోరాటము : ఆటోపము: వేగిరపాటు, సంభ్రమము; వివాదము. '...వీరోద్రేకంబున దాపలన్ వలపలన్ హోరాటమై ముంచి సర్వద్రోహిం బరిమార్తమంచు...' (నిర్వచనో. 6–132) 'ఒకనాఁడా తమ

21 అత్యంతము, మిక్కిలి అను నర్థములతో 'హాలెము' అను ఆరోపమును ఇట్టి తబ్బిబ్బుల వలననే కొన్ని నిఘంటువుల (ఆంధ్రవద పారిజాతము. పు. 792, లక్ష్మీనారాయణీయము, పు. 822, ఆం. వాచ. పు.2814, శబ్దార్థ చంద్రిక, పు. 931, శబ్దార్థ దీపిక, పు. 1419)లో కృతకముగా మూర్తికట్టుట. వాస్తవముగా నిది వాలాయమునకు రూపాంతమగు 'వాలెము'ను 'హాలెము' అని పఠించుటవలన దొరలిన తప్పు. 'హార్యము'ను పరిహార్యము.

ముందటన్ బలుమఱున్ హోరాటమై నేల యెత్తికొనంగా బవరంబులన్ గెలువఁగా..' (ఉద్యో. 1-280).

కన్నడ : హోరాట, పోరాట : బాహా బాహి యుద్ధముచేయుట; ద్వంద్వయుద్ధము. వివాదము, వాగ్వివాదము; ప్రతిభటత్వము.

*31.* హోరాహోరి : అవిరామమగు పోరు, నిరంతర కలహము. '...విజిగీషు వులై హోరాహోరిం బోరిరి...' (ఆము. 3-15). '...హోరా హోరిగాఁబోరి రిట్లిరు వాగుం దొరలంత...' (రంగా. 3-76); పట్టినపట్టు వదలకుండుట. '....చవిగాని యిందులకు హోరాహోరిగాఁబోరి యేలా వాలాయము సేయఁగా...' (మను. 3-94).

కన్నడ : హోరు, పోరు; యుద్ధము చేయు; వివదించు; పోరాటము; వివాదము. ఆభీక్ష్ణ్యమందు ద్విరుక్తి[22].

(b) *వర్ణవ్యత్యయము వలన పదాదిగా మాఱిన కన్నడ దేశ్యము.*

*32.* హవుదు : రూ. హౌదు. అవును, అంగీరమును దెలుపుమాట. '...బిరుదు పచారించి యచ్చాటుకారుల్ హవు దప్పా పాత్రరాయా యహహా బళి బళియంచుఁ బెల్లెచ్చరింపన్.....' (వైజ. 1-128); 'అమ్మక్క శబాసు మేలు హవుదంచు ఫణీశ్వరుఁ జూచి...' (కువల. 4-113).

కన్నడ: హౌదు, హవుదు < అహుదు < అప్పుదు (=అగును); ఇట్లే హీగె < ఇహగె (ఇట్లు. ఈ రీతిగా).

హౌదు ; చూ. హవుదు. 'ఔనే ముద్దుల గుమ్మ మేల్కితవునే యందంపు పూరెమ్మ హౌ దేనే చక్కదనాలయిక్క.....' (బ్రౌణ్యము, 1137). 'సామి చిత్తేశ హౌదయ్యసాహేబు పరాకంచు' (విద్యావతీ దండకము[23], పు. 93). 'హౌదయ్య సంచారి భావంబు లౌనౌను విభ్రామ చాతుర్యమున్..' (పైది.పు. 99).

(c) *నిసర్గముగా అజాదిరూపమైయుండి హకారాదిగా మాఱిన కన్నడదేశ్యము.*

*33.* హడపము : వక్కలాకుల తిత్తి. 'ముప్పిడీ హడపంబు' (ద్వి. పరమ. తృతీ. పు. 193), 'కాళాంజి హడపంబు' (పైది. పంచమా. పు. 427)[24].

కన్నడ. హడప. హడపగాఱ, హడపవళ : అడపమువాఁడు; అడప, అడపగాఱ, అడపవళ; అడకె, అడికె : పోఁకచెక్క; అడకొత్తు. అడకోతు; అడకత్తెర;

తమిళ. అడైప్పై ; తాంబూలపుతిత్తి; అడై : తమలపాకు; పై : తిత్తి, పొది,

దే. ప్రాకృత. హడప్ప : తాంబూల కరండము; ఆభరణ కరండము.

అ మాగధీ. హడప్ఫ : తాంబూల పాత్ర; కాని, యిది శుద్ధద్రావిడ పిండము. అజాది రూపమే నిసర్గము.

## II. కన్నడమున సంస్కృత ప్రాకృత భవము లయి తెలుఁగున ప్రతిదేయములు :

*34.* హజ్జ: అడుగు, పాదము. 'ఏనుంగు హజ్జలోనెల్ల సత్వంబుల హజ్జలు వడఁగినయట్ల పోలె....(శాంతి. 2-239). 'బలుహజ్జ మెకపుదాఁటులు' (అచ్చ. రా. యు. 184). 'హజ్జలిడున్ గుజ్జు తల్లి యానందింపన్' (దశా. 5-70).

కన్నడ, హజ్జె. పజ్జె < ప్రాకృత. పజ్జ- < సంస్కృత, పాద్య: పాదసంబంధి.

*35.* హణ: నాణెము. 'ప్రాఁతహణఁ జూచి నాడెంపుఁ బణ మటంచు' (బహులా. 5-14), 'శాంతుల సొమ్ములు వెలచేఁ గొంత, పడిం గొంత, కొలను గొంత, హణాచిన్ గొంత హరించు...' (పైది. 5-13).

కన్నడ. హణ, పణ: సంపద, డబ్బు; నాలుగణాల ఎనిమిది దమ్మిడీల విలువకలిగిన ఒక ప్రాఁతనాణెము.[25] > (ప్రాకృత. పణ <సంస్కృత. పణ -: ఒకనాణెము ; ఆస్తి, సంపద; జీతము; సంపాదన.

*36.* హంపి: పంపాక్షేత్రము. పంపా సరోవర తీరస్థము. 'అనగ మానసమున

---

22. ఇట్టివి ఆమ్రేడిత ధ్వన్యను కరణములని డా. చిలుకూరి నారాయణరావు, ఆంధ్ర భాషా చరిత్రము, పు, 502.

23. విద్యావతీ దండకము, గణపవరపు వేంకటకవి (క్రీ. శ. 1670) కృతము. Bulletin of the Govt. Oriental Manuscripts Library, Madras, vol. I, No. 1, 1948.

24. 'హాదులనియు వీలుగు లోనగువాని తొలి హల్లునకు లోపంబు బహుళంబుగ నగు' (సూ. 10, ప్రకి; బాలవ్యా.) క్రింది పట్టికలోని 'హడపము' అజాదిగా పరిణతమయ్యె ననుట వ్యుత్పత్తి పరముగా విపరీత రీతి.

25. ధ్వనిపరిణామ సూత్ర బద్ధములైన స్వల్ప రూపభేదములతో భారతీయ భాషలన్నింట 'అణా' (=రూపాయలో పదునాఱవ వంతు) వ్యవహృతము. దీని వ్యుత్పత్తి యిందాఁక అనిశ్చితము. నాయూహ యిట్లు : కన్నడమున 'హణ', 'పణ' శబ్దబన్యము. 'హణ', 'అణ'గా పరిణతమయి కన్నడమున అణా, అణె,అణె రూపములు సిద్దము. కన్నడమునందలి 'హణ' నాఁటి పెద్ద నాణెమగు వరహాలో పదునాఱవ వంతు. అర్వాచీనకాలపు నాణెమగు రూపాయలో పదునాఱవ వంతు 'అణా'. నా యీ సమన్వయము సమాదరణీయ మగుచో అన్ని భాషలకును కన్నడము పెట్టిన భిక్ష 'అణా'; ఆంగ్లము నందలి 'Anna' హిందీనుండి యని ఆంగ్ల నిఘంటువులు, Vide : Rev. Dr. Skeat, C. T. Onions etc.

# కృష్ణవేణి

— కమ్మిశెట్టి

చవిచూపవే మాకు స్వచ్ఛ జలధారలో
ఆచార్య నాగార్జునుని దివ్య బోధలను
వినిపింపవే మాకు వీచికల రవళిలో
ఆంధ్ర ధరణీ యశస్సంగీత గాథలను
ప్రవహింపవే కృష్ణవేణి !
ఆంధ్రజనతా హృదయరాణి !!

దివ్యశాంతి పథాల నవ్యకాంతి పథాల
కదలిరావే మధుర కవితా స్రవంతివై
బ్రతుకు బీటలు వారి వెతల బరువుల క్రుంగి
కనలు హృదయాలపై కరుణా స్రవంతివై
ప్రవహింపవే కృష్ణవేణి !
రారావె పంచకల్యాణి !!

కండలను కరగించి ఘర్మజల మొలికించి
కార్మికులు శ్రామికులు పాటు పడుతున్నారు
కొండలను పగిలించి ఘోరాటవుల కూల్చి
నీ రాక కోసమై దారి తీస్తున్నారు
ప్రవహింపవే కృష్ణవేణి !
ఆలకింపవె ప్రజా వాణి !

ఆశలే చివురించి అలరులే వికసించి
కలలు రూపుగొని సాక్షాత్కారమే చేయ
పల్లె పల్లెలలోన పచ్చని చేలు
తల లూపి, తులలేని ధాన్యరాశులు పోయ
ప్రవహింపవే కృష్ణవేణి !
పులకింప తెలుగు మాగాణి!

ఉదయ చైతన్య వాయువులు వీస్తున్నాయి
చీకటి పిశాచాలు చెదరిపోతున్నాయి
అరుణ రేఖగ నీవు అవతరించే వేళ
హాయిగా తీయగా వినిపించె సన్నాయి
ప్రవహింపవే కృష్ణవేణి !
ఆంధ్రజనతా హృదయరాణి !

---

నుండి హంపినుండి ... వచ్చె ...' (కళు. 2_78).

కన్నడ. హంపె, పంపె: పంపా సరోవర తీరస్థమగు నొక పట్టణము > సంస్కృత. పంపా: దండకారణ్యమందలి ఒకసరస్సు; ఒకనది.

*37. హరిగ*; కేడెము. 'దురమున లక్ష్మణుండు నిహతుండగుడున్ గుళుఁ డచ్చలంబునన్ హరిగయు వాలుఁ గైకొని...' (జై. 6_189) 'హరిగలు తాటించి' (ప్రబంధ. 89). కన్నడ. హరిగె. పరిగె: డాలు, అడ్డణము > ప్రాకృత. ఫరఅ, ఫరగ, ఫలగ > సంస్కృత. ఫరక, ఫలక.

*38. హసాదు* : గొప్పవారి యాజ్ఞను విధేయులు మంచి దని యంగీకరించుట యందు వచ్చునది (శ. ర). 'అనిన భీతిలి హసాదని మంత్రు లెల్ల – వెను వెనుకకె వచ్చి వెలవెలంబాఱి' (ద్వి. పరమ, తృతీ. పు. 200). 'సామిహసాదని వార లూఁకొనన్' (సారంగ. 1_30). 'అతఁడు హసాదటంచతిరయంబున లంకకుఁ బోయి ...' (ఉ. రా. 2_235). '...సృష్టి సేయుమని శ్రీకాంతుండు పంపన్ హసాదని వాణీశ్వరుఁడు...' (దశా. 1_305). అని పద్మాక్షుఁడు పంపఁ జక్రము హసాదంచున్...' (పైది. 6_69). కన్నడ. హసాద, పసాద: బహుమతి, ఉడుగర < సం. ప్రసాదః: నివేదనము; బహుమతి, ఉపహారము.

*39. హొంతకాఁడు (రి)* : సాదనకాఁడు; గరిడి పనులలో పరిశ్రమించి గడిదేరినవాడు. 'జెట్టి తండంబుతోడఁ జేపట్టి హొంతకారి విరిచినయట్టుల గలికవిఱుతు' (విరా. 1_80). 'బ్రహ్మాండమన్ గరిడిన్ గాలపు హొంతకాఁడు...' (మను. 3_59) 'గరళంబు మ్రింగు బింకపు హొంతకారికిఁ గడిఁదియే యవనాళగ వ్రజములు' (వేల్పూరి – విస్సనకృతమగు విశ్వేశ్వర శతకము[26]. పు. 66). గరిడిలో నెఱహొంతకారులై సాముల మీరిన రాజకుమార మణులు...' (హంస. 2_10). 'హొంతకారి' (కువల. 4_96). 'హొంతకారి కవీంద్రులు' (తపతీ. 1_14) 'బిరుదువేసిన జెట్టి పరివారమగునట్టి వారొప్పుదురు హొంతకారులనఁగ...' (ఆం. భా. 2_208); నేర్పరి 'కలికి వయ్యారి బాగగు హొంతకారి' (ప్రసన్న వెంకటేశ్వర విలాస యక్షగానము[27].

కన్నడ. హొంతకాఱ. హొంతకాఱి, హొంతగాఱ (ఱి): నేర్పరి; శూరుఁడు; సమర్థుఁడు; హొంత: పథము, దారి > సంస్కృత. ? పంథ–.

*40. హోళిగ (లు)*: ఒబ్బట్లు, భక్ష్య విశేషము.

కన్నడ. హోళిగె, పోళిగె < సంస్కృత పోలికా ; చూ. ప్రాకృత. పోలిఅ, పోలీ.

(సశేషం)

---

26. శ్రీధరమూర్తి, శరభయ్యగారలచే సంపాదితము, Bulletein of the Govt. Oriental Manuscripts Librany, Madras, Vol, XI, Nos. 1, 2, 1958.

27. ప్రసన్న వెంకటేశ్వర విలాస యక్షగానము, కర్ణాట రాయదళవాయి రాయదుర్గము తిమ్మభూపాల (క్రీ. శ. 1732) కృతము.



పదవీ విరమణ చేసిన ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి,
నూతన ముఖ్యమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి



ఈ ఏడాది ఢిల్లీలో జరిగిన రిపబ్లిక్ దినోత్సవ వేడుకల్లో ఆంధ్రప్రదేశ్ ఎన్. సి. సి. ప్రతినిధి బృందం గెలుచుకొన్న ట్రోఫీలు.



26—1—1964 వ తేదీన హైదరాబాదులో ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేసిన
నగరానికి విద్యుచ్ఛక్తిని సరఫరాచేసే మొట్టమొదటి గేస్ టర్బో సెట్టు.



ఫిబ్రవరి 6 వ తేదీన హైదరాబాదులో వ్యవసాయ మంత్రి శ్రీ ఎ. బలరామరెడ్డి అధ్యక్షతన ఏర్పాటయినసమావేశంలో ద్రాక్షతోటల పెంపకంలో నిపుణుడు పద్మశ్రీ డా॥ జి. రామకోటేశ్వరరావును (కుడివైపునుండి మూడవవారు) మంత్రి అభినందించారు.



ఈ ఏడాది సికిందరాబాదులో జరిగిన రిపబ్లిక్ దినోత్సవంనాటి పరేడులో పతకాలను పొందిన పోలీసు అధికారులు.

*పతకాలు పొందినవారు :* సికిందరాబాదులో జరిగిన గత రిపబ్లిక్ దినోత్సవాలనాటి పరేడులో ఎనమండుగురు పోలీసు అధికారులు పతకాలను పొందారు. హైదరాబాదులోని అవినీతి నిర్మూలనశాఖ డైరెక్టరు శ్రీ ఎస్. విజయరంగం నాయుడు, ఐ. పి. యస్. (ఎడమవైపు నుండి నాలుగవవారు) చేసిన సేవకు రాష్ట్రపతి పోలీసు మరియు ఫైర్ సర్వీసుల పతకాన్నీ; మిగిలిన ఏడుగురికీ వారి సేవలకుగాను పోలీసుపతకాల్ని యివ్వడం జరిగింది. వీరి పేర్లు (ఎడమనుండి కుడికి) 1 శ్రీ కె. డేవిడ్ (తాత్కా) పోలీసు ఇనస్పెక్టరు (రిటైర్డ్) 2. శ్రీ వి. వెంకట నరసింహారావు, పోలీసు ఇనస్పెక్టరు, అవినీతి నిర్మూలనశాఖ, నల్గొండ; 3. శ్రీ పి. లక్ష్మణ్ సింగ్, (తాత్కా) డిప్యూటీ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసు (రిటైర్డ్); 4 శ్రీ ఎస్. విజయరంగం నాయుడు, ఐ. పి. ఎస్ , అవినీతి నిర్మూలనశాఖా డైరెక్టరు, హైదరాబాదు; 5. శ్రీ ఎ.కె .కె .నంబియార్, ఐ. పి., పోలీసు ఇనస్పెక్టరు జనరల్; 6. శ్రీ శివకుమార్ లాల్, ఐ. పి., అదనపు పోలీసు ఇనస్పెక్టరు జనరల్: 7. శ్రీ కె. ఎస్. రామారావు (తాత్కా) కృష్ణాజిల్లా డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు; 8 శ్రీ కె. వి సూర్యనారాయణరాజు (తాత్కా) పోలీసు ఇనస్పెక్టరు, విశాఖ జిల్లా 9. శ్రీ ఎస్. వెంకట రంగారావు (తాత్కా) పోలీసు ఇనస్పెక్టరు, నెల్లూరుజిల్లా; 10. శ్రీ పి. సి. ఎలమంద, పోలీసు సబ్ ఇనస్పెక్టరు, నెల్లూరు జిల్లా.



జనవరి చివరి వారంలో తిరుపతిలో పద్మశ్రీ డా॥ ఎమ్. సి. మోడి ఎనిమిదవ శిబిరాన్ని నిర్వహించిన సందర్భంలో వేలకొలది గ్రుడ్డివారు ఆయనచేత పరీక్ష చేయించుకోవడానికై వరుసల్లో కూర్చున్న దృశ్యం. ఆ వారంలో డా॥ మోడి మొత్తం 1,227 కంటి ఆపరేషన్లను చేశారు.

తెలంగాణాలో ఉత్తమగ్రామం : జనవరి 30 వ తేదీన ఏర్పాటుచేయబడిన సభలో హైదరాబాదు జిల్లా, వికారాబాదు పంచాయతీ సమితిలోని కెరెవిల్లి సర్పంచ్ ఆంధ్రప్రదేశ్ ప్రణాళిక, పంచాయతీరాజ్ శాఖామాత్యుల వద్దనుండి రూ. 15,000 ల నగదు బహుమతిని పుచ్చుకొంటున్న దృశ్య

ఈ సంవత్సరపు ఉత్తమ ఆంధ్ర గ్రామం:

# రంగంపేట

—వి ఎస్ ఎ రావు

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం. పి. పాయ్, ఇటీవల రంగంపేట పంచాయతీ అధ్యక్షుడు శ్రీ వి. వి. వి. లక్ష్మీపతిరావుకు రూ. 15,000 ల రొక్కం బహుమతిని అందజేశారు. రంగంపేట ప్రజలు సాధించిన గమనార్హమైన అభివృద్ధికి పరిగణనగా ఆయనకు ఈ పారితోషికం అందజేయబడింది.

రంగంపేటను ఆంధ్రప్రాంత మంతటిలోకీ 1963 వ సంవత్సరానికి ఉత్తమ పంచాయతీగా ఎన్నిక చేశారు.

(తెలంగాణా ప్రాంతంలో ఉత్తమ పంచాయతీగా కెరెవెల్లిని ఎన్నిక చేయడం జరిగింది*)

రంగంపేట గ్రామం, పర్యటకులను ఆకర్షించేట్లుగా వుండదు. ప్రసిద్ధ దేవాలయ మేదీ ఈ ప్రదేశాన్ని పావనం చేయడంలేదు. రోడ్లు దుమ్ముతో వుంటాయి. మట్టి ఇండ్లు అంతటా కనిపిస్తాయి. గ్రామానికి విద్యుత్ సౌకర్యంలేదు. ఈ గ్రామంలో నివసించే 3,500 మందికీ జీవితం నిరంతరాయమైన ఒక పరిశ్రమ అనవచ్చు. వర్షపునీటి ఆధారంగా సేద్యం చేస్తారు. "రామచంద్రాపురం డెల్టా ప్రాంతంలోని వారితో పోల్చినట్లయితే మేము బీదవారిమే" అని ఈ గ్రామంలోని పెద్దలు అంటారు. వారు ఒకరిపై అసూయపడరు. నిరాశ జెందరు. వారిలో ఆత్మవిశ్వాసం వుంది. స్వయంశక్తిపై ఆధారపడతారు. సుదృఢమైన సంఘచైతన్యం వారిలోవుంది. సమిష్టి శ్రేయస్సుకు అది వారికి ప్రేరణగా వుంటున్నది. రంగంపేట గత సంవత్సరం పెక్కు సంక్షేమ కార్యకలాపాలను నిర్వహించ గలిగింది. ఈ గ్రామస్థులు 1962-63 వ సంవత్సరంలో నిర్వహించిన కొన్ని పనులగురించి దిగువ ఉదహరించబడింది:

## వ్యవసాయం

ఈ సంవత్సరం మొత్తం 2,643 ఎకరాలను సేద్యం చేశారు. 1961-62 వ సం. లో సాగుబడి చేసిన విస్తీర్ణం కంటే ఇది 8 శాతం ఎక్కువ. యువకర్షక సంస్థ, పురోగాములైన రైతులకు మేలురకం వ్యవసాయ పనిముట్లు సరఫరాచేసింది. ఆధునిక వ్యవసాయ పద్ధతులను కూడా ఈ సంస్థ వారు తెలియజెప్పారు. 1962 మేలో అవిర్భవించిన 25 సభ్యులు గల ఈ సంస్థ మేలురకం వ్యవసాయ పనిముట్లు, ఎరువులు, క్రిమిసంహారక మందులను రైతులకు సరఫరా చేసింది. ఇక్కడవున్న 3 సహకార సంఘాలు రైతులకు పరపతి సౌకర్యం కల్పిస్తున్నాయి. మరో సహకార సంఘాన్ని ఇటుకలు, కుండలు, పెంకులు తయారుచేసేవారికి సహాయం చేసేందుకు ఒక లఘు పరిశ్రమగా నిర్వహిస్తున్నారు. ఈ సంఘా లన్నింటిలో 1962-63 వ సం. లో 441 సభ్యత్వం వుంది. ఆ సంవత్సరంలో రూ. 19,835 ల మేరకు ఋణాలు పంపిణీ చేశారు. ఋణాలు వాయిదాలలో సక్రమంగా తిరిగి చెల్లింపబడుతూ వున్నాయి. బకాయీలు, ఎగవేతలు లేవు.

## ఆరోగ్యం

ఇక్కడవున్న పశువైకిత్సశాల గ్రామంలోని 2,403 పశువులకు, 1614 కోళ్ళకు చికిత్సాసౌకర్యాలు కలుగ జేస్తున్నది. స్థానికులదాతృత్వానికి చిహ్నం ఈ చికిత్సశాల. ఈ గ్రామ ప్రజలు నివేశనస్థలాన్ని విరాళంగా ఇచ్చారు. అంతేకాక భవన నిర్మాణ వ్యయంలో రూ. 7,000 లు భరించారు. మందులు ఇతర సాధన సామగ్రి నిమిత్తం వారు మరో రూ. 3,000 లు ప్రోగుచేశారు. 1962-63 వ సంవత్సరంలో సుమారు 7,000 పశువులకు ఇక్కడ చికిత్సజరిగింది.

రంగంపేట ప్రజలు ఆరోగ్య విషయంలో సాగించిన కృషిలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం మరో ముఖ్యఅంశం. దీనికి రెండు ఎకరాల నివేశనస్థలాన్ని స్థానికదాత ఒకరు విరాళంగా ఇచ్చారు. మరో అయిదుగురు దాతలు భవననిర్మాణ వ్యయాన్ని భరించారు.

* "ఆంధ్ర ప్రదేశ్" 1963 డిశంబరు సంచిక చూడండి.

1962 నవంబరు మొదటి తేదీ (పంచాయతీ రాజ్య వార్షికోత్సవం)న దీనికి ప్రారంభోత్సవం జరిగింది. ఈ సంవత్సరంలో రంగంపేట "నిల్ కాజ్వాల్టీ" సర్టిఫికెటు పొందడానికి ప్రధాన కారణం ఈ ప్రాథమిక ఆరోగ్య కేంద్రమే. 1962—63 వ సంవత్సరంలో ఈ గ్రామంలో అంటుజాడ్యా లేవీ సోకలేదు.

గ్రామంలో పారిశుద్ధ్యానికై స్థానిక పంచాయతీ ప్రత్యేకంగా సిబ్బందిని నియోగించలేదు. ఈ కార్యక్రమం ప్రజలందరికీ సంబంధించినది. స్వచ్ఛంద సేవకులు వీధులు ఊడుస్తారు. ఇటువంటి పనులకు ప్రతేకంగా ఆపనులుచేసే వారిని నియమించే పద్ధతికి స్వస్తిచెప్పి రంగంపేట ఆదర్శప్రాయమైనది.

రంగంపేట జనాభాలో నూటికి 30 వంతుల మంది హరిజను లున్నారు. ఇంత అధిక సంఖ్యలోవున్న వీరికికూడా అభివద్ధి కృషిలో పాత్ర వుంటేనే కాని సాంఘిక ప్రగతి సార్థకం కాదనే విషయాన్ని గ్రామ పెద్దలు గమనించారు. ప్రతినెలా చివరి రోజున "హరిజన దినోత్సవం" జరిపి గ్రామస్థులు హరిజన వాడలలో 'శ్రమదానం' చేస్తూ వున్నారు. వీథులను శుభ్రంచేసి చెత్తా చెదారాన్ని ఎత్తి వేస్తుంటారు. ఇరుకైన గుడిసెలలో వుండేవారిని విశాలంగా కొత్త ఇండ్లు నిర్మించుకోవడానికి సమ్మతింప జేయడం జరిగింది. పాద చారులు కూడా వెళ్ళడానికి సరిగా వీలులేని విధంగా ఇరుకైన సందులతో పెరిగిపోయిన ఇండ్లను పడగొట్టడానికి ఒప్పింప జేయడం జరిగింది. హరిజన పేటలో పారిశుద్ధ్య పరిస్థితులను మెరుగు పరచడానికి సాముదాయిక స్నానాలు, మరుగుదొడ్లు నెలకొల్పబడినవి.

## విద్య

ఆరోగ్యం, పారిశుద్ధ్యం విషయంలోనే కాక విద్యారంగంలో కూడా రంగంపేట క్రొత్తపుంతలు త్రొకింది. ఇక్కడవున్న నాలుగు ఎలిమెంటరీ పాఠశాలలు 500మంది బాలబాలికలకు ఉచితంగా విద్యగరుపుతాయి. ఈ పంచాయతీ ప్రాంతంలోని చాంద్రేడు శివారు గ్రామం పాఠశాలలో బాలభట దళాన్ని నిర్వహిస్తున్నారు.

1062 జనవరిలో ఒకయువజన సంస్థను స్థాపించారు. ఇది సాంఘిక కార్యకలాపాలలో మార్గగామిగా వుంటుంది. ఇది సంస్థ భవనం కొరకు రూ. 6,000లు సేకరించింది. పుస్తకాలు, క్రీడాసామగ్రి కొరకు మరో రూ. 300లు ప్రోగుచేసింది. అదేసంవత్సరం ఒక పబ్లిక్ పార్కును నిర్మించి మహాత్మాగాంధీ స్మృత్యర్థం గ్రామానికి బహూకరించింది.

అత్యవసరపరిస్థితి ప్రకటించబడినపిమ్మట గ్రామంలో స్వచ్ఛంద సేవక దళంకూడా ఏర్పడి వివిధకార్య కలాపాలలో పాల్గొంటున్నది. సేద్యపునీటి కాలువలను త్రవ్వడం, వెడల్పు చేయడంవంటి నిర్మాణాత్మక కార్యక్రమాలలో పాల్గొనడమే కాకుండా జన బాహుళ్యానికి విద్యగరిపే పనిలో కూడా గ్రా. స్వ. సే. దళం సభ్యులు పాల్గొంటారు. సమావేశాలను ఏర్పాటుచేసి అత్యవసర పరిస్థితిలో ప్రజల కర్తవ్యాన్ని గురించి వివరించడం జరుగుతున్నది. ప్రణాళికాబద్ధమైన పురోభివృద్ధి, జాతీయ సమైక్యత ప్రాధాన్యతను గురించికూడా నొక్కిచెప్పడం జరుగుతున్నది. జాతీయ రక్షణనిధికి రంగంపేట గ్రామస్థులు సమర్పించిన నిధి గమనార్హమైనది. 1963 వ సంవత్సరాంతం నాటికి ఈ గ్రామస్థులు రూ. 5,646 లు అందజేశారు. అంటే ఒక్కొక్క వ్యక్తి సగటున రూ. 1 50 న. పై. లు ఇచ్చారన్న మాట. ఒక్కొక్క వ్యక్తికి సగటున నిర్ణయించిన లక్ష్యం కంటే ఇది 50 న. పై. లు ఎక్కువ.

## మహిళల పాత్ర

రంగంపేట పురోభివృద్ధి కృషిలో కేవలం పురుషులకు మాత్రమే పాత్రలేదు. మహిళా మండలుల ద్వారా స్త్రీలుకూడా చాలా ఉత్సాహంతో నిరంతరం కృషి చేశారు. వారం వారం సమావేశాలు జరిపి సమిష్టి సమస్యలు, కుటుంబనియంత్రణ విషయాలపై చర్చలు జరిపారు. భజన బృందాలు భక్తి భావాన్ని, దైవచింతనను పెంపొందింప జేస్తాయి. అయితే భౌతిక విషయాల అభివృద్ధిపట్ల కూడా సమంగా శ్రద్ధ వహించడం జరుగుతుంది. దుస్తులు తయారు చేయడం, రాట్నం వడకడం నేర్పుతున్నారు. క్యుమ్యులేటివ్ డిపాజిటు పథకం క్రింద సభ్యురాండ్రు ప్రతినెలా రూ. 95లు డిపాజిటు చేస్తున్నారు.

మహిళామండలి కార్యక్రమాల ప్రధాన నిర్వాహకురాలు ముఖ్యసేవిక సైకిలుపై తిరుగుతూ ఈ యువతీమండలి కార్యకలాపాలను నిర్వహిస్తుంటుంది. రంగంపేట మహిళలకు ఈమెపట్ల ఎంతో ఆదరభావం వుంది. ముఖ్యసేవిక సైకిలుపై వివిధ స్థలాలకు వెళ్తూ అభివృద్ధి కార్యకలాపాలను నిర్వహించడం ఆంధ్రప్రదేశ్ అంతటిలో బహుశా రంగంపేట పంచాయతీనే ప్రత్యేకత అని వారంటారు.

## రాజకీయాలకు స్థానంలేదు

రంగంపేటలో రాజకీయాలకు స్థానం లేదు. ఇక్కడి ప్రజలలో సంఘీభావం వుంది. ప్రతివ్యక్తీ గ్రామస్థులందరి శ్రేయస్సునూ, గ్రామస్థులంతా వ్యక్తి శ్రేయస్సునూ కోరుతారు. అందుకు కృషిచేస్తారు. పటుతరమైన నాయకత్వం ఈ గ్రామానికి లభ్యమవుతున్నది. అధికార సంస్థలకు, అనధికార్లకు మధ్య సఖ్యత, సమన్వయం వుంది. పంచాయతీ రాజ్యం, గ్రామ రాజ్య పరిణామంలో రంగంపేట గౌరవప్రదమైన స్థానాన్నలంకరించడానికి ఇది దోహదం చేస్తున్నది.



# జలాల్‌పూర్‌లో స్వయం సహాయక కార్యక్రమం

క్రో వి రామారావు

గ్రామీణ స్వచ్ఛంద సేవాదళంలో చేరడానికి జలాల్‌పూర్‌లోని శక్తిసామార్థ్యాలు కలవారందరు జనవరి 26 వ తేదీన ప్రతిజ్ఞ చేశారు. మహబూబ్‌నగర్ జిల్లా ధన్వాడ బ్లాకులో జలాల్‌పూర్ ఒక కుగ్రామం. బహుశా యిది కర్నాటక ప్రాంతానికి ఆనుకుని సరిహద్దులో వున్న ఆఖరి గ్రామం కావచ్చు. లోకాయ్‌పల్లి సంస్థానంలోని గ్రామం యిది. సరిగ్గా ఒక ఏడాది క్రితం వీ రంతా తమ సాధన సంపత్తులను, శక్తిసామార్థ్యాలను జాతీయ కృషివైపు మరలించడానికి దృఢనిశ్చయు లయ్యారు.

నెలరోజుల క్రిందట ఒకానొక వెన్నెల రాత్రి ధన్వాడ పంచాయతీ సమితి అధ్యక్షుడూ, బ్లాకు విస్తరణాధికారీ మామూలుగా పర్యటిస్తూ ఈ గ్రామంలోకి వచ్చారు. సర్‌పంచ్ శ్రీ సిద్ధి రామప్పను కలుసుకున్నారు. ఆయనతో జలాల్‌పూర్ గ్రామం గత చరిత్రను గురించీ, అనాదిగా అలక్ష్యం చేయబడుతూ వచ్చిన పరిస్థితులను గురించీ చర్చించి, గ్రామంలో వ్యవసాయోత్పత్తిని పెంపొందింపజేయాలని ఆయనకు సలహా యిచ్చారు. తమ గ్రామంలో ముసలయ్యకుంట అనే ఒక పెద్ద చెఱువు వుందనీ, గ్రామంలోని పంట భూమికి అంతటికీ అదే నీటిని పెడుతున్నదనీ సర్పంచ్ తెలియజేశాడు. ఈ చెఱువు ఎప్పుడో రెండు వందల సంవత్సరాల క్రితం గట్టుకు గండిపడి పాడయ్యింది. అప్పటి నుండీ ఏ మరమ్మత్తూ లేకుండా అలాగే వుండిపోయింది. 80 అడుగుల పొడవునా, 70 అడుగుల వెడల్పునా యీ గండి వుంది. గండిపడిన చోట 30 అడుగుల ఎత్తున మట్టి కప్పాలి. దీని మరమ్మతుకు రు. 10,000 లు ఖర్చవుతా యని అంచనా.

ఆ తర్వాత యీ గ్రామంలోనే ఉపాధ్యాయుల గోష్ఠి ఒకటి ఏర్పాటు చేయడం జరిగింది. దీనికి 200 మంది ఉపాధ్యాయులు హాజరయ్యారు. మొట్ట మొదటి సారిగా ఒక గ్రామసహాయకుల శిబిరంకూడా యిక్కడ నిర్వహించబడింది.

సమితి అధ్యక్షుడు, విస్తరణాధికారి యీ గ్రామంలో వున్న సమయంలో ఏవో కొన్ని నిర్మాణ కార్యక్రమాలను చేపట్టాలని ఉద్దేశించడం జరిగింది. కాని వీరు, గ్రామ ప్రజల్లో ప్రగతి పథంవైపు పయనించే మనస్తత్వాన్ని కలిగించడం తప్ప ఏలాంటి ప్రాజెక్టు పనీ చేపట్టాలనుకోలేదు.

రెవెన్యూ డివిజనలు అధికారి యీ గ్రామాన్ని సందర్శించడానికి వచ్చినప్పుడు, ఉపాధ్యాయుల గోష్ఠిని నిర్వహిస్తున్న ఉపాధ్యాయుల్ని, బ్లాకు అధికారుల్ని కలుసుకున్నారు.

## 10 రోజుల కృషి

గోష్ఠి అనంతరం ఉపాధ్యాయులూ, గ్రామసహాయకులూ గ్రామసేవకుల సహకారంతో గ్రామంలోని ప్రతి యింటికి తిరిగి, నిర్మాణ కార్యక్రమాల్లో వారు పాల్గొనేటట్టు ఒప్పించారు. ముసలయ్యకుంట చెఱువును మరమ్మతు చేయడానికి యిదే తగిన అదనుగా యీ గ్రామప్రజలు భావించారు. సుమారు 800 మంది గ్రామీణ స్వచ్ఛంద సేవాదళంలో చేరారు. సమిష్టి కృషితో ఏదో నిర్మాణాత్మకమైన పనిని నెరవేర్చాలనే బలీయమైన కోరిక, మాతృదేశాభిమానం మొట్ట మొదటి సారిగా గ్రామంలో వెల్లివిరిసింది.

ఈ చెఱువుకు మూడు వైపులా ఇంగ్లీషు సి_ఆకారంలో రాళ్ళగుట్టలు ఆవర్తించి వున్నాయి. దీనికి ఇంగ్లీషు 'డి'_ ఆకారం యివ్వాలంటే మధ్య 80 అడుగుల ఖాళీని పూరించాలని స్వచ్ఛంద సేవాదళ సభ్యులకు తెలుసు. పదిరోజులపాటు వీరు కష్టపడి పని చేశారు. ఈ పనికి మామూలుగా రు. 10,000 ఖర్చయి వుండేది. గ్రామంలో విరివిగా రాళ్ళు వున్నాయి. వాటిని సేవాదళసభ్యులు ప్రోగు చేశారు.

క్రొత్తగా ఏర్పడిన యీ గ్రామీణ స్వచ్ఛంద సేవాదళం 100 ఎకరాల మెట్ట భూమిని సాగు క్రిందకు తీసుకొచ్చింది. దీని నుండి వచ్చే దిగుబడి రూ. 50,000 లు వుంటుందని, దీనిపై భూమిశిస్తు రూపేణా రూ. 800 లు వస్తుందని అంచనా. చెఱువు మధ్యకట్టను గట్టి చేయడంకూడా జరిగింది. రక్షణశ్రామిక బ్యాంకు ద్వారా జరిగిన యీ కృషివిలువ రూ. 10,000 లను మించి వుంటుంది.

శ్రీ సి. నరసిరెడ్డి ఆహార సదుపాయాల్ని కల్పించారు. వీరు 2 బస్తాల బియ్యం, అవసరమైనన్ని కాయగూరలు ఉదారంగా యిచ్చారు. వీటిని వండి, సేవాదళ సభ్యులకు పని జరిగిన అన్ని రోజులూ పెట్టారు.

నారాయణ స్తంభా న్నానుకుని ఒంటి కాలిమీద నిలబడి ఉన్నాడు. దెయ్యం పట్టినట్టు ఒణుకుతున్నాడు. అతను తలవంచు కోవటంచూసి సంకపయ్య "అహా! ఆఖరికి కొడుకు ఎదిగివచ్చి తండ్రిమాటకే ఎదురు చెప్పే ధైర్యవంతు డయ్యా డన్నమాట. ఎట్లా జుల్ఫాలు పెంచాడో! పోకిరి వాళ్ళలా మెడకి మఫ్లర్ చుట్టుకున్నాడు, ఫాషన్ కాబోలు! జేబులో బీడీ, అగ్గిపెట్టెకూడా ఉండొచ్చు" అని అంటూ వక్కలు కత్తిరిస్తున్నాడు.

సీతమ్మ ఎదురుబొదురుగా నుంచున్న తండ్రీకొడుకుల్ని వంటిట్లోనుంచి తొంగి చూసి మాట్లాడకుండా కొబ్బరి కోరసాగింది. దొడ్లో ఊరగాయ దినుసులు ఆరబెట్టటానికి వెళ్ళిన లక్ష్మి తిరిగివచ్చి చకితురాలైంది. తండ్రిదృష్టిని ఎదుర్కోలేక, రుమాలుతో చెమట తుడుచుకుంటున్న అన్న పరిస్థితి చూసి భయపడిపోయింది. వంటింట్లోకి వెళ్ళి "సంగతి ఏమిటమ్మా?" అని తల్లిని అడిగింది కాని బయటిమాటలు జాగ్రత్తగా వింటున్నసీతమ్మ కూతుర్ని 'ఇష్' అని మాత్రం అంది.

లక్ష్మి ఊరుకుంది.

లంగా అంచు పట్టుకుని ఎగురుతూ శాంత వచ్చింది. ఏమిటిది? నాన్నగారు, అన్నయ్య

కన్నడ కథ

మూలం :

యు. ఆర్. అనంతమూర్తి

అనువాదం :

ఎన్. వి. ఆర్. శేషగిరిరావు

అనువాదభారతి



ఆలా ఎదురుబొదురుగా నిలబడటంలోని రహస్యం తనకి అంతు బట్టలేదు. తండ్రి దగ్గరకి వెళ్ళి వెనకనుంచి ఆయన భుజం మీద బుగ్గ పెట్టింది. చెవిదగ్గర నోరు పెట్టి తియ్యనిగొంతుతో "నాన్నగారూ, సున్నం తేనా?" అని అడిగింది.

చిలిపి కళ్ళతో అన్నయ్య వైపు చూడసాగింది. అతనిజేబులో నోట్‌బుక్కు, పెన్ను ఉన్నాయి. చదువుతున్నట్టు వేషం! తనకంతా తెలుసు. చేతిలో టార్చిలైటు పుచ్చుకుని సినిమాకివెళ్లే అన్నయ్య ఇప్పుడు నాన్నగారి నిప్పుల్లాంటి ఎర్రకళ్ళు చూసి ఎట్లా ఏడుపుమొఖం పెట్టాడో! కాంతకి విరగబడి నవ్వాలని ఉంది కాని నాన్నగారు చూడకుండా అన్నయ్య నాలుగు గుద్దులు వేస్తాడేమోనని భయపడి ఊరుకుంది.

"చూడమ్మా! నేను స్పష్టంగా చెప్తున్నా తనమీదున్న ఇరవైవేల రూపాయిల అప్పు కోసం నాన్నగారు నరకానికి వెళ్ళాలనుకుంటే వెళ్ళవచ్చు. అప్పుతో నాకే మీ సంబంధం లేదు. ఈ అడవి ఊళ్ళోపడి మ్రగ్గిపోయేవాడిని కాదు. మామయ్య శివమొగ్గలో తనతోపాటు హోటలునడపటానికి రమ్మన్నాడు. నే నిప్పుడే వెళ్తున్నా. మన సంబంధం ఇక ఇంతటితో ..."



సంకపయ్య మీసాలు మెలివేస్తున్న కాంత చెయ్యి తీసేసి నుంచున్నాడు. కాంత భయపడిపోయింది. పంటికింద వేలుపెట్టుకుని నొక్కుకుంటూ తండ్రి వైపే చూస్తోంది.

"నువ్వు నామీ దెందుకు విసుక్కుంటావ్? ఈ ఇంట్లో నామాట వినేవాళ్ళు ఎవరున్నారు కనక? నువ్వు చూస్తూనే ఉన్నావుగా ఆ నారింజతోట పిచ్చిలో పడి వేలకువేలు గుమ్మరించారు. ఊళ్ళోవాళ్ళంతా ఒద్దని చెప్పినా ఆయన కేమన్నా చీమకుట్టిందా? ఒట్టి మొండిమనిషి. ఆయనకి ఎదురుచెప్పిన మాటా నచ్చదు. ఆరేళ్ళయిందన్న మాటే కాని ఒక్కసారికూడ పంట చేతికి రాలేదు. ఆ నేలలో నారింజ పెరగదని నాన్నగారితో శానుభోగ్ అన్నాడు కూడాగా..."

"ఎప్పుడూ ఇదే నడక. ఈ పల్లెటూళ్ళలో పడి ఉండిఉండి నేను నాశనమయ్యా. ఇవ్వాళ ఆవుని పులి ఎత్తుకు పోయింది. నిన్నేమో కుక్కని చిరుతపులి లాక్కుపోయింది. ఒకటా రెండా? కొగ్గ చెప్పాడు అడవి ఏనుగు ఒకటి వచ్చి పడిందట. ఆపీడ ఒకటి. ఇవన్నీ చాలవన్నట్టు మలేరియా జ్వరం. పోకచెట్టుకి తెగుళ్ళు — ఎన్ని గొడవలు! సగంపైగా పోకలు రోగంవచ్చి కుళ్ళిపోయినయ్. నువ్వేచెప్పు చేతికి నాలుగు డబ్బులు రానప్పుడు ఈ ఊళ్ళోపడి చావటం ఎందుకంట?"

"నే ననేదీ అదే. శానుభోగ్‌ని చూసి కూడ నాన్నగారికి తెలిసి రావటంలేదు. నాతోపాటు హోటలు నడపటానికి ఆయన వాళ్ళబ్బాయి కిట్టన్నని పంపటానికి ఒప్పుకున్నాడు. కిట్టన్న మహా అదృష్టవంతుడు."

"కాక మరేమిటి? నేనేం పాపం చేసుకున్నానో నన్ను తీసుకొచ్చి ఈయనకి

కట్టబెట్టారు. పనికిమాలిన దాన్ని నా కడుపున ఎందుకు పుట్టావురా, నారాయణ? మా నాన్న పెట్టిన హారం, ఒడ్డాణం అన్నీ ఆ నారింజ తోటకోసమే తాకట్టు పెట్టారు. ఇవ్వాళ ఆ నగలే ఉంటే నీ కెందుకన్నా పని కొచ్చేవి."

"ఇది అంతతేలికగా పోయేది కాదమ్మా ఇది తరతరాలనుంచి వచ్చిన ఆస్తి. నాన్నగారు మర్చిపోయారేమో?"

శాంత తన పెద్దకళ్ళతో సంకపయ్య వైపు ఆశ్చర్యంగా చూస్తోంది. అన్నయ్య ఇట్లా మాట్లాడుతుంటే నాన్నగారు చెంప ఎందుకు పగలగొట్టటం లేదో అర్థంకాలేదు. ఎందుకు ఊరుకున్నారో!

"ఉన్న దురదృష్టం చాలదన్నట్టు పెళ్ళై ఆరునెలలు తిరుగలేదు. లక్ష్మి పెనిమిటిపోయి ఇక్కడికి చేరింది. నేను అమ్మాయిని ఆ దేవరయ్య కొడుక్కి ఇవ్వద్దు బాబో అని ముందే మొత్తుకున్నా. ఈ ఇంట్లో నీమాట నామాట పట్టించుకునే దెవరు? కూతురు పసుపు కుంకుమకి దూరం అయిందన్నమాట విని ఆయన కంట తడిపెట్టాడా అసలు? విని లేచి వెళ్ళిపోయారు — ఆ నారింజ తోటకే అయి ఉంటుంది. నే చెప్తున్నా బాబూ, ఈయన చేసిన పాపాలు ఏడు జన్మాలకి కూడా పోయేవికాదు. ఇంట్లోవాళ్ళకి లాభం లేదు సరికదా, కష్టాలు తెచ్చిపెట్టే ఈతోట ఈయన ఎందుకు వేయాల్సి వచ్చిందో నా కర్థం కావటంలేదు..."

"ఎందు కేడుస్తావమ్మా?"

తన జుట్టుముడిలోనుంచి వాడిపోయిన 'రంరూ' పూలు తీసేస్తూ శాంత, తండ్రి ముఖంవైపు కుతూహలంగా చూసింది. ఒక్కసారిగా కొగ్గమీద విరుచుకుపడి పెద్ద గొంతుతో "ఇక్కడ ఏంచేస్తున్నావ్, దరిద్రుడా? ఫో— నీపని నువ్వు చూసుకో" అని అన్నాడు. వసారాలో పచార్లు చేస్తూ ఏదో గుర్తువచ్చినట్లు ఆగిపోయాడు.

"లక్ష్మిసంగతి తలచుకున్నప్పుడల్లా గిలగిల్లాడిపోతా. మిగతా, ఆడవాళ్ళలాగ సుఖపడాలని దానికి మాత్రం ఉండదూ? తండ్రిముఖం చూస్తూ కూర్చుంటే స్వర్గం లభిస్తుందని ఈయన అనుకుంటున్నారేమో. నారాయణ! ఆయనకి నువ్వే నచ్చచెప్పాలి. నువ్వెక్కడికి వెళ్తే అక్కడికి నీతోపాటు నేనూ వస్తా. ఈయన కాళ్ళకింద గడ్డిపరకలా, దాసిదానిగా పడివుండి విసిగిపోయా. నేనిక్క దేమాత్రం ఉండలేను. ఆఖరికి నాలుగురోజులయినా సరే ఈఊళ్ళో నుంచి బయటపడి కొడుకుదగ్గర సుఖంగా ఉండాలనుంది..."

"నువ్వేం దిగులుపెట్టుకోకమ్మా. నేనంతా చూస్తాగా. ఇక ఆయన జబర్దస్తీ నామీదేం పనిచెయ్యదు. నెత్తిమీద కొండ విరిగిపడ్డా నేను, కిట్టన్న శివమొగ్గలో మామయ్యతో కలిసి హోటలు పెట్టిగాని నిద్రపోం. నా కెవరన్నా భయంలేదు."

సంకపయ్య లోపలికి రావటంతో నారాయణ మాటలు ఆగిపోయాయి. నెమ్మదిగా దొడ్డిగుమ్మంనుంచి జారుకుంటున్న అన్న దుర్గతి చూసి శాంత నవ్వింది. భర్త నుంచున్న తీరునుబట్టి సీతమ్మ తల ఒంచుకుని కొబ్బరి కోరటం మొదలుపెట్టింది. కొబ్బరి అయిపోవటం వల్ల కొబ్బరిపెంకు కోరుతున్న చప్పుడువచ్చింది. ఆ కర్కశధ్వని విని సంకపయ్య కోపం మరింత పెరిగింది. పెళ్ళాం బుర్ర పగలగొట్టా లనిపించింది గాని దగ్గరలో ఉన్న చిలకకొయ్యమీద చెయ్యి ఆనించి కోపం తమాయించుకున్నాడు.

"ఆగరా, నారాయణ! హోటలు పెట్టటానికి డబ్బియ్యకపోతే ఏం చేస్తావో చెప్పరా!" అని గట్టిగా అడిగాడు.

"దావావేసి నావాటానేను రాబట్టుకుంటా" అని జవాబివ్వా లనుకున్నాడు. కాని నోట్లో నుంచి మాట పెగలక పోయేసరికి గుటక మింగి ఊరుకున్నాడు.

సీతమ్మ తనలో తను ఎన్నో అనుకుంటోంది — ఈయన అరవటం చూస్తే ఇంటి కప్పు ఎగిరిపోయినా ఆశ్చర్యపడక్కరలేదు. సంకపయ్య కోపం చాలవరకు తగ్గిపోయినా భార్యవైపు తిరిగి 'తండ్రిముఖం చూస్తూ కూర్చుంటే ఏమి ఒరిగింది?' అని "లక్ష్మి నీతో అన్నదా లేకపోతే నీ కట్టుకథేనా? ఊఁ, చెప్పు సరిగ్గా" అని గర్జించాడు.

కోరివేసిన కొబ్బరిచిప్ప కోరుతూ, ఇంటి కప్పునుగురించి ఆలోచిస్తున్న సీతమ్మవైపు చూస్తే సంకపయ్యకి అసహ్యంవేసింది. ఎంత వికారంగా ఉంది ఈ మనిషి! అయినా తనెప్పుడు పరస్త్రీవైపు కన్నెత్తి చూడలేదే. ఇవ్వాళేమో తెలివితక్కువకొడుకుతో కలిసి కుట్ర పన్నుతోంది.

"ఛత్!" సంకపయ్య నోటినుండి ఈ ఒక్కమాటే వెలువడింది. వెంటనే వసారాలోకి వెళ్ళిపోయాడు. అంగవస్త్రంతో చెమట తుడుచుకుని మృదువుగా "శాంతా, లక్ష్మి ఎక్కడికి వెళ్ళింది?" అని కేకవేశాడు.

పూజగది పక్కనుంచి వెళ్తూ "ఇది జరగటానికి బొత్తిగావీల్లేదు. ఇంటిపెద్దగా అనంత చతుర్దశి, వినాయకచవితి మొదలైన వ్రతాలు పండగలు చేసేవాడిని, ఈ జానెడు కుర్రవాడి మాటలూ, దురాశకిపోయే భార్యమాటలూ విని, నా తండ్రులు తాతలు కొండలు, అడవులు సాధించి సంపాదించిన ఈ తోటా, పొలం ఒదులుకుంటానా? అదీన్ను శివ మొగ్గలో సనాతన బ్రాహ్మణ ధర్మానికి విరుద్ధంగా అన్న విక్రయంకోసం! చూస్తా ఏమవుతుందో" అని పైకి అన్నాడు.

మొలన కొడవలి వ్రేలాడేసుకుని బయటికి వెళ్తుంటే నేలమీద పడిన పూలు ఏరుతున్న శాంత "నాన్నగారూ, నేనుకూడా రానా?" అన్నట్టు చూసినచూపు సంకపయ్యకి సంతోషపెట్టింది. కాని ఆయన మనస్సు మాత్రం పనిచేస్తూనే ఉంది: "నావాళ్ళనే వాళ్ళు ఇక్కడ లేకుండాపోయినా నేను మాత్రం ఇక్కడే ఉంటా. కావాలంటే నా ప్రతిజ్ఞ చూసుకో. బీడీలు తాగుతూ ఊరంట తిరిగే ఊ పక్షి ఎక్కడ? ఈ వయస్సులో ఇప్పటికీ రెండుమూడు బళ్ళకట్టెలు నరికే నేనెక్కడ? వీడా తండ్రి గౌరవం నిలబెట్టేది? ఇక వీడు ఒళ్ళు దగ్గరపెట్టుకుని మాట్లాడకపోతే అర్ధచంద్రప్రయోగం చేశానన్నమాటే. వీడు చేసిన తప్పుడుపనులు మాట్లాడకుండా సహిస్తా ననుకుంటున్నాడు కాబోలు!"

సంకపయ్య ఇంటివెనుకగుట్ట తొందర తొందరగా ఎక్కసాగాడు.

'మత్తి' ఆకులు కోస్తున్న లక్ష్మిని చూసి ఆగిపోయాడు. అమ్మాయిని అడుగుదామనుకున్నాడు కాని ఏమని అడగాలి? నువు విధవ అయి పుట్టింటికి తిరిగి వచ్చావ్, ఇది నా తప్పా? అనా లేక నీ భర్తపోతే నేనేం చెయ్యగలను? అతనిమీద నా అధికారం ఏముంది? అయినా కూతురికి ఎప్పుడు ఏలోటురాకుండ చూసేతండ్రిని నేనున్నానుగా అనా...ఏమన్నా అందా మని మాట వెతుక్కుంటూనే కుంకంబొట్టులేక బోసిగా ఉన్న కూతురుమొఖం చూశాడు.

"ఇంత కటికఎండలో ఎక్కడికి బయలుదేరారు నాన్నగారు?" కూతురు ప్రశ్న విని సంతుష్టు డయ్యాడు. నిన్న లక్ష్మి, శాంత ఇద్దరుకలిసి నలుగుపెట్టి తొట్టిలో కూర్చోపెట్టి తలంటి స్నానం చేయించారు. పక్కవేసి పైన రెండు కంబళ్ళు కప్పారు. "బాగా చెమట దిగిపోనీయండి, నాన్నగారూ" అని అంటూ లక్ష్మి పక్కన కూర్చుంది. ఆమెతో కొన్ని సంగతులు చెప్పా లనుకున్నాడు కాని భార్యకి, కొడుక్కి చెప్పని విషయాలు లక్ష్మితో చెప్పటం ఎట్లా?

"అమ్మాయి లక్ష్మి! ఈ సారి పొకల ధర బాగుంది చేతికి అయిదారువేలు వచ్చి నారింజపండుకూడ బాగుంటే ముందు అప్పు తీర్చేసి ఇంటి మరమ్మతు..." దిగులుగా ఉన్న తండ్రిని సంతోష పెట్టటానికి తలూపుతున్న లక్ష్మి మధ్యలోనే "నాన్నగారూ! మీ రీ సంగతులు అమ్మకి, అన్నయ్యకీకూడ చెప్పరేం?" అని అడిగింది.

సంకపయ్యకి నిరాశ కలిగింది. అసలీ సంగతులుచెప్పా లనుకోలేదు కాని తను మాట్లాడటం మొదలు పెడితే ఇలాగే అవుతుంది.

"మధ్యాహ్నానికి తిరిగి వస్తా. 'మత్తి' ఆకులు నీళ్ళలో ఉడకబెట్టి, నలుగు పెట్టుకుని నువ్వు, శాంత ఇద్దరూ స్నానం చెయ్యండి" అంటూ సంకపయ్య ముందుకి సాగాడు. లక్ష్మి వెంటనే "ఒద్దు నాన్నా!" అంది.

"నలుగు పెట్టుకుని స్నానం చెయ్యనంటావే?" అని గట్టిగాఅరచి జవాబుకోసం ఎదురుచూడకుండా వెళ్ళిపోయాడు.

ఎనిమిదేళ్ళక్రితం తన్ను మలెనాడు మొత్తంమీద ఉత్తమ వ్యవసాయదారుడుగా నిర్ణయించి, కలెక్టరు స్వయంగా ఇచ్చిన బంగారుపతకం లక్ష్మి కిచ్చి "లక్ష్మీ, నీదగ్గర జాగ్రత్తగా ఉంచుకో" అని అంటే ఏమవుతుంది? చాల సంతోషిస్తుందిపాపం పిచ్చిది. ఇప్పుడు శాంత ఉంటే బలే సర్దాగాఉండేది. ఇటు అటు గంతులేస్తూ, పరుగెత్తుతూ పళ్ళు, పూలు కోస్తూ వాగుతుంది. లక్ష్మి ఏమిటి? ఆఖరికి ఆ చిన్నదానికికూడ తెలుసు నా శ్రమంతా, డబ్బు పోగుచేసి మూటకట్టటానికి కాదని. మన వశం తప్పిపోయే ఇంద్రియాల్ని అదుపులో పెట్టుకోవలసివచ్చినట్టే, ఇదికూడ ఒకరకపు నిగ్రహమే. మనిషి ఇచ్ఛాశక్తి, ప్రకృతిమధ్య జరిగే సంఘర్షణ వల్ల ఎటువంటి ఆనందం కలుగుతుదో ఈ దౌర్భాగ్యులకేం తెలుసు? ఇది ఈ దద్దమ్మలు హోటలు నడపటంఅంత తేలికకాదు. పోకలు అమ్మితే వచ్చే డబ్బుతో నారింజతోటకి పెట్టుబడి పెడతా. అప్పుడు చూస్తా ఈ నెలలో నారింజ ఎందుకు పెరగదో. నారింజతోటలు పెంచటం కూర్గువాళ్ళ ఒకళ్ల సొత్తేనా ఏమిటి? రెండు మూడేళ్ళు కొంచెం కష్టపడాలిసి వస్తుంది. ఇక అప్పు తీర్చేసి మిగిలిన డబ్బుతో ఇంటివెనక చెరువులో పంపు పెట్టిస్తే కుడిప్రక్క బంజరుభూమిలో ఏం కావాలంటే అది పండించవచ్చు.

చెరువుగట్టున నిలబడి ఇలాచేస్తే లక్ష్మి ఏమంటుందో? అని ఆలోచించ సాగాడు. వెంటనే ఆమెబొట్టుకోల్పోయిన మొఖం కళ్ళ ముందు మెరుపులా మెరిసింది. "అమ్మాయి మొఖాన కుంకంబొట్టు పెట్టుకున్న రోజుల్లో ఎంత అందంగా ఉండేది! నాచేతుల్లోబలం ఉన్నంతవరకు భర్తపోయినా, ఇంకెవరు పోయినా దానికి కష్టం రానియ్యను. శాంత తెచ్చిన పూలు గుచ్చుతూ లక్ష్మి కన్నీళ్ళు తుడుచుకున్న దృశ్యం గుర్తువచ్చి బాధపడ్డాడు. పాపం కోరిక కలిగి ఉంటుంది. కాని అదికూడ నాలాగునే సంయమం అలవర్చుకోవాలా? తోటవైపు తిరిగి తనలోతను అనుకున్నాడు — "నారింజతోట కాపుకెందుకు రాదో ప్రాణం ఉన్నంతవరకు ప్రయత్నించి చూస్తా. హోటలు నడపి తేలికగా డబ్బు సంపాదించవచ్చు నంటున్నారువీళ్ళు. నన్ను మభ్యపెట్టటానికి వీళ్ళకి శక్తిఉందాఅంట."

పెద్ద తోటలో అడుగుపెట్టాడు. తలకి

చుట్టిన కండవాతీస్తూ ఇకనుంచి లక్ష్మివండిన అన్నమే తినా లని నిశ్చయించుకున్నాడు.

"పెళ్లాం, కొడుకు గంగలో కలిస్తే కలవనీ. ఇప్పటికీ బలంగానే ఉన్నా. ఈసారి పోకలకి ధర పెరిగితే అంతా సవ్యంగానే ఉంటుంది. ఒకవేళ మేనమామ మాటలువిని నారాయణ తనవాటా పంచిపెట్టమని కోర్టు ఎక్కడంటే ఈ నాటివరకు కోర్టు గుమ్మం తొక్కని వంశంలో పుట్టిన నన్ను కోర్టుకీడ్చి లోకంలో నవ్వులపాలు చేస్తాడేమో. ఎంత చిత్రం — నా కొడుకు, నాభార్య నా ఎదుట నిలబడి నన్నే ఎదిరిస్తున్నారంటే....కాలం మారిపోయింది." ఒక పెద్ద నిట్టూర్పు ఒదిలాడు."ఏమయినాసరే నా పట్టుదలఒదులుకునేవాణ్ణికాను. కావలిస్తేలక్ష్మినికూడ అడిగి చూస్తా – 'ఏం లక్ష్మీ! ఇది మంచిదే నంటావా?' అని. అమ్మాయి నా పక్షాన ఉన్నంతవరకు వీళ్ళేం వాగుతున్నా నాకేం పర్వాలేదు. ఇటువంటి దుర్మార్గుల్ని నరికినా పాపంలేదు..."

అడవిమధ్య ఉన్న లోయపక్కన నిలబడి సంకపయ్య, కింద జలపాతం చూడాలనుకున్నాడు. చిన్నతనంలో తండ్రి తనని తీసుకు వెళుతుండేవాడు. భూమితనమీదున్న పర్వతాల బరువు మోయలేనప్పుడు కదులుతుందంట. అప్పుడుకంపించిపోయి అడుక్కి వెళ్ళిపోతుందంట" అని తండ్రి చెప్తుండేవాడు.

శాంత దగ్గరుంటే "అడిగేదే నాన్నగారూ భూమికూడ కదుల్తుందా?" అని.

తండ్రిలాగునే తనుకూడ దూరంగా పాతాళంలో చిన్నవిగా కన్పించే చెట్లను ఆశ్చర్యంగా చూసేది — తన మనస్సు కూడ కొంచెం శాంతంగా ఉండేది.

లోయకిందికి దృష్టి నిల్పిన సంకపయ్య కళ్ళు మూసుకుని, తెరచుకుని, పెద్దవి అయి మళ్ళీ మూసుకున్నాయి. తను చూసింది ఒళ్ళంతా నింపుకుని ఒణికిపోయాడు. మళ్ళీ కళ్ళు తెరచి నిర్భయంగా తిన్నగా అవైపు చూశాడు. లోయలో పడుకున్న పెద్దపులి తనలాగే కళ్ళు చించుకుని — చింత నిప్పుల్లాంటి కళ్ళు — తనవైపే చూస్తోంది. రెప్ప వెయ్యకుండా, నిర్భయంగా భూతం ఆవరించిన వాడిలా ఆగిపోయాడు. అరవా లని ఎందుకనిపించలేదో? వెనక్కి తగ్గా లనుకోలేదుకూడ మరి. ఆశ్చర్యం! ఆయన తను అనుకుంటున్నది ఎవరితోను — ఆఖరికి లక్ష్మితోకూడ — చెప్పకూడ దనుకుంటున్నాడేమో? నరనరంలో ప్రవహించే ఆ అనుభూతి ఎటువంటిదో! నోటివెంట అప్రయత్నంగా 'బ్రతికితే పులిలా బ్రతకాలి' అనే మాటలు వెలువడ్డాయి.

అక్కడనుంచి నడక సాగించాడు. తను అలాఎందుకన్నాడోతనకే ఆశ్చర్యంవేసింది.

ఒళ్ళంతా చెమటతో తడిసి ముద్దయ్యాక జాగ్రదవస్థలోకి వచ్చాడు. అది తనపొలమే. అది పనసచెట్టు. కాలిలో గుచ్చుకుంటున్నది ముల్లు. ఎదురుగా శానుభోగ్ నుంచున్నాడు కాని తను పెద్దపులిని చూసినట్లు చెప్పలేదు.

"ఏం సంకపయ్య, తోటలోకి బయలుదేరావా ఏమిటి?"

సంకపయ్య తల ఊపాడు. అంతే శానుభోగ్‌పొడుండబ్బా తీస్తే ఏదోచెప్పబోతున్నాడనిసంకపయ్య గ్రహించాడు. అయిష్టంగానేఆగాడు.

"పిల్లల ఇష్టానికి మనం ఎదురుచెప్పటం ఎందుకు సంకపయ్యా? అసలు మన చేతుల్లో ఏముందంట? నా సంగతే చూడు. నువ్వు కలలోనన్నా అనుకున్నావా అమ్మాయి లక్ష్మిగతి ఇలా అవుతుందని?"

సెభాష్ శానుభోగ్! లక్ష్మికేమన్నా అయితే వీడి కొచ్చిన నష్టం ఏమిటో? సంకపయ్య కనుబొమలు ముడుచుకున్నాయి.

"బ్రహ్మరాత ఎవరూ తప్పించుకోలేరు. అందుకనే మన ఇష్టప్రకారం జరగాలని పట్టుపట్టకూడదంటా. నారింజతోట సంగతి చూడు. ఇదిగో సంకపయ్య! నా ఉద్దేశం ఏమంటే మీ బావమరది, మావాడు, మీవాడు ముగ్గురుకలిసి హోటలు నడపా లనుకుంటున్నారు. మన వ్యవసాయంలో ఏం లాభం లేదు. అనవసరంగా ఈ అడవుల్లో పడి కొట్టుకోవటంకన్న హోటలు నడిపితే నాలుగు డబ్బులు దొరుకుతాయి. మరి..."

"శానుభోగ్, నీపని నువ్వు చూసుకో, ఎందు కనవసరంగా వాగుతావ్?"

"ఆహా! ఏం గర్వం బ్రాహ్మడికి?" అంటున్న శానుభోగ్ మొఖం తెచ్చిపెట్టుకున్న నవ్వుతో వికృతంగా మారింది. సంకపయ్య చూపు చూసి శానుభోగ్ తగ్గాడు. తేరుకునేలోపలే సంకపయ్య చాల దూరం వెళ్ళిపోయాడు. ఇంకా పెద్దపులి కళ్ళే గుర్తుచేసుకుంటున్నాడు.

సంకపయ్య సిపాయిలా విరుచుకుని నడుస్తున్నాడు. ఒక బుట్టెడు ఎర్రని 'దాసబాల,పూలు తీసుకువెళ్ళి మనసారా దుర్గాపూజ చెయ్యా లనిపించింది. తన వాకిలి అంతా ఎర్రని ముగ్గులతో అలంకరించాలి. ముగ్గుమండలంమధ్య మహామాతప్రతిష్ఠచెయ్యాలి. తూర్పుదిక్కున ఇంకా అరుణకాంతు లుండగానే స్నానంచేసి ఎర్ర పట్టుపంచె కట్టుకోవాలి. విభూతి రాసుకుని, రుద్రాక్షమాల వేసుకుని మంత్రాలు ఉచ్చరిస్తూ దేవిని అర్చించాలి. అడవులు మారు మ్రోగేటట్టు, పాపాత్ముల, పిరికివాళ్ళ గుండెలు అదిరేటట్టు, వేదఘోష ప్రతిధ్వనించాలి. వ్యాఘ్రారూఢయైన మహామాత ప్రత్యక్షమై తన్ను కౌగలించుకుని ఒళ్ళంతా ముద్దాడి రక్త

మాంస మజ్జాదులతో సహా నన్ను ఆరగించే వరకు అర్చన సాగుతూండవలసిందే...

పూజకోసం ఎర్రలంగా వేసుకున్న శాంత దీపారాధన చేసి గంధలేపం తయారుచేస్తూ తన దగ్గరే కూర్చుంటుంది.

ఒకపక్క నేను స్వయంగా అర్పించుకున్న దేహాన్ని ఇనుప తిరుగలిలో నొక్కుతుంటూ ఉంటే ఇంకోపక్క లక్ష్మినుదుట కుంకుమబొట్టు బాగా ఎర్రపడి మెరుస్తూ రక్తతిలకంలా నవ్వుతుంది. నారింజతోట తోటమొత్తం ఎర్రని పళ్ళతో కళ కళలాడుతుంది. అడవులు గుహలు అన్నీ మంత్రముగ్ధమైపోయి వచ్చి కాళ్ళదగ్గర పడతాయి. ఈ నపుంసకులు ఖండ ఖండాలై, చెల్లా చెదరయిపోయి రక్తం కక్కుతూ పడి ఉంటారు. వ్యాఘ్రారూఢయైన దేవి కళ్ళయెదుట నవ్వుతూ నిలబడిఉంటుంది.

పెళ్ళాం పూజమధ్యలో గబ్బిలంలా వచ్చిందంటే దాని మంగళ సూత్రం తెంపేసి కొడుకుతోపాటు ఇంట్లోనుంచి తగిలేస్తా. ఇటువంటిచిత్రమైన ఆలోచనలే సంకపయ్య మనస్సులో మెదులుతున్నాయి. తోటలో కాలుపెట్టేటప్పటికి కళ్ళుబయర్లు కమ్మాయి.

తోటకి ఎటువంటి దుర్దశ పట్టిందంటే తలకట్టు తీసేసినవిధవ గుర్తొస్తుంది. పచ్చగా ఏపుగాపెరిగి ఊగే పోకచెట్లు ఇలా చెల్లా చెదరుగా పడి ఉన్నాయి ఏమిటో. అరటి చెట్లు పడేసి నలగదొక్కినట్టున్నాయి. తమలపాకు తీగెలు ఎలా పడిపోయి ఉన్నాయో!

"ఒరే కర్రియ్యా, ఎక్కడ చచ్చావురా?" అని గట్టిగా కేకవేశాడు. జవాబు లేదు. పాపం, ఏనుగు వచ్చి తొక్కిపారేసినందు వల్ల జరిగింది ఈ అనర్థం అంతా. పడిపోయిన చెట్లకి కొట్టుకుంటూ పరుగెత్త సాగాడు...

గురకకొడుతూ కర్రియ్య పడిఉన్నాడు. వాడి తలదగ్గర పగిలిన కుండలు, రొట్టె ముక్కలు పడి ఉన్నాయి. చుట్టూ విసరిన పనస తొనలు, గింజలు ఉన్నాయి. ఒకమూల స్పృహపోయాక విసిరేసిన కొడవలి ఉంది. వాడి కాళ్ళదగ్గర కాశీకల్లుకుండ, నోట్లో ఆదమరచిన నిద్రాసుఖం తెలిపే చొంగ!

పనసతొనలు వాసన చూసుకుంటూ, అరుస్తూ గేవొకటి పక్కనుంచి పోతుంటే దానిబురద తన బట్టలకు అంటుకున్నప్పుడు గాని సంకపయ్య ఈ లోకంలోకి రాలేదు. మొలనున్న కొడవలిమీద చెయ్యిపడేటప్పటికి తలతిరగటం మొదలుపెట్టింది. కొద్ది క్షణాలు అక్కడే చతికిలబడి తేరుకున్నాడు కాని కల్లుకంపు భరించలేక దూరంగా వెళ్ళాడు.

మిట్టమధ్యాహ్నపు మండు టెండలో అంతా నిశ్శబ్దంగా ఉంది. నరికి విసిరేసినట్టున్న కొండలమీద మామిడి, నేరేడు, పనసచెట్లల్లో వ్యాపించిన ఆ వృక్షఛాయల్లో అగ్నితప్తమైన ఆకాశంలో — అన్నిచోట్ల నిశ్చింత, తృప్తి ఉన్నాయి. అప్పుడప్పుడు దాహంగొన్న కాకి అరుపు, చెట్టు గొట్టు పిట్ట చెట్టుమొదట నీళ్ళకోసం వెదుక్కోవటం, అక్కడక్కడ తుమ్మెదల ఝుంకారం, బురదగుంటల్లోపడి ఉన్న బర్రెల అరుపులు..

'ప్రకృతి మనిషిని పట్టించుకోదా? లేక...' సంకపయ్య ఆలోచనలో పడ్డాడు. 'ఇది మానసిక సంఘర్షణతో గడపాలిసిన సమయంగాదు, ఆదమరచి నిద్రపోవటానికి తగిన సమయం...'

ఎముకలు కొరుకుతున్నాయి. ఆకాశం అంతా కృద్ధ కాళీమాత విరబోసుకున్న జుట్టులా ఉంది. "ఏనుగు వస్తుందా? రానీ. భూమి నోరు విచ్చుకుని వేళాకోళంచేస్తుందా? చెయ్యనీ. రెండుచేతులతో పెళ్లాం, కొడుకు గొంతుకలు నులిమేస్తా."

ఈ ఆలోచన లన్నిటిమధ్య మనస్సులో ఒక సంగతి మాత్రం గుర్తుకు వస్తోంది. 'సర్వనాశనం అయిపోయింది' ఆలోచిస్తూనే ఉన్నాడు. 'నాన్నగారూ, ఇలా ఉన్నారేం?' అని లక్ష్మి అడిగితే 'ఏనుగు పడి తోటంతా విరగతొక్కేసింది. అంతా నాశనం చేసేసింది' అని చెప్తా." "ఏనుగువల్ల సర్వనాశనం అయింది లక్ష్మీ!" అని సంపకయ్య మనుష్య సంచారంలేని ఆ అడవిలో గొంతెత్తి అరచాడు...

దారిలో జీడిమామిడిచెట్టు కన్పిస్తే గుర్తొచ్చింది లక్ష్మికి జీడిమామిడి పళ్ళంటే ఇష్టంఅని. కాసినిపళ్ళు కోశాడు. ఇంతలో శాంత గుర్తువస్తే ఆ అమ్మాయి కిష్టమైన నేరేడుపళ్లు కొయ్యటం మొదలుపెట్టాడు. మళ్ళీ ఆలోచన — "శానుభోగ్, వాడికొడుకు కృష్ణ, తన పెంటచ్చిపెళ్ళాం, పనికిమాలిన కొడుకు వీళ్ళల్లో ఎవరన్నా వచ్చి 'ఏనుగు తోట నాశనం చేశాక ఇప్పుడన్నా బుద్ధి వచ్చిందా? ఇంక అప్పు ఎట్లాతీరుస్తావ్? ఇంక నారింజతోట కాపు కేం వస్తుంది?' అని అంటూ కబుర్లు చెప్తే ఒక్కొక్కళ్ళని పళ్ళు రాలగొడతా. నా హుంకారంతో అడవి ప్రతిధ్వనించేటట్టు చేస్తా. రక్తం కక్కిస్తా." త్వరత్వరగా నడవటంవల్ల కాళ్ళు నొప్పి పెడ్తున్న ట్టనిపించింది. కళ్ళు మసకలు కమ్మాయి. "అబ్బ ఏం ఎండ!" అని మాత్రం అని కండువా తలకిచుట్టుకున్నాడు. "కృష్ణభట్టు బాకీని గురించి గొడవ మొదలు పెడితే వాడినోట్లో ఉమ్మేసి పంపుతా. మొలన వేలాడుతున్న కొడవలిపిడి గట్టిగా పట్టుకుని నడక సాగించాడు.

తడి ఆరిపోయిన గొంతు ఉమ్మితో తడుపుకుంటూ ప్రతిజ్ఞచేశాడు — "పెళ్ళాన్ని పిలిచి 'ఇకనుంచి నువ్వు ముట్టుకున్న నీళ్ళు కూడ తాగను, పో ఇంట్లోంచి లక్ష్మి,

శాంత నా దగ్గరుండి వంటచేసి పెడతారు' అని అంటా". అతనికి దారి మర్చిపోయినట్టు అదాటుగా గుర్తొచ్చింది. కొండపక్కన నుంచుని "ఇదేమిటి, వెళ్ళేదారే మరచి పోయానే ?" అని అన్నాడు.

'దారిమరచిపోయా' అని గట్టిగా అనాలనుకున్నాడు కాని ఎండిపోయిన గొంతునుంచి మాట రాలేదు. ఎడమపక్క వెదురుపొద వైపు దృష్టి సారించాడు. ఎండపొదకి అడ్డంగా చెయ్యిపెట్టుకుని, ఎత్తుగా పెరిగిన గడ్డివైపు రెండడుగులు వేశాడు. మెట్లమీద నుంచి జారిపడిన ట్లనిపించింది. వెంటనే కండవాతో ముఖం కప్పుకున్నాడు.

— శానుభోగ్ కొడుకుని కౌగలించుకుని లక్ష్మి చెట్టునీడన హాయిగా పడుకునుంది.

* * *

దారి మరచిపోయానా ఏమిటి ?"

వత్తిలో పెరుగుతూ, పెరుగుతూ పెద్దదై మండే దీపశిఖలా ఈ సంగతి మనోంధకారంలో మండుతోంది. చెట్టుమీద కోతులు పళ్ళికిలించి విసిగిస్తున్నాయి.

నిజంగానే దారి మరచిపోయానా ?" లోయ అంచున నుంచుంటూ "లేదు, మరచిపోలేదు"అన్నాడు. పళ్ళు కొరుకుతూ, కళ్ళు తిరిగే జలపాతంవైపు చూశాడు. ఎడమ పక్కకి తిరిగి కృష్ణభట్టు ఇంటికి వెళ్ళనా ? లేక పోతే తిన్నగా ఇంటికి వెళ్ళనా ? ఆ బాధాకరమైన విషయం వ్యాపించిపోయింది. వెనకనుంచి అడుగుల చప్పుడు విని (చెట్టుమీది కోతిముఖం గుర్తొచ్చి) ఉలిక్కిపడి వెనక్కితిరిగి చూశాడు. ఇంత వరకు సంకపయ్యకి జరిగిన అవమానం చాలదన్నట్టు శానుభోగ్ ఎదురుగా నుంచున్నాడు.

"విన్నావా, సంకపయ్యా ?"

"ఆఁ"

"లోయలో ఒక పెద్దపులి నిశ్చింతగా పడుకుని ఉన్నదంట. దానికేం భయం ప్రపంచం అంటే ! కొగ్గ వెనకనుంచి తుపాకి పేల్చి చంపాడు. మంచి పనే చేశాడులే మరి..."

పెద్దగాలిదుమారం తర్వాత ఆకులుకూడ అల్లల్లాడకుండా నిశ్చలంగా ఉండే చెట్ల మాదిరి సంకపయ్య విభ్రాంతుడై నిలుచుండిపోయాడు...

శానుభోగ్‌తో కబుర్లు చెప్పటం ఇష్టంలేక సరాసరి కృష్ణభట్టు ఇంటివైపు మళ్ళాడు.

* * *

ఆర్నెల్ల తర్వాత ఒకరోజు సాయంకాలం, పొలంగట్టున బద్ధకంగా నడచిపోతున్న సంకపయ్యని చూసి బస్తీనుంచి వచ్చిన అహ్మద్ సలాం చేశాడు. ఆ మాటలు ఈ మాటలు చెప్పి "మీరు తోటలు, ఇళ్ళు వాకిళ్ళు అన్నీ కృష్ణభట్టుకి అమ్మేసి, ఇంట్లో వాళ్ళందరినీ శివమొగ్గ పంపించి వేశారని విన్నా. ఒంటరిగా ఉంటూ వ్యవసాయం చేస్తున్నా రని ఇందాక తెలిసింది. నిజమేనాండీ సంకపయ్య గారూ ?" అని అడిగాడు.

సంకపయ్య మాట్లాడకుండా తల ఊపాడు.

"చూశారా నారింజచెట్లు పూతమీద ఎలా ఉన్నాయో ! ఈసారి మంచి కాపు దిగుతుందండీ."

ఈ సారికూడ సంకపయ్య తలతిప్పాడు. అహ్మద్ మళ్ళీ అందుకున్నాడు — "కృష్ణభట్టుగారు ఎనిమిదివందల యాభై అడిగారు. కిందమీదపెట్టి ఏడువందలకి లాక్కొచ్చా. ఏమి నష్టంలేదు కదండీ ?"

"లేదులే" అని జవాబిచ్చాడు.

"ఒంటరిగా ఉంటూ విసుగెత్తిపోయి ఉంటారు" అంటూ అహ్మద్ బీడీ ముట్టించాడు.

"ఎందుకు విసుగెత్తుతుంది ?" అని సంకపయ్య గుడిసెదగ్గరకి వచ్చేటప్పటికి పొద్దు వాలిపోయింది.

ఆవేళప్పుడు అన్నం వండుకోవాలని పించలేదు. బూడిద పేరుకున్న ఆ పొయ్యి ఎవరంటిస్తా రిప్పుడు ? గాలి విసురుకి దీపం ఆరిపోతే బయట వాకిట్లోకి వచ్చాడు. ఆకాశంలో మబ్బులు అలుముకోవటంవల్ల ఒక్క నక్షత్రంకూడ కన్పించటంలేదు.

రాత్రి పన్నెండు గంటలవరకు చేతులు చుట్టుకుని వాకిట్లో పచార్లు చేస్తూ చేస్తూ ఆగిపోయాడు. మొలకి చుట్టుకున్న కండవా తీసి తలకి చుట్టుకుని పనసచెట్టు మొదట అరుగుమీద ఒక కాలు పెట్టి తనలో తను అనుకోసాగాడు — "అంతా ఇంట్లోంచి వెళ్ళిపోతున్నప్పుడు 'నాన్నగారూ, నేను మీదగ్గరే ఉంటాను అన్నట్టు కళ్ళతో బ్రతిమాలుతూ చూసిన శాంత ఉంటే నన్నానుకు కూర్చుని, నా తెల్లటిమీసాలు సవరించేది. నేను దాని నల్లటిజుట్టు సవరించేవాణ్ణి..."

నిల్చుని నిల్చుని సంకపయ్య కాళ్ళల్లో నిస్సత్తువ వచ్చింది. ఒక పెద్ద నిట్టూర్పు విడిచి పక్కనున్న చెట్టునానుకుని కండవా అంచుతో తడికళ్ళు తుడుచుకున్నాడు. ఎవరిదో ముసలి ఆవు వచ్చి వాసన చూస్తూంటే దాని దవడలు గోకటం మొదలు పెట్టాడు.

# పారిశ్రామిక విశేషాలు

## కేంద్ర రంగం

సింథటిక్ మందుల ప్రాజెక్టు, భారీ విద్యుత్పరికరాల కర్మాగారాల నిర్మాణ కార్య క్రమాలు చాలా చురుకుగా జరుగుతున్నాయి

సనత్‌నగర్‌లో హిందుస్థాన్ మెషిన్ టూల్స్ లి., ఆయిదవ యూనిటును స్థాపించ డానికి అవసరమైన నేలను ప్రాజెక్టు అధికా రులకు అందజేయడం జరిగింది పట్టణపు పొలిమేరలో స్థల సేకరణ జరిగింది అనుకున్నట్టుగా యీ కర్మాగారం 1965 ప్రారంభం నాటికి పూర్తి కావడానికై దీనికి సంబంధించిన అన్ని ప్రాధమిక కార్య క్రమాలు పూర్తయ్యాయి

డిఫెన్సు ఎలక్ట్రానిక్స్ ప్రాజెక్టు నివేదిక పూర్తి కావడంతో భారత ప్రభుత్వం చిట్ట చివరకు యీ కార్మాగారాన్ని ఆంధ్ర ప్రదేశ్‌లో ఏర్పాటు చేయాలనే అభిప్రా యాన్ని తెలియజేసింది ఈ కర్మాగారం స్థాపనకు స్థలసేకరణకై ప్రాధమిక చర్యలు తీసుకోవడం జరుగుతున్నది

దిగుమతి అయిన ముడి ఖనిజాన్ని చేర వేసే సౌకర్యం వున్నందువేతా, దగ్గరలోని కోరమాండల్ ఎరువుల ఫ్యాక్టరీకి తయా రయిన సల్ఫ్యూరికామ్లాన్ని అందజేసే అవ కాశం వున్నందువేత విశాఖపట్నంలో ఒక జింకు శుద్ధి కార్మాగారాన్ని స్థాపించే విషయాన్ని భారతప్రభుత్వం ఆలోచిస్తు న్నది ఇందుకై డిప్యూటు చేయబడిన కేంద్ర ఆధికారులు యీ ప్రాంతాన్ని పరిశీలించారు పోలెండు సహకారంతో భారత ప్రభుత్వం దీనిని నిర్మించ సంకల్పించింది

## ప్రయివేటు రంగం

సంవత్సరానికి 64 000 టన్నుల గాజు ట్యూబులు వుత్పత్తి చేయగల ఒక కర్మాగారాన్ని నెల్లూరు జిల్లా పడుగుపాడు వద్ద నిర్మించడానికి భారత ప్రభుత్వం అంగీకరించింది మొదట్లో యీ కర్మాగారాన్ని మద్రాసులో నిర్మించడానికి లైసెన్సు యివ్వబడింది

అదేవిధంగా ఆంధ్ర ఫోర్జింగ్స్ లి.. హైదరాబాదు వారికి ఫోర్జు ఫౌండ్రీకై మంజూరు చేసిన లైసెన్సును మద్రాసు రాష్ట్రానికి మార్పు చేసేందుకు భారత ప్రభుత్వం అంగీకరించింది

అల్లంపూర్‌వద్ద సంవత్సరానికి 2 లక్షల టన్నుల సిమెంటును ఉత్పత్తిచేసే ఒక కర్మాగారాన్ని నిర్మించడానికి ఒకప్రయివేటు బృందంవారికి లైసెన్సు యివ్వబడింది ఇంతవరకు సిమెంటు ఫ్యాక్టరీ నిర్మాణానికి లైసెన్సు యివ్వబడిన యితర ప్రాంతాలు ఎర్రగుంటల, విజయనగరం బోనకల్లు, తాండూరు భువనగిరి

ఆజమాబాదుకు చెందిన మహబీర్ నూలుమిల్లులవారికి 18 000 కదుళ్ళకు లైసెన్సు యివ్వబడింది ఇంతకుపూర్వమే స్థాపించబడిన ఒక సంస్థకు రిజిస్ట్రేషను చేసే చర్య యిది

## సింగరేణి కాలరీస్

1963 నవంబరు నెలలో సింగరేణి గ్రూపు గనుల్లో బొగ్గు వుత్పత్తి 2,96,596 7 టన్నులు వుంది

1963 నవంబరు మాసాంతానికి త్రవ్విన బొగ్గు 30 29, 083 9 టన్నులు గత సంవత్సరం యిదే కాలానికి త్రవ్వితీసిన బొగ్గు 28,19 520 2 టన్నులు వుంది

1963 డిశంబరు 2వతేదీన కొత్తగూడెం గనులకు సంబంధించిన బి పవర్‌హౌస్‌కు ఆనుకుని ఒకచిన్న కొత్త వర్కుషాపుకు జనరల్ మేనేజరు ప్రారంభోత్సవంచేశారు కొత్త పవర్‌హౌస్ అవసరాల్ని యిది తీర్చ డానికి వుపయోగిస్తుంది

## నిజాం చక్కెర ఫ్యాక్టరీ

డిశంబరు నెలలో ఆడిన చెరకు వివరాలు

| | |
|---|---|
| 1 ఫ్యాక్టరీ | 43 837 ఎమ్ టి |
| 2 ఫ్యాక్టరీ | 63 300 ఎమ్ టి |
| మొత్తం | 1,07 137 ఎమ్ టి |

డిశంబరు నెలలో మొత్తం ఉత్పత్తయిన పంచదార

| | |
|---|---|
| 1 ఫ్యాక్టరీ | 46 855 సంచులు |
| 2 ఫ్యాక్టరీ | 67 443 " |
| మొత్తం | 1 14 298 సంచులు |

## బోనసు

నెలకు రూ 500లు, ఆలోపు జీతం తీసుకునే పనివారలకు 1962-63 ఆర్థిక సంవత్సరానికి 3¾ నెలల బోనసు యివ్వ డానికి యజమానులు అంగీకరించారు పై బోనసు క్రింద సుమారు 5,500ల మంది శాశ్వత, తాత్కాలిక, సీజను పనివారలకు

రూ 12.50 లక్షలను పంచడం జరిగింది.

## చేనేతపరిశ్రమ — సహకార నూలుమిల్లులు

సమాజపు ఆర్థికవ్యవస్థ అల్లికలో చేనేత పరిశ్రమ శాఖోప శాఖలుగా చీలి అల్లుకుని, విస్తరించి, గ్రామీణ, లఘు పరిశ్రమలలో ప్రముఖస్థానం ఆక్రమించింది. పారిశ్రామిక రంగంలో యాంత్రిక అభివృద్ధికి తట్టుకోలేని యీ రోజుల్లో వ్యవసాయమే ప్రధానవృత్తిగాగల ఆంధ్రప్రదేశ్‌లో చేనేత పరిశ్రమ చాలా చోట్ల పూర్తిసమయపు వృత్తిగా అభివృద్ధి చెంది, వారి ఆదాయాన్ని పెంపొందించడంలో ఎంతగానో తోడ్పడుతున్నది. రాష్ట్రంలో సుమారు 25 లక్షలమంది తమ జీవనభృతికి చేనేత పరిశ్రమ మీదనే ఆధారపడుతున్నారు.

దేశంలో పారిశ్రామికీకరణం వల్ల గట్టి దెబ్బ తగిలినా, ఆర్థిక పురోభివృద్ధికి చేనేత పరిశ్రమ ఎంతగానో తోడ్పడడానికి ప్రధానమైన కారణాలు — దానికి అవసరమైన రకం ముడిప్రత్తి లభించడం, పూర్తయిన వస్తువులకు మార్కెట్టు వుండడమూను.

ఈ పరిశ్రమకు కావలసిన ముఖ్య ముడిసరుకు నూలు. ఆంధ్రప్రదేశ్‌లో చాలా తక్కువ నూలుమిల్లులు ఉన్నాయి. వీటి ఉత్పత్తి చేనేత పనివారల అవసరానికి సరిపోదు. అదీకాక వీటికి మేలురకం నూలు లభ్యంకావడమే లేదు. అందుచేత సహకార రంగంలో నూలుమిల్లుల స్థాపనావశ్యకత వున్నట్లు గుర్తించబడింది. ఎపెక్స్, ప్రాథమిక చేనేత పనివారల సహకార సంఘాల సంయుక్త కృషివల్ల గుంతకల్లులో సహకార విధానంలో ఒకనూలు మిల్లును స్థాపించడం జరిగింది. మొదట్లో యీ మిల్లు 12,000 కదుళ్ళతో ప్రారంభించబడినప్పటికీ, యిప్పుడు యిది 20,000 కదుళ్ళతో పనిచేస్తున్నది. ఈ సంఖ్యను 24,000కు పెంచి, మరో 12,000 కదుళ్ళతో 'బి' యూనిటును ప్రారంభించాలనేది యీ మిల్లుకు సంబంధించిన విస్తృతీకరణ కార్యక్రమంలో ఒకటి. చీరాలలో ఒకటీ, హైదరాబాదులో ఒకటీ ఒక్కొక్కచోటా 12,000 కదుళ్ళతో రెండు మిల్లులను స్థాపించడానికి గుంతకల్లుమిల్లు ప్రోత్సాహాన్ని కలిగించింది. గుంతకల్లు, హైదరాబాదులలోని సహకార నూలు మిల్లులు తక్కువనెంబరు నూలును — 10నుండి 32 నెంబరు వరకు ఉత్పత్తి చేస్తాయి. చీరాల మిల్లు మధ్యరకం నెంబరును ఉత్పత్తి చేస్తుంది. ఈ మూడు మిల్లులలో మొత్తం సంవత్సరానికి ఉత్పత్తి అయ్యే నూలు సుమారు 18,000 బేళ్ళు. మొత్తంరాష్ట్రంలో వున్న చేనేత మగ్గాలకు 2.5 లక్షల బేళ్ళు నూలు కావలసివుంది. ఈలోటును పూరించడానికి ప్రభుత్వం తూర్పు గోదావరి, కృష్ణా, నెల్లూరు, చిత్తూరు, కడప, ఆదిలాబాదు జిల్లాలలో మరి ఆరు సహకార నూలుమిల్లులను స్థాపించాలని అభిప్రాయ పడింది. అప్పుడే తూర్పుగోదావరిజిల్లా రాజమంద్రిలోనూ, నెల్లూరులోనూ నూలు మిల్లుల్ని స్థాపించడానికి సహకార సంఘాలు నమోదయ్యాయి. చిత్తూరుజిల్లా, పుత్తూరులో మరొక సహకార నూలుమిల్లు స్థాపనకు త్వరలోనే మరొకసంఘం నమోదు కాబోతున్నది. రాజమంద్రి సహకార నూలు మిల్లుల డైరెక్టర్ల బోర్డునుకూడా ప్రభుత్వం నియమించింది. వీరు దీనికి అవసరమైన పెట్టుబడి షేరును వసూలుచేయడానికి తగిన చర్యలు తీసుకుంటున్నారు. రాజమంద్రి, నెల్లూరు, పుత్తూరులలోని మిల్లులకు లైసెన్సును పొందే విషయమై చేసిన దరఖాస్తులు పరిశీలించబడుతున్నాయి. ★

# పరస్పరం

గుమ్మలూరు సత్యనారాయణ

ఏమరుపాటు కూడ దని
యెందరు గట్టిగ జెప్పలేదు ? నీ
సోమరి వేషభాషలకు
సూటిగ స్వస్తిని జెప్పి హాలిక
వ్యోమమునందు శ్రద్ధ గని
పుష్టిని తుష్టిని పెంచునట్టి యే
సామము చేతనైన తిను
సస్యము లెక్కువ సేయ రమ్మికన్ ॥

జీవనమన్న నీయదె కృ
షీవలుడా! సువిశాల భాగ్య భో
గావహమై. స్వతంత్రమయి,
ఆమరణాంతము దార్ఢ్య యుక్తమై,
పావన మౌచు, శ్రేష్ఠతర
భారత భారతి చేతితంత్రియై,
ఆవల గావ్యపాఠమయి,
అంచితకీర్తి వహించియుండుటన్ ॥

జీవితమే మొనే నెఱుగ;
జీవనదాతల భోగభాగ్య సం
భావన మంతకన్న జెయి
బట్టగనై తిని; కాయకష్టమే
పావన జీవితాంత సుఖ
భావరసగ్రహ మాధురీ ఝరిన్
దీవెనలిచ్చి ప్రోచునని
దీర్ఘముగా దలపోసి యెంచితిన్ ॥

శుభకృతు శోభకృత్విజయ
చోద్యము, క్రోధి.విరోధి దుర్మతీ
రభసము, వచ్చిపోయెడివి
రాపిడి బెట్టియు పెట్టకుండగన్;
శుభములె మా కవన్నియును;
శోభదలిర్చెడు కాలమానముల్
విభవము నుండుదాక కృషి
భేద్యముగాదు స్వశక్తినుండుటన్ ॥

పాడికి బంటకు బనిబాట్లకును వచ్చు
పశుదేశ భామినీ భాగ్యయుతుడు,
అరుణాచలాగీత కిరణపుంజప్రభా
భూరి మరుత్ప యోభోగవరుడు,
తుచ్ఛజీవనముపై తొలి దేశభాషల
దల నమ్మికొనని స్వాతంత్ర్యపరుడు,
ఘోరభయోత్పన్న కుంభప్రవృష్టికి
జిట్టున జీదని శ్రేష్ఠబలుడు,
భగవ దభిమానశూరుండు, పావనుండు,
దేశమాతకు సర్వథా తృప్తికరుడు,
శాశ్వతానంద మహనీయ శక్తు, డెవ్వ డనిన
కర్షకా నీవుగా కన్యు డెవడు ?

కవు లిట బలికెడి పలుకులు,
చెవి కింపుగ నుండునట్లు జెప్పంగల; రీ
కవిగీతల సారాంశము
వ్యవసాయ కుటీరమందు బారంగలదే ?
వ్యవసాయము బహుపోషక
భవితవ్యమటంచు మనము భావింపదగున్,
ఎవరెవరికి నేవిధమగు
చవియుండునొ దాని నెల్ల సాధింపదగున్ ॥

కాడి కదలకయున్న గంటమ్ము నిల్చు,
పాడి పొంగకయున్న భావాలు చచ్చు,
శ్రమనొంపు శ్రమనొందు శ్రమనొందుమోయి,
శ్రమదీర్ప నీకీర్తి శ్రావింతునోయి ॥

# కూచిపూడి కళాక్షేత్రం భరతనాట్యానికి పుట్టినిల్లు

మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

కూచిపూడి భాగవతుల పేరు విననివా రుండరు. ఆంధ్రదేశంలో ప్రతి మారుమూల గ్రామాలలో సైతం వారి ప్రదర్శనాలు ప్రదర్శించబడ్డాయి. పెద్దపెద్ద రాజాస్థానాలలోనూ, దేవుళ్ళ కళ్యాణ ఉత్సవ సమయాల్లోనూ, తిరునాళ్ళ సమయంలోనూ తప్పక కూచిపూడి భాగవతుల ప్రదర్శనాలు జరుగుతూ ఉండేవి. ఆ విధంగా వారు కొన్ని శతాబ్దాలుగా ఏకచ్ఛత్రాధిపత్యంగా విశాలాంధ్రదేశంలో ప్రదర్శనా లిచ్చి వేనోళ్ళ పొగడబడ్డారు.

కాని ఈనాడు వారి భాగవత ప్రదర్శనాలు తగ్గిపోయాయి. రాజాదరణ లేనేలేదు. ఇక పోతే ప్రజాదరణ కూడ కొరతగానే ఉంది. నేడు కూచిపూడిలో కట్టుదిట్టంగా ప్రదర్శనా లివ్వగలిగిన సంస్థ ఒకే ఒకటి. అదే వెంకటరామా నాట్యమండలి. ఈ మండలి చింతాకృష్ణమూర్తిగారి ఆధ్వర్యంలో నడుస్తూంది. ఇంతకు మినహా ఆంధ్రదేశంలో కూచిపూడి భాగవతాలను కాని కూచిపూడి నాట్యసాంప్రదాయాన్ని కాని ప్రచారం చేయగల మరొకటి వుందని చెప్పడానికి ఆధారం లేదు.

వారు ఆట ప్రారంభిస్తే భరతముని ప్రసాదించిన భరతనాట్యాన్ని, నందికేశ్వరుని అభినయ దర్పణాన్ని శాస్త్రయుక్తంగా తెల్లవార్లూ ప్రదర్శిస్తూ వుండేవారు. వేలాది ప్రజలు వీరి ప్రదర్శనాలు చూచి ఉప్పొంగిపొయ్యేవాళ్ళు. ప్రదర్శనమంతా ఆధ్యాత్మిక వాతావరణంలో నిండియున్నప్పటికీ ప్రజలయొక్కచిత్తప్రవృత్తులు కూడ ఆధ్యాత్మిక చింతనతో కూడిఉండడంవల్ల ప్రదర్శనంలో వచ్చు ప్రతి విషయాన్ని అర్థమైనట్లుగానే ఆహ్లాదంతో మునిగి ఆనందించేవాళ్ళు. ఎంతోమందిపండితులు సయితం వీరి విద్యను పరీక్షించటానికి పోటీపడి మరీ కూర్చునేవారు. వీరు పండితుల, పామరుల మన్ననలపొంది అనేక బహుమానాలను పొందారు. ఆ విధంగా నైజాం నవాబువద్ద సంపాదించినదే వారి అగ్రహారం.



నాట్యవిన్యాసం

## కుచేల పురం

కూచిపూడి గ్రామం కృష్ణాజిల్లాలో తూర్పుకోస్తాలో వుంది. జిల్లా ముఖ్యపట్టణమైన మచిలీపట్టణానికి 15 మైళ్ళ దూరంలో వుంది. అంతేకాక శాతవాహన చక్రవర్తుల ముఖ్యపట్టణ మైన శ్రీకాకుళానికి (కృష్ణా జిల్లా) చేరువలో ఉంది. మువ్వగోపాల పదాలతో దక్షిణదేశాన్నంతా ఉర్రూతలూగించిన క్షేత్రయ్య స్వగ్రామమని చెప్పబడే మొవ్వగ్రామానికి అతి సమీపములో వుంది ఈ కూచిపూడి. ఈ కళాక్షేత్రం ఒక బ్రాహ్మణ అగ్రహారం. దీనిని కుచేల పురమని కూడ కొంత కాలం క్రితం వరకూ పిలుస్తూ వుండేవారని ప్రతీతి. దాదాపు 5 వందల సంవత్సరాలకు పూర్వమే నాట్యకళకు అంకురార్పణ చేశారని చరిత్రకారుల వల్ల తెలుస్తూంది.

## సిద్దేంద్రయోగి

అసలు కూచిపూడికి ఈ సంప్రదాయము ఎలా వచ్చిందో కొంచెం తెలుసుకొని ముందుకు నడిస్తే మనకు చరిత్ర బోధపడుతుంది. ఈనాటికీ కూచిపూడి వారిని "మీకీ నాట్యసాంప్రదాయంగాని, భాగవత సంప్రదాయంగాని ఎక్కడినుంచి వచ్చింది" అని అడిగితే వారు ఈ క్రింది గాథను తెలియచేస్తారు. కూచిపూడి భాగవతుల ప్రదర్శ

నాలకు మూలపురుషుడు సిద్దేంద్రయోగి అని ప్రసిద్ధి. ఈయన కూచిపూడి గ్రామస్థుడే అని కొందరూ, యాత్రలు చేస్తూ కూచిపూడి చేరిన పరదేశి అని కొందరూ, ఈ విధంగా ఆయన కాలాన్ని నిర్ణయించలేకుండా వున్నారు.

## సిద్ధయ్య

కొన్ని శతాబ్దాల క్రిందట కూచిపూడి గ్రామంలో సిద్ధయ్య అనే ఆయన వుండేవారట. సిద్ధయ్యగారు చాలా అమాయకుడు, నిరక్షరాస్యుడు. సోమరితనంగా తిరుగుతూ వుండేవాడు. ఆ వూరి తక్కిన బాలురచే పరిహసింపబడుతూ వుండేవాడట. ఏమాత్రం విద్యాసక్తిలేక అయోమయంగా వుంటూ వుండేవాడు.

కొంత కాలానికి యుక్త వయస్సు వచ్చింది. సాంప్రదాయ సిద్ధంగా ఆ గ్రామంలోనే అన్ని విధాల తగిన కన్య నిచ్చి వివాహం చేశారు. వివాహం అయిన కొద్ది దినాలకి సిద్ధయ్యగారిలో ఒక కొత్త మార్పు రా సాగింది. విద్యాసక్తి కలిగింది. తల్లిదండ్రులవద్ద శలవు తీసుకొని ప్రయాణమయ్యాడు. ఆ గ్రామానికి పశ్చిమంగా వున్న కృష్ణానదిని దాటి ఒక పల్లెటూరికి విద్యాభ్యాసం కొరకు వెళ్ళిపోయాడు.



నాట్యవిన్యాసం

సిద్ధయ్యలో కలిగిన ఈ వింతమార్పు ఆ గ్రామవాసు లందరిని ఆశ్చర్య చకితుల గావించింది. కొంతకాలం ఇలా గడిచి పోయింది. సిద్ధయ్యను గురించి చెప్పుకున్న వారు లేరు. కాని ఇంతలోనే మన సిద్ధయ్యగారు సకల విద్యాపారంగతుడై అన్ని విద్యలలోనూ ఆరితేరిన సిద్ధహస్తుడై తిరిగి వచ్చారు.

వచ్చేముందు సిద్ధయ్యగారి గురువు, "నాయనా! నీవు నా దగ్గర అభ్యసించాల్సిన దేమీలేదు. పోయి గృహస్థాశ్రమ ధర్మమును అనుసరించి సుఖంగా జీవించు" అని ఆశీర్వదించి పంపించాడు. గురువు దగ్గర శలవు తీసుకుని ఇంటికి ప్రయాణ మయ్యాడు. అది సంధ్యాసమయం. సూర్యుడు అరుణ కాంతుల విరజిమ్ముతున్నాడు. కృష్ణా తీరం చేరుకున్నాడు. సంజచీకట్లు క్రమ్ముకుంటున్నాయి. సిద్ధయ్యగారు స్నానం ఆచరించి సాయం సంధ్యావందనం చేస్తున్నారు. ఇంతలో కృష్ణానది పొంగిఒక్క పెట్టున కంఠంవరకూ నీటి ప్రవాహము ముంచుకొచ్చింది. ప్రమాద స్థితిలో వున్నాడు మన సిద్ధప్ప. తన ప్రమాదస్థితి గ్రహించి ఆత్మసన్యాసం చేశాడట. ఇంతలో ఒక తరంగం హఠాత్తుగా వచ్చి సిద్ధప్పను ఒడ్డుకు చేర్చిందట. అంతట ఆయన సంసారాన్ని త్యజించి తన శృంగార భావాలను శ్రీకృష్ణ భక్తితో మిళితం చేసి భామాకలాప మనే పారిజాతాపహరణ యక్షగానాన్ని రచించి కూచిపూడి భాగవతులకు బోధించి ధన్యుడైనా డని ఒక కథనం.

## మరోకథనం

సిద్దేంద్రయోగి మొదట శృంగేరీమఠంలో

ఒక చదువురాని ముసిలిబ్రాహ్మణ భక్తి పరవశుడై కృష్ణకీర్తనలు పాడుతూవుండగా గమనించిన శృంగేరీ పీఠాధిపతి కృష్ణభక్తిని ప్రచారం చేయడానికి అతనిని దేశసంచారం పంపినట్లు, యాత్రలుచేసుకుంటూ కూచిపూడి గ్రామం వచ్చినట్లు, వూరివెలుపల దేవాలయంవద్ద మకాం వేసినట్లు, ఇంతలో కూచిపూడి బ్రాహ్మణస్త్రీలు ఊరివెలుపల బావికి నీళ్ళకు వచ్చి సిద్ధేంద్రుని దర్శించినట్లు చెప్పుతారు.

ఆనాటి ఆచారము ఏమంటే గ్రామంలో ఎవరైనా అతిథులు వస్తే ప్రథమంగా ఆయన్ని సత్కరించాలి. అలాగే వీరివి సత్కరించటానికి కూచిపూడి బ్రాహ్మణులు వారిని దర్శించి ఆతిథ్యాన్ని అందుకోమన్నారు. అందుకు ఆయన సమ్మతించి అన్నందగ్గర కూర్చుని ఒకకోరిక కోరినట్లూ దానిని వీరు శిరసావహించినట్లూ చెబుతారు. ఏమిటా కోరిక ? ఆయన ఒక భాగవతం వ్రాసినట్లూ, దానిని ప్రదర్శించాలనీ అదే తన కోరికనీ, "ఆకోరిక మీరు తీరుస్తానంటే భోజనంచేస్తాను" అని చెప్పారుట. అందుకు వారు సరేనన్నారట. ఇందుకు సిద్ధేంద్రుడు నాట్య శాస్త్రాన్ని వారికి బోధించడానికి యిష్టపడి, వారు శాస్త్రాన్ని వంశపారంపర్యంగా ప్రతి గృహంలోను కులవృత్తిగా గ్రహించి ప్రతీబ్రాహ్మణ యువకుడూ ముక్కు కుట్టించుకుని కాలికి గజ్జకట్టి ఆవూరి నటరాజు ఆలయంలో ఒక్కసారైనా నాట్యప్రదర్శనం చేసేటట్లు వాగ్దానంచేయించుకుని పారిజాతాపహరణ మనే భామాకలాపాన్ని వారికి ఉపదేశించాడట. ఆయన ఆదేశానుసారం ఆనాటి నుండి - ఈనాటి వరకూ నాట్యవిద్యలో దినదినాభివృద్ధిపొంది, వివిధ దేశాలను సందర్శించి నానారాజ సందర్శనం చేసి శతాబ్దాల తరబడి పేరు-ప్రఖ్యాతులు సంపాదించారు.

## అక్షరాభ్యాసం

ఆనాటినుంచే నాట్యంలో అక్షరాభ్యాసం చేయబడింది. వెంటనే సిద్ధేంద్రుడు బాలుర నందర్నీ సమకూర్చి, వారికి నాట్యాభినయాన్నీ, సంగీతాన్నీ నేర్పాడు. ఆనాటి నుంచి వారి భాగవతాలకు అంకురార్పణ జరిగింది. నాట్య గీతాభినయాలను, కూచిపూడి కళాకారులకుసిద్ధేంద్రయోగి అంకితంచేశారు.

ఆనాటినుంచీ ఈనాటివరకూ కూచిపూడి నాట్యప్రదర్శనలూ, వారి భాగవతాలూ, వారి పగటివేషాలూ వంశ పారంపర్యంగా విశాలాంధ్ర దేశంలో ప్రచారం కావించబడ్డాయి.

## వంశ పారంపర్యం

అందువల్లనే వంశపారంపర్యంగా వచ్చే ఆ కళను నశింపనీయక, కూచిపూడి గడ్డమీద పుట్టిన ప్రతీ బ్రాహ్మణ మగబిడ్డకు ముక్కులు చెవులూ కుట్టించుతారు. కారణం ముక్కులకు చెవులకు రంధ్రాలుంటే ఆభరణాలు ధరించడానికి అనువుగా వుంటుంది. అది స్త్రీ పాత్రగాని, పురుషపాత్రగాని రంధ్రాలు వుంచడం అవసరం. అందువల్ల వయస్సు ముదిరితే రంధ్రాలు వేయడం కష్టంకనుక ఆ పనిని బాల్యంలోనే ముగిస్తారు. అంతేకాక యిలా చేయడం పసిపిల్లలకు విద్యాభ్యాస మెటువంటిదో వారికది అటువంటిది. ముక్కులూ, చెవులూ కుట్టించిన తరువాత కాలికి గజ్జ గట్టించి నటరాజుముందు నాట్యాభ్యాసాన్ని ప్రారంభిస్తారు.

## పారిజాతాపహరణం

కూచిపూడి భాగవతులు 15 వ శతాబ్దం నాటికి వారి కళాప్రదర్శనలను ప్రదర్శించటంలో ప్రఖ్యాతి వహించారు. ఇందుకు ఆధారం 1502 నాటి మచ్చుపల్లి కైఫీయతే. 16 వ శతాబ్దం చివరిభాగంనుండి యీ నాటి వరకూ పారిజాతాపహరణాన్ని ప్రదర్శిస్తూ ప్రశంసల్ని అందుకుంటున్నారు.

## భామా కలాపం

భామా కలాపంలో శ్రీకృష్ణుడు నాయకుడు, సత్యభామ నాయిక. శ్రీకృష్ణుడు రుక్మిణియందుంచిన అనురాగం సత్యభామ పట్ల చూపలేదని, సత్యభామ శ్రీకృష్ణునితో కయ్యమాడి ఆ వియోగాన్ని భరించలేక దూతికతో రాయబారం పంపడం, దూతిక సత్యభామ విరహవేదనను ఉపశమింపచేయడం అందులో కథ. శ్రీకృష్ణుని దక్షిణ నాయక లక్షణాలను, సత్యభామ అష్టవిధ నాయికల లక్షణాలను, అవస్థాభేదాలను అద్భుతంగా చిత్రిస్తారు. భామాకలాపంలో సత్యభామ యొక్కటే పాత్రధారి. సూత్రధారుడు కథకుడుగాను, చెలికత్తె మాధవిగాను సమయానుకూలంగా ద్వివిధపాత్రలను ధరించి చక్కని హాస్యాన్ని ప్రదర్శిస్తారు. భామాకలాపం సిద్ధేంద్రుడే వ్రాసినట్లు యీ క్రింది నాందిపద్యం ద్వారా వెల్లడౌతుంది.

జనులార వినుడి హరికథ<br>
వినవేడుక గలిగెనేని వీనులకొలదిన్<br>
కొనుమదీ కర్ణామృతముగ<br>
ఘనుడగు సిద్ధేంద్రయోగి కవితారచనన్

అని పద్యంతో ప్రారంభించిన తరువాత సత్యభామ యీ విధంగా తెర వెడలుతుంది.

### కీర్తన

భామనే । సత్యభామనే<br>
భామనే । పదహారు వేల<br>
కోమలు లందరిలోనా<br>
భామరో । గోపాలమూర్తికి<br>
ప్రేమదాననగు సత్య ॥భామనే॥<br>
అట్టహాసము చేసి సురల<br>
నట్టె గెలిచిన పారిజాతపు<br>
చెట్టుదెబ్బ నాదుపెరటా<br>
గట్టిగా నాటించుకొన్నా ॥భామనే॥

అంటూ సత్యభామ గర్వాతిశయంతో నృత్యం తొక్కుతూ అభినయం చేస్తుంది.

## భామపాత్రధారి వాచిక విధానము

కథయొక్క సందర్భాన్నిబట్టి వచనం నడుస్తూ వుంటుంది. భామ కలాపంలో సత్యభామ ఒక్కటే ఏకపాత్రధారి. ప్రక్కనున్న విదూషకుడు అవసరాన్ని బట్టి పురుష హాస్యగాని వలెను, మాధవి అనే స్త్రీపాత్ర ధారిగాను విదూషకుడే నిర్వహిస్తాడు. భామా కలాపంలో, ఉదాహరణకు సత్యభామ వాచికము :—

"ఓయమ్మా! వకా వకనాడు పడక మందిరంలో హంసతూలికా తల్పమందు, కేళికాగృహముల యందు, వజ్రవైఢూర్య గోమేధిక పుష్యరాగ మరకత మాణిక్య ములు స్థాపించినటువంటి నగరియందు పవళించి యుండగా, స్వామివారు వచ్చి శయ్యమీద కూర్చున్నారమ్మా. లేచి పరిమళ ద్రవ్యములు మొదలైన చందనగోష్ఠి చేసి నానే. అంతట స్వామివారు పరున్నారే, నేను కూర్చున్నానే, పాదసేవ చేసినానే. అప్పుడు స్వామివారు నన్ను తొడపై కూర్చుండ బెట్టుకొని అమూల్యమైనటువంటి ఆభరణములు అలంకరించి నిలువుటద్దం తెచ్చి ఎదుటనుంచి నడలుచూచి, సత్యభామా! నీవే చక్కదానవా, నేనే చక్కనివాడనా? అని అడిగెనే వోశమ్మా! అడిగేటివంటి వరకు ఆడబుద్ధి అపరబుద్ధి గనుక, తెలియక నేనే చక్కదాని నంటినే వోశమ్మా! అంతట స్వామివారు నామీద కోపంచేసి దిగ్గున లేచి చక్కా-పోయెనే వోశమ్మా! మన స్వామివారు ఎందుబోయెనో, యెక్కడబోయెనో వెదుకు తారటే వోశమ్మా!—" అంటూ మాధవితో ఎంతో అద్భుతంగా వాచికాభినయం నడుస్తుంది. ఇది వినడానికి ఆహ్లాదకరమైన ఒక వాచిక విధానం.

భామాకలాపం కూచిపూడివారే ప్రదర్శించాలి. మనం చూడాలి. ఈ ప్రదర్శనంలో శృంగారరసం వుట్టిపడుతూ వుంటుంది. నాయికా నాయకుల శృంగార వర్ణన, పాటలలో, నృత్యంలో, అభినయంలో పొందు పర్చారు. దానిని ఒక మహాకావ్యంగా తీర్చి దిద్దారు. ఏండ్ల తరబడి ప్రదర్శించి ప్రజాహృదయాలను చూరగొన్నారు. దీనిని రెండు భాగాలుగాచేసి ప్రదర్శించేవాళ్ళు. ఆ రెండవ భాగమే గొల్ల కలాపం.

## గొల్ల కలాపం

కూచిపూడివారి ప్రదర్శనాల్లో గొల్లకలాపం కూడ అతి ముఖ్యమయింది. నా చిన్న తనంలో మావూరు శ్రీరామనవమి సందర్భాల్లో చూచిన జ్ఞాపకం. ఈ గొల్ల కలాపంలో నాయిక గోపకన్య. ఆమె బ్రాహ్మణ గోపజన్మలో ఏది ఉత్తమమైంది అని బ్రాహ్మణునితో వాదోపవాదాలు జరుపుతుంది. దీనిని భాగవతుల రామలింగ శాస్త్రి గారు రచించారని ప్రతీతి. గొల్ల కలాపంలో గొల్లభామ వేషం ధరించి, వీధిలో చల్ల అమ్మినట్లు అభినయిస్తూ వుండగా, శిష్టాచారం గలిగిన బ్రాహ్మణుడు చల్లను కొనాలని గొల్లభామను పిలుస్తాడు. ఇరువురకు ఏకులం గొప్పదోయని వాదోపవాదాలు జరుపుతారు. మానవ సమాజమంతా సమానంగానే సృష్టించబడిందని, బ్రాహ్మణులు అధికం కారని వాదిస్తుంది. ఇందుకు ప్రదర్శనంలో ఇద్దరు గొల్ల పడతులు చల్ల అమ్మినట్లు వేషాలు ధరించి భాగవతంలో వర్ణించిన పిండోత్పత్తిని గురించి, నవమాసాల పిండచలనాన్నీ,



నాట్య విన్యాసం

పిండం బయటపడిన తరువాత, ప్రపంచ సృష్టి ఏ విధంగా వుంటుందో అభినయంతో వర్ణించేవారు. ఇందులో వేదాంతచర్చ జరుగుతుంది. ఈ బామా, గొల్లకలాపాలలో పేరు ప్రఖ్యాతులు గడించి అనేక మన్ననలు పొందిన వెంపటి వెంకటనారాయణగారు సిద్ధహస్తులు. ఆయన తరువాత కొంతమంది ఆ పాత్రను ధరించినప్పటికీ ఆయనతో సరి తూగరనే చెప్పవచ్చును. ఎంతోకాలం ఈ గొల్లకలాపాన్ని ఏళ్ళతరబడి ప్రదర్శించారు. ఇదంతా యక్షగాన రూపంలోనే జరిగింది. ఇపుడు తూర్పుగోదావరి జిల్లాకు చెందిన శ్రీమతి వైదేహిగారి బృందం మాత్రమే ఈ కళా రూపాన్ని నశించకుండా నిల్పిఉంచారు.

## యక్షగానము

మన ప్రాచీన కళారూపాల్లో అతిప్రాచీన మైనది యక్షగానం. ఆంధ్ర, కర్ణాటక, తమిళ దేశాలలో అతివిస్తారంగా వ్యాప్తిలోకి

...డి. ఈ నాడు మనం చూస్తున్న వీధి గేవతాల మాతృకలు ఈయక్షగానాలే యక్షగానాల తరువాత ప్రచారంలోకి వచ్చింది వీధి భాగవతాలు. యక్షగానం అంటే యక్షులచే పాడబడే సంగీత విశేషం అనీ, యక్షగానాలు జక్కులజాతివారు ప్రదర్శిస్తారు గనుక ఆపేరు వచ్చిందని, యక్షశబ్దం జక్కు శబ్దంగా మారిందని, జక్కుశబ్దమే యక్ష శబ్దరూపమనీ, ఇది యక్షులచే పాడబడే సంగీత విశేషమని ఇంకెన్నో రీతుల వ్యాఖ్యానించారు. ఏది ఏమైనా జక్కుజాతివారే ఈ ప్రదర్శనాలను ఎక్కువగా ప్రదర్శిస్తూ వుండే వాళ్ళు. యక్షగాన ప్రదర్శనంలో వున్న విశేషం ఏమంటే మన వీధి భాగవతాలలో వచ్చు పాత్రధారులు ఎవరిపాత్రను వారు ప్రదర్శిస్తారు. ఈ మాదిరి యక్షగానంలో కాదు. ప్రదర్శనంలో వచ్చు ఒకే ఒక పాత్ర తన్నుగూర్చి తాను చెప్పుకోవడంతో పాటు కథ నడుస్తూ వుంటుంది (ఇదే యక్షగాన రూపం) ఈ మాదిరి వీధి భాగవతాలలోకూడ సూత్రధారునిలోనూ, ప్రధానపాత్రలలోను కనబడుతూ వుంటుంది. ఉదాహరణకు :— "వెడలే యమధర్మరాజు సభకు" అనితన్ను గూర్చి తాను గప్పాలు కొడతాడు. యింకా యక్షగానాలనుగూర్చి ఎన్నో వుదాహరణ లీయవచ్చు.

కూచిపూడి వీధి భాగవతులు భారతం నుండీ, భాగవత కథలనుండీ, రామాయణం నుండీ కథలను తీసుకుని యక్షగాన నాటక రూపంలో భరతనాట్య శాస్త్ర సాంప్రదాయాలను అనుసరించి ప్రదర్శనాలను యిస్తూ వుంటారు. వీరాడిన యక్షగానాల్లో ముఖ్యమైనవి, గిరిజా కళ్యాణము – కీచకవధ – హరిశ్చంద్ర — కిరాతార్జునీయం — కాళీయ మర్దనము — శశిరేఖా పరిణయము — రామ నాటకము — రుక్మాంగద — లవకుశ – ఉషా పరిణయము మొదలైన పురాణసంబంధమైన గాథలను యక్షగాన రూపంలో ప్రదర్శించేవారు రాను రాను వారు యక్షగాన రూపాలను కొంతవరకు మార్చి వీథినాటకాలుగా ప్రదర్శించారు.

## తెరమీద జడ

కూచిపూడి భాగవతులవారి ప్రదర్శనలో ముఖ్యంగా భామాకలాప ప్రదర్శనంలో తెర మీద ఒక జడను వేసి తద్వారా తమయొక్క పాండితీ ప్రకర్షను వెల్లడించేవారు. ఈ జడ వర్ణనము పరిశీలించి తప్పులు పట్టడానికి పండిత ప్రకాండు లందరూ ముందు వరసలో వుండేవారు.

జడ 27 నక్షత్రాలతో ఒక నక్షత్రమాలగా జడపై అలంకరింపబడి తెర వెలుపలి భాగంలో ప్రేక్షకులకు కనపడునట్లు వ్రేలాడదీసేవారు. ఒక్కో బిళ్ళకు ఒక శ్లోకం చదివేవారు. జడ గంటల్ని నవగ్రహాలనేవారు. ఆ జడను మయుడనే శిల్పి సృష్టించాడని ప్రతీతి. తలకు సూర్యుడూ చంద్రుడూ అలంకరింపబడేవి. ఇది జడయొక్క స్వరూపం. ప్రదర్శన ప్రారంభంలో జడ వర్ణనను దర్శిస్తూండగా ప్రేక్షకులుగా కూర్చున్న పండితుల్లో యెవరైనా లేచి జడను గురించి ప్రశ్నిస్తే తగిన సమాధానం చెప్పి, వారిని ఆశ్చర్య చకితుల్ని చేసేవారు. అలా సమాధానం చెప్పలేనట్లయితే పై పండితోత్తములు ఆ జడను కత్తిరించి కళాకారులను అవమాన పరిచేవారు. అలాంటి సందర్భాలను రానీయకుండా వేదాంతం లక్ష్మీ నారాయణలాంటి వుద్దండులు యెంతో ప్రావీణ్యంతో ఒక మహాపర్వతంలా నిలబడి జడ వర్ణనను పూర్తి చేసి ప్రేక్షకులను ఆశ్చర్య చకితుల్ని చేసి పండితుల్ని, పామరుల్ని రంజింపజేసేవారు.

## దాదినమ్మ వేషం

దాదినమ్మ అంటే మంచం — దాదినమ్మ వేషంలో పందిరి పట్టెమంచం మన 'కేంపు కాట'ంత వుంటుంది. పైన చాందినీ, దోమ తెర, లోపల వ్రేలాడే పన్నీరు బుడ్లు ఒక మనిషి పడుకోవడానికి సరిపడేంతటిపొడుగు, వెడల్పుగల మంచాన్ని నడుముకి కట్టుకుని నృత్యం చేసేవారు. ఈ మంచం చాలా తేలిగ్గా వుండడానికి వెదురు కర్రలతో చేసేవారు. మంచాన్ని నడుముకు దిగవేసి కాళ్ళకట్ట దగ్గర లక్కకాళ్ళనుపెట్టి మనిషి జరుగుతున్నట్టుగా నిరూపించి మామూలుగా స్వంతకాళ్ళతో నృత్యం చేసేవారు. ఇలా నృత్యం చేసేటప్పుడు కాళ్ళు కనపడకుండా మంచంచుట్టూ జాలరు దించేవాళ్ళు. మంచంలోపడుండి నృత్యం చేసినట్టుంటుంది ప్రేక్షకులకి మాత్రం. యీ మంచంనృత్యం చేయడం విభ్రాంతి గొలిపేది.

## నృత్యం ప్రారంభం

"దరువు"

దాదినమ్మా – నే దాదినమ్మా
దాదిలోన చిన్నదాని నోయమ్మా.
బాలనమ్మా – నే బాలనమ్మా
బాల నపకీర్తి పాలైతీ నమ్మా.
పుట్టకోట – భూమికోట
కంచుకోట – కల్యకోట
ఇనుపకోట – ఇత్తడికోట
వెండికోటా – వెలశినాది
ఏడు కోటల – నట్టానడుమా
వంటిస్థంభం – మేడమీద
పట్టెమంచం – పరుపుమీద
పవళించి – నేనుండగా
మాయదారి – కర్ణా కరుడు
మచ్చుచల్లీ – నన్నూ తెచ్చి
అత్తాపేరూ – ఆకూ తీగ

# శంఖారావము!!

—యం. యస్. హనుమంతరావు

భారతవీర లెమ్మిక—
అవారణ విక్రమ క్రోధమూర్తివై
వైరుల పారద్రోలుమ
శుభంబగు నీ హిమధామమందునన్
చారుసువర్ణ సీమల
ప్రచారులు సల్పెడి దుష్టబుద్ధులన్
పోరున గెల్చి వారలకు
బుద్ధులు చెప్పుమ సిగ్గుసిగ్గనన్!
వంచన చేసి ఏవేవియొ
పల్కిన జిత్తులమారి నక్కతో
మంచిగ మాటలాడుటయ?
మానవనై జను తిన్నయింటికే
ఎంచుట దానివాసములు
ఏమరిపాటున నుండ కింక ఆ
పంచితు నాటగట్టగ
జవంబున గెల్వుము ముష్కరాధమున్!

మా హిమవంతు పట్టియె
ఉమాసతి ఆటల నాడి నాడు కా
లాహిధరున్ వివాహమున
అర్ధశరీరము నాక్రమించె వా
రా హిమవంతుపజ్జనె
చరాచరజాలము నేలువారు ఓ
మోహితుడా ఎరుంగవు
కుబుద్ధివి—వారల శౌర్య మెట్టిదో?!...
కప్పల నల్లమందు తిని
కల్లలనాడెదు మూర్ఖబుద్ధి—నీ
గొప్పలు మాకు తెల్సె నిక
కోరగబోకు పరాయిసొత్తు—నీ
అప్పకు చేతగాదుర!
భయంబును లేక హిమాద్రి దాటిరాన్
చొప్పగు స్నేహసంపదల
చూడవు మా సరివారితో నికన్!!
ఇదియే మా నిశ్చయమౌ
పదపద వెనుతిర్గి యింక భారతవీరుల్!
అదనున ఎరిగిరి మోసము
కదనముననె తేల్తు మింక—కాగలవానిన్!!

---

మామా పేరు - చందామామ
మగనీ పేరు - మోహనా కరుడు
తండ్రీ పేరు - బోజరాజు
తల్లీ పేరు - మానవతీ,

అంటూ తనయొక్క స్వంతగాథను ఆ మంచంలోవుండే ఆడుతూ పాడుతూ సదస్యులకు యెరుకపరచేది.

భోజరాజు కుమార్తె అయినటువంటి లీలావతిని కర్ణకరుడన్న గజదొంగ మంచంతోసహా మచ్చుచల్లి తీసుకుని మగధ దేశరాజుకు కట్టబెడదామని ప్రయత్నిస్తాడు. ఈ లోగా భోజరాజు యీ వృత్తాంతాన్ని తెలుసుకుని తన సైనంతో వెళ్ళి, కూతుర్ని తీసుకువచ్చి వేరే వివాహం చేస్తాడు.

ఇందులో హావభావాలు — నృత్యం - అభినయం, తాళలయగతుల సంగీతంసాహిత్యం తొణికిసలాడేవి. ఈ ప్రదర్శనం కనీసం మూడుగంటల కాలం నడిచేది. మామూలు భాగవతం కన్నా కొంచెం చిన్నది. ఈ దాదినమ్మా వేషాభినయంలో శ్రీ వెంపటి వెంకట నారాయణగారు, శ్రీ వేదాంతం లక్ష్మీ నారాయణశాస్త్రిగారు సిద్ధహస్తులు.

## వ్యాయామంద్వారా నాట్యశిక్షణ

కూచిపూడి కళాకారుల నాట్యాభ్యాసం వ్యాయామంతో ప్రారంభమవుతుంది. బస్కీలను, దండెములను తీస్తారు. ఇలా చేయడం వల్ల అవయవసౌష్ఠవం చక్కగా అమరుతుంది. ఆ తరువాత అభినయాన్ని నేర్పుతారు. నాట్యంలో పాదగతులు, అళి, ప్రహ్యాళి మొదలైన వన్నీ నేర్పుతారు. హస్త ముద్రల్ని, అంగవిన్యాసాన్నీ మూడు కాలలలోనూ అడుగులు నేర్చుకుంటారు. ఇక నాలుగవ దశలో నవరసాలను అనుభవించడం, ముక్తాయింపులు పాటల్లోని భావాన్ని అనుసరించి భావ విన్యాసాన్నీ అభ్యసిస్తారు. ఈ విధంగా నాలుగు దశలుగా విభజించి నాట్యంలో వుత్తీర్ణులుగా తయారవుతారు. ఇందువల్ల విద్యాభ్యాసమే గాక వ్యాయామ శిక్షణద్వారా అంగసౌష్ఠవం, కుదిరికలూ, ఆరోగ్యం యెంతోబాగుండి ఎక్కువకాలం జీవించడానికీ, ఆయాసంలేకుండా ఎక్కువకాలం నృత్యం చేయడానికీ ఉపయోగపడుతుంది.

★

# సంగ్రహ ప్రకటనలు

## కె. సి. కాలువ

కె. సి. కాలువను సుంకేసులలోని పెద్ద తూము వద్దనుంచి కడప జిల్లాలో దీని చివరి వరకు 15-4-1964 తేదీ నుంచి 15-6-'64 తేదీ వరకు కొన్ని మరమ్మతులు జరిపే నిమిత్తం మూసివేస్తారని ప్రజల సమాచారార్థం ప్రకటించబడుతున్నది.

కాలువ మూసివుండే కాలంలో సేద్యానికి కానీ. ఇతర అవసరాలకు కానీ నీరు సరఫరా చేయరు. ఈ కాలంలో వేసిన పైర్లు ఒకవేళ విఫలమైపోయినట్లయితే అందుకు ప్రభుత్వం బాధ్యత వహించదు.

## ధాన్యం సేకరణ పథకం

40 శాతం లేవీని తప్పించుకునే ఉద్దేశంతో లేవీ అమల్లోవున్న జిల్లాలనుంచి పొరుగుజిల్లాలకు దొంగచాటుగా ధాన్యం రావాణా జరక్కుండా నిరోధించ వలసిన ఆవశ్యకత దృష్ట్యా లేవీ సేకరణ పథకాన్ని ఖమ్మం జిల్లాకు విస్తరింప జేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఈ పథకాన్ని ఖమ్మం జిల్లాలో తక్షణమే అమలు పరచడానికి ప్రభుత్వం ఆదేశించింది.

## జవానులకు భూములు

ప్రభుత్వం జారీచేసిన సవరించిన ఉత్తర్వులననుసరించి సైన్యంనుంచివిడుదలై వచ్చే జవానులకు భూములు మంజూరుచేయడానికి అనుసరించే నిబంధనావళి క్రింద భూములకొరకు పెట్టుకునే దరఖాస్తులను ఇప్పుడు డిప్యూటీ తహశీల్దారు హోదాకు తక్కువకాని అధికారికి పెట్టుకోవచ్చును. దరఖాస్తులలో దిగువ పేర్కొన్న వివరాలను పొందుపరచాలి :-

పేరు, తండ్రిపేరు, శాశ్వత చిరునామా, సైన్యంలో పనిచేసిన కాలం, విడుదలకు పూర్వం పనిచేసిన యూనిటుపేరు. దరఖాస్తు చేస్తున్న భూమి వివరాలు, జిల్లా, తాలూకా, గ్రామం. సర్వేనెంబరు, వర్గీకరణ, ఉదహరించిన సర్వే నెంబరులో దరఖాస్తుచేసిన భూమి విస్తీర్ణం.

సైన్యం నుంచి విడుదలై వచ్చినవారు భూములనిమిత్తం పెట్టుకునే దరఖాస్తులను తమ ప్రాంతానికి చెందిన జిల్లా సైనికులు, నావికులు, వైమానికుల బోర్డు కార్యదర్శికి దాఖలుచేయాలి. ఈ విధంగా వచ్చిన దరఖాస్తులను కార్యదర్శి, ఆయా రెజిమెంటు కోర్-యూనిటు కమాండింగ్ఆఫీసరు జారీ-చేసిన డిశ్చార్జి సర్టిఫికెట్లు మొదలైనవాటిని పరిశీలించిన మీదట జవాను ఏ జిల్లాలో అయితే భూములు కోరుతున్నాడో ఆ జిల్లా కలెక్టరుకు అందజేస్తారు.

## ఫ్యాక్టరీల చట్టానికి మినహాయింపులు

ఫాక్టరీలచట్టం 51.52.53 వ సెక్షను నిబంధనల వర్తింపునుంచి రాష్ట్రంలోని ఫ్యాక్టరీలన్నింటినీ దిగువషరతులకు లోబడి ప్రభుత్వం మినహాయించింది. ఈ మినహాయింపు 1964 ఫిబ్రవరి మొదటి తేదీనుంచి మూడునెలలపాటు అమల్లో వుంటుంది. ఆ షరతులు ఇవి : జాతీయ రక్షణనిధికి వేతనాలను సమర్పించే విషయంలో మాత్రమే ఈ మినహాయింపును వినియోగించుకోవాలి. ఫ్యాక్టరీలోని అధిక సంఖ్యాకులైన పనివారల సమ్మతిని లిఖితపూర్వకంగా పొందిగానీ లేక ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికులకు – అధికసంఖ్యాకులకు – ప్రాతినిధ్యం వహించే నమోదైన కార్మికసంఘం వున్న సందర్భాలలో ఆ సంఘంనుంచి వ్రాతపూర్వకంగా అంగీకారాన్ని పొందిగానీ ఈ మినహాయింపును పొందాలి.

## పుస్తకాల అలవెన్సు

సంవత్సరానికి రూ. 1,500 ల కంటే తక్కువ ఆదాయంగల స్వర్ణకారుల పిల్లల నిమిత్తం ఒక్కొక్క విద్యార్థికి సంవత్సరానికి రూ. 20/-ల చొప్పున పుస్తలకాఅలవెన్సును ప్రభుత్వం మంజూరుచేసింది.

## ఆధునిక భారతీయ భాషల అభివృద్ధి

ఆధునిక భారతీయ భాషల అభివృద్ధికై ప్రతిసంవత్సరం రూ. 5,000 లకు మించకుండా ఇతర భారతీయ భాషలలోనుంచి తెలుగులోకి అనువదించిన ఉత్తమ గ్రంథాలకు బహుమతులు ఇచ్చేనిమిత్తం దిగువపేర్కొన్న సభ్యులతో ఒక సంఘాన్ని ప్రభుత్వం నియమించింది. శ్రీ పి. వి. నరసింహారావు. జైళ్ళు. న్యాయశాఖామంత్రి (అధ్యక్షుడు). శ్రీ కే. రామానుజరావు. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యదర్శి. హైదరాబాదు; శ్రీ ఏ. రమేశ్ చౌదరి, మద్రాసు (సభ్యులు)

## బొగ్గంపల్లి ప్రాజెక్టు

మెదక్ జిల్లా, జహీరాబాద్ తాలూకా హస్నాబాద్ గ్రామంలో బొగ్గంపల్లి ప్రాజెక్టు నిర్మాణానికి ప్రభుత్వం రూ. 8.54,720 లు మంజూరుచేసింది.

## పెద్దవాగు ప్రాజెక్టు

మెదక్ జిలా, జహీరాబాదుతాలూకా, గడ

గారపల్లి గ్రామం సమీపంలో పెద్దవాగు ప్రాజెక్టు నిర్మాణానికి ప్రభుత్వం రు. 4.723 లక్షలు మంజూరుచేసింది.

## దయ్యం వాగుకు ఆనకట్ట

వరంగల్ జిల్లా, ములుగుతాలూకా, రంగాపూర్ గ్రామ సమీపంలో దయ్యంవాగుకు అడ్డంగా ఒక ఆనకట్ట నిర్మించడానికి ప్రభుత్వం రూ. 3,86,300 లు మంజూరు చేసింది. దీనివల్ల అదనంగా సుమారు 1,900 ఎకరాలకు నీటిపారుదల జరుగుతుంది.

## బాలికలను వేధించేవారిపై కఠిన చర్యలు :

విద్యార్థులు, ఉద్యోగులు, విద్యావంతులైన నిరుద్యోగులు మొదలైనవారు బాలికలను వేధించడాన్ని నిర్మూలించే ఉద్దేశంతో యీ దిగువ చర్యలు గైకొనడానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఈ చర్యలమేరకు నేరస్థుడు విద్యార్థి అయినట్లయితే అతనిని కళాశాల, లేక పాఠశాల నుంచి తక్షణమే బహిష్కరించాలి. క్రిమినల్ ప్రాసిక్యూషన్ జరిగి శిక్ష విధించబడిన సందర్భాలలో విద్యార్థిని పూర్తిగా తొలగించివేయాలి. ఈ విషయంలో విద్యాసంస్థల అధిపతులందరికీ తగు సూచనలు పంపవలసిందిగా విద్యాశాఖ డైరెక్టరునూ, సాంకేతిక విద్యాశాఖ డైరెక్టరునూ అభ్యర్థించడం జరిగింది. రాష్ట్రంలోని మూడు విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులను కూడా తమతమ విద్యాసంస్థలకు ఇదే విధంగా సూచనలు అందజేయవలసిందిగా అభ్యర్థించడమైనది.

నేరస్థుడు ప్రభుత్వోద్యోగి అయిన పక్షంలో అతన్ని ఉద్యోగంనుంచి బర్తరఫు చేయాలి. నేరస్థులైన తమ ఉద్యోగుల విషయంలోకూడా ఇలాంటి చర్యనే గైకొనవలసిందిగా ప్రైవేటు సంస్థల యజమానులకు విజ్ఞప్తి చేయడం జరిగింది.

ఇలాంటి నేరాలు చేసినవారి పేర్లను ఆంధ్ర ప్రదేశ్ పబ్లిక్ సర్వీసు కమీషనుకు పంపుతూ వీరి నందరినీ ప్రభుత్వోద్యోగం నుంచి 'డిబార్' చేయవలసిందిగా కోరడం జరుగుతుంది. ప్రైవేటు పరిశ్రమలు, వాణిజ్య రంగానికి సంబంధించినంతవరకు ఇలాంటి చర్యలను అనరించడానికి తగు విధానాలు అవలంబించేందుకు ఆంధ్ర ప్రదేశ్ వాణిజ్య, పరిశ్రమల మండలిని అభ్యర్థించడం జరిగింది.

విద్యార్థులు లేక ప్రభుత్వోద్యోగుల నేరాలకు సంబంధించిన 1963 వ సంవత్సరపు పాత కేసులన్నింటినీ సమీక్షించి అర్హమైన సందర్భాలలో, విద్యార్థులైతే వారిపై క్రమశిక్షణ చర్యనూ, ప్రభుత్వోద్యోగులైతే వారిపై శాఖాపరంగా చర్యను తీసుకోవడానికి నిశ్చయించారు. వీరికి సాధారణంగా విధించబడే శిక్ష విద్యార్థులైతే పాఠశాల లేక కళాశాలనుంచి బహిష్కరించడం, ఉద్యోగులైతే వారి ఉద్యోగాలనుంచి తీసివేయడం. కోర్టులు శిక్ష విధించిన సందర్భాలలో పెద్ద ఎత్తున విచారణ జరిపించవలసిన అవసరం లేదనీ, 'షోకాజ్ నోటీసు' ఇస్తే చాలుననీ ఈ సందర్భంలో స్పష్టం చేయడం జరిగింది.

శిక్షవిధించబడిన ప్రైవేటు ఉద్యోగులపై తగుచర్యలు తీసుకోవలసిందిగా ఆంధ్ర ప్రదేశ్ వాణిజ్య, పరిశ్రమల మండలిని అభ్యర్థించడం జరిగింది.

ఇప్పుడు ప్రకటించబడిన ఈ చర్యలు ఈ దుష్కృత్యాన్ని అంతమొందించగలవని ప్రభుత్వం ఆశిస్తున్నది. అయినప్పటికీ అవసరమైతే ఇంతకంటే కఠినమైన చర్యలు గైకొనడానికి ప్రభుత్వం సిద్ధంగా వుంది.

## ఇంటి కిరాయిదార్లుగా ప్రభుత్వోద్యోగుల హక్కులు :

ప్రైవేటు ఇండ్లలో అద్దెకువుంటున్న ప్రభుత్వోద్యోగులను గృహ యజమానులు వారు కోరిన అధికమైన అద్దెలను చెల్లించడానికి ప్రభుత్వోద్యోగులు నిరాకరించిన పక్షంలోకానీ, లేక తమ స్వంత వినియోగానికి అవసరమని కానీ ఇండ్లుఖాళీ చేయమంటూ ఇబ్బందులు పెడుతున్నట్లు ప్రభుత్వం దృష్టికి వచ్చింది. 26–8–1957వ తేదీకి పూర్వం నిర్మించబడిన ప్రైవేటు ఇండ్లలో అద్దెకు నివసించే ప్రభుత్వోద్యోగులకు 1960 వ సం. పు ఆంధ్రప్రదేశ్ భవనాల (కౌలు, అద్దె, ఖాళీ) కంట్రోలుచట్టం 10వ సెక్షను క్రింద సహేతుకమైన కారణం లేకుండా ఇల్లు ఖాళీచేయమని నిర్బంధించడం నుంచి రక్షణ వుందని ఇందు మూలంగా వివరించడం జరుగుతున్నది. ఈచట్టం 10వ సెక్షనులోని (4)వ సబ్ సెక్షను నిబంధనల నిమిత్తమై వీరి ఉద్యోగాలను ప్రభుత్వం అత్యవసర సర్వీసులుగా ప్రకటించింది. అందువల్ల ప్రైవేటు ఇండ్లలో అద్దెకు వుంటున్న ప్రభుత్వోద్యోగులు, గృహయజమానుల స్వంత వినియోగానికి అవసరమనే కారణాన్ని పురస్కరించుకొని ఖాళీచేయనవసరం లేదు. అయితే ఆ గృహయజమానులు కూడా, పైన ఉదహరించిన సబ్ సెక్షను నిమిత్తమై ప్రభుత్వం అత్యవసర సర్వీసుగా ప్రకటించినటువంటి ఉద్యోగం చేస్తున్నట్లయితే మాత్రం ఇది వర్తించదు. ఒకవేళ గృహయజమానులు, తమఇండ్లలో అద్దెకు వుంటున్న ప్రభుత్వోద్యోగులు చెల్లిస్తున్న అద్దె, తక్కువగా వుందని భావిస్తున్నట్లయితే సరసమైన అద్దెను నిర్ణయించే నిమిత్తం వారు తమ ప్రాంతానికి సంబంధించిన రెంట్ కంట్రోలర్‌ను సంప్ర

దించ వచ్చు. సరసమైన అద్దె నిర్ణయించ బడని పూర్వం, గృహయజమానులు కోరిన అధికమైన అద్దెలను చెల్లించనట్లయితే, అటువంటి ప్రభుత్వోద్యోగులను తమఇండ్ల నుంచి ఖాళీ చేయించే అధికారం గృహ యజమానులకు వుండదు.

1960వ సం. పు ఆంధ్రప్రదేశ్ భవనాల (కౌలు, అద్దె, ఖాళీ) కంట్రోలుచట్టం 3వ సెక్షను నిబంధనలు వర్తించే భవనాలు ఖాళీ అయినప్పుడు అనేక సందర్భాలలో అవి ఖాళీఅయిన విషయమై గృహవసతి విషయాల కంట్రోలర్‌కు లిఖితపూర్వకంగా నోటీసులు ఇవ్వకుండా మానివేస్తున్నట్లు కూడా ప్రభుత్వందృష్టికి వచ్చింది. ఇటువంటి నోటీసుల పొందే అధికారం ప్రభుత్వం గృహవసతి విషయాల కంట్రో లరుకు ఇచ్చింది.

పై నిబంధన హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలలో అమల్లో వుంది. నెలఅద్దె రూ 25లకు మించిన రెసిడెన్షియల్ భవనా లకూ, నెలఅద్దెరూ. 50–లకు మించిన నాన్ రెసిడెన్షియల్ భవలనాకూ ఈ నిబంధన వర్తి స్తుంది.26–8–1957 తేదీ తరువాతనిర్మించిన భవనాలనూ, కంపెనీలు, సంస్థలు, ఫర్ములకు చెందిన కొన్ని భవనాలనూ – పూర్తిగా వాటి అధికార్లు, సేవకులు, ఏజెంట్ల నివాసం నిమిత్తం ఉద్దేశించ బడిన వాటిని – పై నిబంధన వర్తింపునుంచి మినహాయించారు. ఈ విధంగా మినహాయించబడిన భవనాలు తప్ప మిగిలిన భవనాలన్నింటి యజమా నులూ పై చట్టనిబంధన మేరకు తమభవనం ఖాళీఅయిన పదిరోజులలోగా ఆ విషయాన్ని గృహవసతి విషయాల కంట్రోలరుకు లిఖిత పూర్వకంగా నోటీసు ఇవ్వవలసివుంటుంది. ఈ నోటీసులో 1961వ సం. పు ఆంధ్ర ప్రదేశ్ భవనాల (కౌలు, అద్దె, ఖాళీ) కంట్రోలు నియమావళి 3వ నిబంధనలో నిర్దేశించిన వివరాలను – (అవి వర్తించినంత వరకు –) పొందు పరచాలి. ఈ నోటీసును గృహవసతి విషయాల కంట్రోలరుకు – ఆఫీసు పనిచేసే రోజులలో పని వేళలలో ఎప్పుడైనా – స్వయంగా దాఖలు చేయాలి. లేదా రిజిస్టరు టపాద్వారా తిరుగు రశీదు పొందే ఏర్పాటుతో పంపాలి. ఈ విధంగా తమ ఇండ్ల ఖాళీల విషయమై నోటీసు పంపని గృహ యజమానులు, ఈ చట్టం 29వ సెక్షను క్రింద నేరానికిగాను శిక్షార్హు లవుతారు. నేరస్థులకు రూ. 2,000ల వరకు కూడా జరిమానా విధించబడవచ్చు.

## ప్రత్యేక శిక్షణా పథకం

సైనికదళాలలో, కమిషన్డ్ హోదాలు పొందదలచిన ఉత్సాహవంతులైన ఆంధ్ర ప్రదేశ్ యువకులకు అందునిమిత్తం అవ కాశాలు పెంపొందించేందుకై ఆంధ్రప్రదేశ్ ఎన్. సి. సి. డైరెక్టొరేటు అధీనంలోని అర్హులైన అభ్యర్థులందరికీ ప్రత్యేక శిక్షణ గరపడానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఒక పథకం రూపొందించింది. ఈ శిక్షణను ముఖ్యంగా విశ్వవిద్యాలయ కేంద్రాలవద్ద ఇస్తున్నారు. అయితే తగుసంఖ్యలో అభ్య ర్థులు వున్నట్లయితే రాష్ట్రంలోని వివిధ ఎన్. సి. సి. హెడ్‌క్వార్టర్స్‌వద్ద కూడా శిక్షణ ఇస్తారు.

ఎన్. సి. సి. కేడెట్లకే కాక, సాధారణ రిక్రూట్మెంట్ నియమావళిననుసరించి సైన్యంలో ప్రవేశం పొందడానికి అర్హులైన ఇతరులకుకూడా ఈ శిక్షణ ఇస్తారు. అభ్య ర్థుల వయస్సు 19–27 సంవత్సరాలలోపు వుండాలి. డిగ్రీకోర్సు మొదటిసంవత్సరం పరీక్షలో ఉత్తీర్ణులైవుండాలి.లేక సైన్యంలో ప్రవేశం నిమిత్తం నిర్దేశించిన ఇతర సమాన మైన అర్హత కలిగివుండాలి. ఈ ప్రత్యేక శిక్షణ పొందదలచినవారు తమ ప్రాంతంలోని ఎన్. సి. సి. హెడ్‌క్వార్టర్స్ వారినికానీ లేదా సికింద్రాబాదు – 3 పికెట్ రోడ్డులోని ఎన్. సి. సి. (ఆం. ప్ర.) డైరెక్టొరేటు వారిని కానీ సంప్రదించవచ్చు. దరఖాస్తు దార్లందరూ సికింద్రాబాదులోని సబ్‌ఏరియా హెడ్‌క్వార్టర్స్‌లో ప్రిలిమినరీ ఆర్మీ కమిషన్ సెలక్షన్ బోర్డుముందు హాజరుకావల్సి వుంటుంది. అర్హులైన అభ్యర్థులకు, రాష్ట్రం లోని ప్రీసెలక్షన్ శిక్షణా శిబిరాలలో కనీసం 14 రోజులపాటు ప్రత్యేక శిక్షణ గరుపుతారు. సైన్యంలో చేరదలచిన ప్రతి ఒక్కరూ ఈ పథకం నుంచి ప్రయోజనం పొందడానికి ప్రయత్నించవచ్చు. ★

# పదినే ముత్యాలు

**అంతే**

నికటమునసుండి శ్రుతిపుట నిష్ఠురముగ
నదరి కాకులు బెట్టు పెద్దఅచు నపుడు,
ఉడిగి రాయంచయూరకయుంటలెస్స;
సై పరాకున్న నెందేని జనుట యొప్పు.

— శ్రీనాథుడు

**కడకదే!**

తలము చ్చుట్టులు దిరిగిన
దలపోయగ
నోటిలోని దయ కడియన్న
ట్లిలనే తిరుగులు
తిరిగిన, గలుగదు గతి
విష్ణుసేవ గాలించకయున్.

— తెనాలి రామలింగడు

**చందమామ**

సురచిర పాన పాత్రమున
సుందరి యొక్కతె
కేల నిండు చందురుడు
ప్రకంపితాంగకముతో
దిలకించె,
దదాన నాంబుజ
స్ఫురిత వికాస
వైభవము సొంపు
లడంకువ మృచ్చిలింప,
జెచ్చెర జనుదెంచె
పట్టువడి, చేడ్పడి
భీతి వడంకు చాడ్పునన్.

— ఎఱ్ఱాప్రగడ

**చిగుళ్ళు**

తలిరుం గైదువురాయ,
దర్పగులపై దండెత్త
లేగాలి బెస్తలచే
బంపిన పండుటాకు తగ టి
జాబుల్ కనుంగొంచు
వింతలుగా వారికి
జైత్రుడిచ్చు బురుసా దట్టీలు,
ముత్యాల తావలముల్ వోలె
దగుం జిగుళ్ళు,
గలికావారమ్ము
తీరమ్మునన్.

— చంద్రభాను చరిత్ర

**సాలవృక్షం**

పురకాంతల
కౌనులకున్
సరిపడదని బ్రహ్మ
యాకసము నారసి వేరపరి,
దాని గుండలించిన
సరణిన్ దివిముట్టి
యచటి
సాలం బలరున్.

— చంద్రాంగద చరిత్ర

**పెంపు**

విందులు విందు లంచు దను
వేడుక నెత్తుకొనంగ బిల్వ,
నింపొందగ నేగిపై బడుచు,
నుబ్బున గేరుచు
చెంగలించుచున్,
సందిలి పట్టియాడు
మన నాట్యము లాడుచు
ముద్దులన్ మహానంద మొనర్చె
బాలిక దినంబును
జుట్టపు బూవుబోండ్లకున్.

— వింగళి సూరన

**తప్పుగదా!**

ఇటు తగునయ్యా!
విప్రుడ, వహీన గుణాఢ్యుడవీవు,
నీకు నేమిటి కిటువంటి దౌష్ట్యము
శమించునె మద్దనకుండు విన్న?
దక్కటి జనులేమి యంద్రు?
మది గాంతుడయె గల్గిన,
నగ్నిసాక్షిగ
జిటికిన పట్టికాక,
వృథ సేయుట ధర్మమె —
కన్యకాత్వమున్

— అనంతుడు

**అప్పుడు**

ధరణీచక్రము
దిర్దిరం దిరిగె,
మార్తాండుండు
కుంభీభవ త్కిరణుం డయ్యె;
దిశావితానము వడంకెన్,
మిన్నదర్చెన్,
మహీధర సంతానము
గ్రక్కునం గదలె,
నుద్భ్రాంతంబులై
యంబుధుల్ పొరలెన్
గట్టులమీద,
బిట్టు పిడుగుల్
మ్రోసెన్ మహోదగ్రతన్.

— తిక్కన

**వేగి**

కోమల తామ్రచూళికలు
క్రొవ్వెర సంజకు
బ్రోది పెట్ట,
నిస్సీమ కఠోర తార రుతి

జట్టుపలార్చుచు
నట్టు లెత్తి
విశ్రామముపోలె గూనె;
విలస చ్చరమాచల కూట
పక్కణ
గ్రామటికా కుటీర
శిఖరంబుల
గుక్కుట చక్రవాళముల్.

— *శ్రీనాథుడు*

### పగలు

చక్రములు పొంగె;
దస్యుసంచయ మడంగె;
దమము చంగె;
ద్విజప్రతాపము జెలంగె;
సరసులం దెల్ల
గమలాతిశయ మెసంగె;
జగము లిందగు
నినుడు తేజమున
బ్రబల!

— *కూచిమంచి తిమ్మకవి*

### విభిన్నత

తనువున
విఱిగిన యమ్ముల
ననువున
బుచ్చంగ వచ్చు;
నతి నిష్ఠురతన్
మనమున నాటిన
మాటలు,
విను మెన్ని యుపాయములను
వెడలునె యధిపా

— *తిక్కన*

### బిత్తరి

కుసుమపు గుత్తి జూచి
యొక కోమలి దగ్గఱి
కోయబోయినన్,
బసిపడి నందునున్న
మధుపంబులు వచ్చి
ముఖంబు తాలికిన్
ముసరగ జోపిచోపి,
పెను బ్రమోతలతో
నలి దట్టమైన వెక్కసపడి
పాఱుతెంచె జెలికత్తియ లిద్దరు
సూచి నవ్వగన్.

— *అనంతుడు*

### ఎక్కడి కెక్కడ

సరసిజగంధి పెందొడల
సాటికి రా నెదిరించి పోరు
నీగరభము లెల్ల
జేపడగ గన్గొని యుండియు
తజ్జయార్థమై
పొరలజెనంగి, యూచవడి
పోవుట, అంతియగాక
ధాత్రిపై నరటులు
పిల్ల పిల్ల తరమైనను
సామ్యము బొందనేర్చునే!

— *భానుమతీ పరిణయం*

### శివునిగని

పగలింటి కట్టెండ
నొగిలిన కుముదిని,
సితరోచి గని
వికసిల్లునట్లు;
వేసవి వడగాలి
నోసిన లేదీగ,
క్రొక్కారు గని
మవ్వ మెక్కు నట్లు;
ఫణి విషవహ్ని
జేడ్పడియున్న
శశిరేఖ
నెఱవిడుపున
గాంతి వరలునట్లు;
శాపాగ్ని బడి
దివ్యసతి వంది,
శాపమోక్షము గని
నిజకాంతి నమరునట్లు -
విరహతాప తపస్తాప
విశిఖ చయము
దాకి కందిన మేదీగ,
తత్ క్షణంబ
గౌరి కాశ్మీరు డగు నీశు
గనుడు, బ్రీతి నెలమి
దొల్లింటి కంటెను
జెలువ మెసగె.

— *నన్నెచోడుడు*

### పోరు

చెప్పులోని ఱాయి,
చెవిలోని జోరీగ,
కంటిలోని నలుసు,
కాలి ముల్లు,
ఇంటిలోని పోరు
నింతింత గాదయా
విశ్వదాభిరామ
వినుర వేమ.

— *వేమన*

### భీష్మస్తుతి

కుప్పించి యెగసిన
కుండలంబుల కాంతి
గగన భాగం బెల్ల
గప్పికొనగ,
ఉరికిన నోర్వక
ఉదరంబు లోనున్న
జగముల వ్రేకువ
జగతి గదల,
చక్రంబు చేపట్టి
చనుదెంచు రయమున
పైనున్న పచ్చని
పటము జార,
నమ్మితి నాలావు
నగుబాటు సేయక

మన్నింపు మని క్రీడి
మరల దిగువ —
గరికి లంఘించు
సింహంబు కరణి మెరసి,
నేడు భీష్ముని జంపుదు
నిన్ను గాతు
విడువు మర్జున !
యంచు మద్విశిఖ వృష్టి
దెరలి చనుదెంచు
దేవుండు దిక్కు నాకు.

— పోతన

కాఠిన్యం

పరగ ఱాతి గుండు
పగులగొట్టగ వచ్చు
కొండ లన్ని
పిండి గొట్టవచ్చు
కఠిన చిత్తు మనసు
కరిగింప రాదయా
విశ్వదాభిరామ
వినుర వేమ.

— వేమన

వానకాఱులు

ధర, నిదాఘు వాతాహతి
నెఱియకుండ,
విధి, దమాలమంటపము
గాలించె ననగ నొప్పె,
నీలాభ్రపటల, మచ్చప్పరమున,
రాఱులన నెల్లదెస
వాన కాఱు లమరె.

— నన్నెచోడుడు

మోహలత

క్రకచ ధారా కఠోరంబైన
కక్కుల క్రొవ్వాడి
కొడవంట గోయరాదు;
క్రూరా యసోద్దామ
కుద్దాలముల ద్రవ్వి
వేళ్ళతో శకలించి వేయరాదు;
సమి ధాజ్యముల
నగ్ని సమకొల్పి
దారుణ శిఖల గాలిచి,
నీఱు సేయరాదు;
ఘన ముష్టి గబళించి,
కపట బుద్ధిబట్టి తెగజేతితోడ
రా దీయరాదు;
హృదయమను పాదులోపల
నుదయ మంది,
తల్లి దండ్రులమీద సోదరులమీద
దనయ బంధు
కళత్ర మిత్రకులమీద
మూరి బోవంగ బ్రాకిన
మోహలతను.

— విల్లలమఱ్ఱి వినవీరభద్రుడు

---

# కమ్యూనిటీ రేడియో సెట్లు

1963 డిశంబరు నెలలో ఆంధ్రప్రదేశ్ లోని యీ క్రింద పేర్కొన్న గ్రామాలలో, సంస్థలలో కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పారు.

హైదరాబాదు జిల్లా : అప్పారెడ్డిగూడ, కతిరెడ్డిపల్లి, కొత్తపేట.

మెదక్ జిల్లా: ఫసల్వాడి, జగదేవ్ పూర్, కల్వకుంట.

ఆదిలాబాదు జిల్లా: ఊడిగాన్, ఎలిగాన్, ఇల్వి, రేబెన్న.

కరీంనగర్ జిల్లా : లస్మన్నపల్లె — వెన్నంపల్లి.

వరంగల్లు జిల్లా : రఘునాథ పల్లె, జైగిరి, వర్ధకొండ — 2, తిమ్మంపేట, రొయ్యూరు, కోగిలవాయి.

విశాఖ జిల్లా : కలపాక, ఏనుగుతువి, దమరసింగి, గుర్ల, తిమ్మన్నపాలెం, బెన్నవేలు, సేనసపల్లి, జన్నివలస, పూడి, గురెజపాలెం, వేల్చూరు, కెంగువ, అగురు, జిన్నం, సోమవరం, తెరువుపల్లి.

తూర్పుగోదావరి జిల్లా : ఎ. భీమవరం.

కృష్ణా జిల్లా : బుద్దవరం.

గుంటూరు జిల్లా: మర్లపాడు, మద్దలూరు, మైరంపాడు, కీర్తిపాడు, కొప్పలి.

ఖమ్మం జిల్లా : ఇల్లూరు.

శ్రీకాకుళం జిల్లా : నడిమికెల్ల, చిడిమి, నర్సీపురం, హుస్సేన్ పురం, బుద్ధరాయవలస, మెరకముడిదం, కొండలవేరు, కొదిన, తాళ్ళవలస, కొండదడి, అనంతగిరి, గరుడఖండి, లక్ష్మీపేట, రెంటికోట, బటుపురం, అంతరకుడ్డ, చొప్పబుచ్చంపేట, రవిచెంద్రి, జలంత్రకోట, బెంకెలి, లావేరు, కేశవరాయుని పాలెం, కొత్తపల్లి, కొవ్వాడ మచిలేశం, దెర్సం, జంపారుకోట, సిరిపురం, బుడారిసింగికోట, వల్లభరావుపేట, కొస్ట, తాళ్ళవలస, వేలుపురాయి, అర్థం, కోటిపం జిల్లాపరిషదున్నత పాఠశాల, పుత్తూరు, దాలిపేట, చిత్తాపురం, దుగ్గి, నడకూరు.

# భారత ప్రగతి

## మహారాష్ట్ర

రత్నగిరి సమీపంలో మిర్యా అఖాతంవద్ద అన్నిరుతువులలోనూ ఉపయోగపడే ఒక నౌకాస్థావరానికి 1964 జనవరి 22 వ తేదీన శంకుస్థాపన జరిగింది. దీనికి రెండుకోట్ల రూపాయలకుపైగా ఖర్చవుతుంది. మహారాష్ట్రలోని చిన్న నౌకాస్థావరాల చరిత్రలో ఈ పథకం ఒక నూత్న ఘట్టం.

వ్యయప్రయాసలు తగ్గుతాయి కాబట్టి ఏటా 2,50,000 టన్నుల మేరకు సరుకులను, 2 లక్షలకుపైగా ప్రయాణీకులను కొల్హాపూర్ నుంచి రత్నగిరివైపుకు మళ్ళించడం జరుగుతుంది. ఈ అంశం గమనార్హమైనది.

### సహకార ముద్రణశాలలు

రాష్ట్ర, జిల్లా స్థాయిలలో సహకార ముద్రణశాలలను నెలకొల్పడానికి ఉద్దేశించిన ఒక పథకాన్ని ప్రభుత్వం మంజూరుచేసింది. ప్రారంభంలో రాష్ట్రస్థాయిలో ఒక సహకార ముద్రణశాలనూ, జిల్లా స్థాయిలో నాలుగు ముద్రణశాలలనూ నెలకొల్పడానికి ప్రతిపాదించారు. కేంద్రప్రభుత్వం, తన వాటాధనం విరాళంమేరకు మహారాష్ట్ర ప్రభుత్వానికి ఋణాలు ఇస్తుంది.

### వినియోగదార్ల సహకార సంఘాలు

అత్యవసర పరిస్థితి ప్రకటించబడిన కారణంగా వినియోగదార్ల విక్రయశాలలను నెలకొల్పే పథకాన్ని 1962 వ సంవత్సరంలో ప్రవేశపెట్టారు. ఈ పథకాన్ని కేంద్రం తలపెట్టింది. సేవా సహకార సంఘాలు స్థాపించిన 3,159 వినియోగదార్ల సంఘాలు కాక, గ్రామీణ ప్రాంతాలలో 40,000 సభ్యత్వంతో కూడిన 22 హోల్‌సేల్ స్టోర్లను, 370 ప్రాథమిక బ్రాంచ్ స్టోర్లను నెలకొల్పారు. పారిశ్రామిక కార్మికుల నిమిత్తం రాష్ట్రంలో 91 విక్రయశాలలనుకూడా స్థాపించారు.

### మన్నార్ ప్రాజెక్టు

నాందేడుకు 32 మైళ్ళ దూరంలోవున్న బరుల్ వద్దగల మన్నార్ ప్రాజెక్టు ప్రథమ ఘట్టాన్ని ముఖ్యమంత్రి శ్రీ వి. పి. నాయక్ ప్రారంభించారు.

ఈ ప్రాజెక్టుకై 5,854 అడుగుల పొడవు, 80 అడుగుల ఎత్తు గల ఒక మట్టి ఆనకట్టను మన్నార్ నదికి అడ్డంగా సుమారు రూ. 179 లక్షల వ్యయంతో నిర్మిస్తారు. ఇది 25,000 ఎకరాలకు నీటిపారుదల చేయగలుగుతుంది. రెండవ ఘట్టంలో ఆనకట్ట ఎత్తును మరో 8 అడుగులకు పెంచుతారు. నిర్మాణం పూర్తయ్యాక అదనంగా 41,000 ఎకరాలకు నీటిపారుదల జరుగుతుంది. ఈ రెండుఘట్టాలకు కలిసి రూ. 4 కోట్లు ఖర్చవుతుంది.

### ట్వైన్, వలల కర్మాగారం

సహకార రంగంలో ట్వైన్, వలల తయారీకి ఒక కర్మాగారాన్ని దేశమంతటిలోకీ మొట్టమొదటగా ప్రారంభించినందుకు కేంద్ర ఆహార, వ్యవసాయశాఖల సహాయ మంత్రి శ్రీ ఏ. ఎం. థామస్ మహారాష్ట్ర ప్రభుత్వాన్ని అభినందించారు.

## ఉత్తర ప్రదేశ్

### అధికాహారోత్పత్తి

రాష్ట్రంలో వ్యవసాయోత్పత్తిని పెంపొందించే నిమిత్తం ఏ సహకార సంఘంలో కూడా సభ్యులు కానటువంటి రైతులకు రసాయనిక ఎరువులు, వ్యవసాయపనిముట్లు, మొక్కల సంరక్షక యంత్రాలు కొనుక్కునేందుకై తక్కావీలు పంపిణీ చేయడానికి ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం భారీ ఎత్తున ఏర్పాట్లు చేసింది. సహకార సంఘాల సభ్యులైన రైతులకు ఆ యా సహకారసంఘాలు ఇటువంటి సౌకర్యాలు కలుగజేస్తున్నాయి.

1960–61 వ సంవత్సరం రాబీ ఋతువులో ఆహారధాన్యాల ఉత్పత్తిలో 23 శాతం ఉత్పత్తిని సాధించి గరిష్ఠస్థాయినందుకున్నందుకు జనవరి ,16 తేదీన కేంద్ర ఆహార మంత్రి శ్రీ స్వర్ణసింగ్ ఉత్తర ప్రదేశ్ కు "రాష్ట్ర కలశాన్ని" బహూకరించారు.

### పరిశ్రమలకు సహాయం

లఘు పరిశ్రమల అభివృద్ధికి యు. పి. ఋణాలు, గ్రాంటులసంఘం ఇటీవల రూ. 6.42 లక్షల ఋణం మంజూరుచేసింది. వర్తమాన ఆర్థిక సంవత్సరంలో లఘుపరిశ్రమల రంగంలోని సుమారు 2,000 మంది పారిశ్రామికవేత్తలు రూ. 76 లక్షలమేరకు

(మిగతా 73 వ పేజీలో)



# పొగుమేటు

మైనేని వెంకటరత్నం

ఒక్క కునుకు తీద్దామని....పక్కమీద అటూ యిటూ దొర్లటం తప్ప...ఎంత తన్నుకున్నా నిద్ర పట్టటంలేదు రామిరెడ్డికి. చుక్క పొడవకముందే అరక గట్టుకొని తెగులు పడిన మిరపచేను పగలదున్ని, అలసి సొలసి వచ్చాడు యింటికి.

ఊహ తెలిసిన దగ్గర్నుంచీ, ఈ యిరవై యేళ్ళ వయసుదాకా పొలం....గొడ్లూ...చాకిరీ – ఇవే రామిరెడ్డికి తెలిసింది. ఆ వయస్సులో ... అతనిలాగా కొండ్రవేసేవాళ్ళు ఎవళ్ళూలేరని చుట్టుప్రక్కల పేరు అతనికి. ఆ ప్రాంతం రైతు తీరిగ్గా సదుం వాల్చేది పండుగా పబ్బాల్లోనే. ముందు జొన్న...అది పాడయితే వరిగ...లేకపోతే మిర్చి...ఆ తర్వాత శనగ....కొత్తిమిర –

ఆరుగాలంఏదోఒక పైరు వెయ్యాలి దున్నిన సాళ్ళేనాలుగైదుసాళ్ళుదున్ని గొఱ్ఱుపన్ని విత్తి...గుంటక యీడ్చి చదునుచేసి...లేత పైరు మధ్య మళ్ళా దంతెతో దున్ని ఎంతో శ్రమపడాలి. అదునుకు వర్షాలు కురిస్తే... గాలిపాటు సరిగ్గావుంటే...భూమాత పసిడి పంట విస్తుంది. నాలుగు వేళ్ళూ లోపలికి పోతాయి. ప్రకృతి ఉత్పాతాలకు గురయి... తన కష్టఫలితం దక్కకపోయినా....ఆ యీతిబాధలకు అలవాటుపడిన ఆ ప్రాంతపు రైతులు ఒక్క నిట్టూర్పన్నా విడువరు. మళ్ళా పగలదున్నటం...మరోపైరు వేయటం...శ్రమ...! ఉత్తశ్రమ...!— అదే తెలిసింది వాళ్ళకి ; 'పైరువేయటం... పైకిచూడటం' పరిపాటయి, అది వాళ్ళ జీవితానుభవాల్లో జీర్ణించుకుపోయింది.

వరిగబువ్వలో ఇంత గోంగూర పచ్చడి వేసుకొని...గడ్డపెరుగుతో జుఱ్ఱి...ఊరు మాటుమణక్కముందే... నులకమంచంమీద గడ్డి దిండేసుకొని...నడ్డివాల్చి గుఱ్ఱుకొడుతుంటే రోజూ ఎటుపోయేదో ప్రాణం..! కాని యివ్వాళ ఎంత తన్నుకొన్నా...మగతనిద్ర తప్ప సరిగ్గా నిద్రపట్టటంలేదు రామిరెడ్డికి.

ఆ కోడినిద్రలో ఎన్నో ఆవేశభావాలు.. తియ్యతియ్యటి కలలు...రామిరెడ్డిని ఉక్కిరిబిక్కిరిచేసి మస్తిష్కాన్ని మసలబెట్టినయ్. ఈ ఏడుకూడా పాలువేటలో గెలిచినట్టూ... గొఱ్ఱెను భుజాన వేసుకొస్తూంటే...బావా... బావా...! అంటూ సీతాయి తనవంక పులుకు పులుకునా చూసినట్టూ—ఎన్నో మధురానుభూతులు ఓ విధమైన మత్తులో...పరవశత్వంలో ముంచినయ్ రామిరెడ్డని. మెలిదేరిన కండలు....నూనూగు మీసం....విజయగర్వంతో మిట్టిపడుతున్న తనను చూసి సావాసగాళ్ళంతా యీర్ష్యపడాలి...! చీకిరిబాకిరిగా....అస్పష్టంగా....క్షణ క్షణం మారుతూ ఒకటే కలవరింతలు తెల్లవార్లూ రామిరెడ్డికి

ఏదో చప్పుడు విన్పించి...మంచుతెర విడిపోయినట్టు ఊహలూ...కలవరింతలూ ఒక్కసారి చెదిరిపోయినయ్; తల్లి పొయ్యి రాజెయ్యటానికి పుల్లలు విరుస్తోంది. వేపచెట్టు మీద కాకులు తపతప రెక్కలు కొట్టుకొని గునిసినయ్. దూరాన ఏదో పొలికేక సన్నగా విన్పించింది. గుఱకొయ్యలు నెత్తిమీదికి వచ్చినయ్. బద్ధకంగా మూలుగుతూ నిండా ముసుగు లాక్కున్నాడు మళ్ళా రామిరెడ్డి. పొయ్యి భగభగ మండుతోంది. మూడంకె వేసి మునగదీసుకొన్నా కళ్ళు మూతబడలేదు. బుర్ర ఆలోచనలతో వేడెక్కిపోయింది. ఎంత గుర్తుకు తెచ్చుకొందామన్నా కన్న కలలన్నీ ఏదో అనుభూతిగా తప్ప వరసగా గుర్తురావడంలేదు.

సజ్జరొట్టెలు కాలుస్తున్న వాసన నాసాపుటాల్లో ఘుమఘుమల్ని రేపుతోంది. కళాపెళా ఉడికే వరిగబువ్వ ఆ నిశ్శబ్ద వాతావరణంలో...అదో సంగీతాన్ని వింపుతోంది. ప్రకృతి మేల్కొన్నట్టు కాసేపటికి కోళ్ళు పొలికేకలు మొదలెట్టినయ్. ఒళ్ళు విరుచుకొంటూ లేచాడు రామిరెడ్డి.

* * *

తూర్పునఆకాశం ఎఱ్ఱబడింది. నల్లమల కొండలమీదుగా... చెట్లమధ్యగా... పచ్చటి పైరులపైన కాంతిరేఖలు అలుంకొన్నయ్. చీకటి చీల్చుకొని వ్యాపిస్తున్న ఆ సంజ కాంతులు భూమాతకు పసిడిరంగు పులుంతున్నవి. ఎటుచూచినా అన్నీ గుట్టలు... మిట్టలు...ఎగుడు దిగుళ్ళు! చదునుబడని ఆ భూమి అక్కడి ప్రజల స్థితిగతుల్ని ప్రతిబింబిస్తున్నది. ఏటవాలుగా పడిన సూరీడి కిరణాలు సన్నటి కొండకాలువల్లో.. చల్లగా పోగుల్లా దోగుతున్న నీటిజాలుల్లో పాపలు చూసుకొంటూ మురిసిపోతున్నవి ముద్దల్లా గాలికి ఊగే జొన్నకంకులు నిటారుగా తొణక్కుండా ఆకాశం వైపు మిఱ్ఱిమిఱ్ఱి చూస్తున్న తవిదచేనూ...పేర్లు తెలియని చెట్లపొదలూ...గుట్టల మీద ప్రకృతి ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో ఒరిపిడి పెట్టినట్టున్న నున్నటి...గుండ్రటి బండరాళ్ల ఆ ప్రాంతీయుల తీరు తెన్నుల్ని ప్రకటిస్తున్నవి.

బారెడు ప్రొద్దెక్కేప్పటికి రచ్చబావిడి దగ్గఱకు గుంపులు గుంపులుగా చేరేరు జనం. రేలాకులచుట్ట గుప్పుగుప్పుమనిపిస్తూ... తీవిగా తలపాగా జుట్టి... ఊరిపెద్ద అంజిరెడ్డికూడా వచ్చాడు. సజ్జరొట్టెలు నములుతూ పిల్లలు అటూ యిటూ పరుగెడుతున్నారు. కేకలేస్తూ సంబరాన్ని సాగదీశారు పంచె లెగగట్టి...పన్నుకఱ్ఱలు బట్టి...పెత్తనగాళ్ళు.

డప్పుల మ్రోతతో చెవులు దిబ్బెళ్ళుపడుతున్నవి. కొమ్ము బూరాలు... శంఖాలు... రాంఢోళ్ళు ఒకటే మ్రోత పెడుతున్నవి. గణాచారి శివమెత్తి చిందులు తొక్కుతున్నాడు. తుపాకులు...కత్తులు... బల్లాలు...గొడ్డళ్ళు...అన్నిటికీ పసుపు పూసి...కుంకుమబొట్లు పెట్టి ఊరేగిస్తూ పోతున్నారు జనం. మెళ్ళో వేపమండలు కట్టి... పసుపు కుంకుమలు మొఖాన బెత్తెడెత్తున మెత్తి ఓగొఱ్ఱెను నెట్టుకుపోతున్నారు. మూకుట్లోంచి సాంబ్రాణి పొగ...గుగ్గిలం వాసన...పత్తిమండల పంచల క్రిందుగా మిద్దెల్లోకి జొరబడుతోంది. ముంగిళ్ళన్నీ ఎఱ్ఱమన్ను అలికి ముగ్గులుపెట్టి ఉన్నయ్. గొఱ్ఱె బిత్తర బిత్తరగా చూస్తూ...అరుస్తూ హడిలి పోతున్నది. అడుగడుగునా నల్లరాళ్ళూ...ఎగుడు డిగుళ్ళూ...దిక్కులు చూసి నడిస్తే బోర్లపడే ఆ బజార్లలో—దేన్ని

లక్ష్యం చేయకుండా సంబరం ముందుకు సాగిపోయింది

* * *

ఊరంతా జమ్మిచెట్టు క్రిందికి చేరింది. ఆడా మగా... పిల్లా జెల్లా ఒకటే కోలాహలం... కేరింతలు! బంతిపూలు తురుంకొన్న పడతులూ...వాళ్ళవైపు కైపెక్కినట్టు చూసే కోడెగాళ్ళు...పరాచికాలాడుతూ సరదాపడుతున్న ముసలివాళ్ళూ... పెత్తనాలు చెలాయిస్తున్న పెద్దరెడ్లు — ఆవేశంతో కేకలతో అల్లడ తల్లడ అవుతున్నారు.

ఏటా పందెంలో గెల్చే రామిరెడ్డిని ఈసారి ఓడించాలని గొల్ల భీమన్న...వడ్డె రామన్న... ఊళ్లో వేడిబుట్టిన చేవగల వాళ్ళంతా పందేనికి తయారయ్యారు! గోళ్లు బిగబట్టి...కోరమీసాలు మెలేస్తూ బీరాలు పలుకుతున్నారు!

ఎదురుగా కొండబోడు. నల్లరాళ్ళమీద ఉదయభానుడి కిరణాలు తళుకులీనుతున్నవి. విషముష్టికాయలు...ఎఱ్ఱగా...నెత్తుటి ముద్దల్లా ఆ యెండలో మెరిసిపోతున్నవి. అంతా చింపిఅడవి. రేగుపొదలూ...జింకుముళ్ళపొదలూ...నర్లింగి పాలబరంకి చెట్లమధ్య గొఱ్ఱెలమంద డప్పుల చప్పుడు విని...మొరలెత్తి ధ్వనివచ్చేవైపు బెదురుగా చూస్తూన్నది. మంద చెదరిపోకుండా గొల్లలు మల్లేస్తున్నారు. ఆ పాలువేట పందెంలో పాల్గొనే గొఱ్ఱె ఆ మందలోదే.

కొండబోడుకు ఎదురుగా...మంద కన్పించేట్టు...పాలువేట గొఱ్ఱెను తిప్పేరు. బోడుమీద...యథేచ్ఛగా తిరుగుతున్న తోటి గొఱ్ఱెల్ని చూస్తూ నిర్బంధంలోంచి తప్పించుకోటానికి.. గొంతు పగిలిపోయేట్టు అరుస్తూ గింజుకులాడింది గొఱ్ఱె.

అంతా ఓ ప్రక్కకు తప్పుకున్నారు. కోరమీసాలు మెలేస్తూ వరసగా నిలబడ్డారు పందెగాళ్ళంతా. ఒక్కో పందెగాడికి ఒక్కొక గుంపు కోపుగాస్తున్నది. సారా వాసన గాలినే మత్తెక్కిస్తోంది. మా భీమన్న గెలుస్తాడంటే మా రామన్నదే ఛాన్సని వాదించుకుంటున్నారు జనం. రామిరెడ్డి దగ్గిరే ఎక్కువగుంపు ఉంది. ఎఱ్ఱటి పట్టీ బిగించి...తలగుడ్డ బిఱ్ఱుగా చుట్టేడు. చిఱు చెమటలు గ్రమ్మి మెలిదేరిన కండలు ఎండలో తళుకు...తళుకు మంటున్నయ్. ఆ మెఱుపులవైపు మిలమిలా చూస్తున్న సీతాయి కళ్ళు రామిరెడ్డి నింకా ఆవేశపఱచి ఉన్మాదాన్నెక్కించినయ్.

* * *

చాకలి సూరాయిని పిల్చాడు అంజిరెడ్డి. నలుగురూ గొఱ్ఱెను అదిమి పట్టుకున్నారు కదలకుండా. ఒక్కసారి బేఁ((. అన్నది గొఱ్ఱె ప్రాణాలు ఎగిరిపోయినట్టు. ఉన్న బెత్తెడుతోక రక్తంతో తడిసిన దుమ్ములో పొర్లింది. రక్తం పొంగివస్తున్న గాయానికి ఇంతసున్నం...కారం పట్టించాడు చాకలి సూరాయి. శంఖాలు...కొమ్ము బూరాలు.. తప్పెట్లు బ్రహ్మాండం బ్రద్దలయినట్టు ధణ.. ధణ మోగినయ్ ఒక్కసారి. గొఱ్ఱెను పదిగజాలు మందవైపు పోనిచ్చారు. భూనభోంతరాళాలు దద్దరిల్లేట్టు పెడదిమ్మె ధామ్మని మ్రోగింది. పడదోసుకుంటూ పరుగెత్తేరు గొఱ్ఱెను పట్టుకోటానికి పందెగాళ్ళు.

జనం ఒకటే కేకవేస్తున్నారు తాగిన మత్తంతా వదిలేట్టు...కంఠనాళాలన్నీ పగిలేట్టు. ఉఱుకలు తీస్తోంది గొఱ్ఱె. అసలే బెదురుది...తోకదగ్గఱ మండిపోతోంది... ఆపైన డప్పులు ధణధణ మంటున్నయ్... ప్రళయం ముంచుకొచ్చినట్టు పెడదిమ్మె ధామన్నది. అంతులేని బెదురుతో మందవైపు ప్రాణాలు బిగబట్టి పరుగెత్తుతోంది గొఱ్ఱె.

మంద చేరేలోపుగానే పందెగాళ్ళు గొఱ్ఱెను పట్టుకోవాలి. మందచేరితే ఆ గొఱ్ఱె గొల్లలకే దక్కుతుంది. పాలువేటలో నెగ్గిన గొఱ్ఱె తమ మందలో ఉంటం అదృష్టంగా భావిస్తారు గొల్లలు. ఇంకో గొఱ్ఱెను దానికి మారుగా పెద్దలకు ఇస్తారు. మధ్యలోనే గొఱ్ఱె చిక్కితే మొదటగా ఏభాగం పట్టుకొంటే ఆభాగం పందెగాడికి దక్కుతుంది. మిగతాది గొల్లలూ పెద్దలూ పంచుకొని దైవ ప్రసాదంలా ఆరగిస్తారు. ఆ పందెంలో గెలవడం వీరకృత్యంగా భావిస్తారు జనం. వాణ్ణి గౌరవంగా చూస్తారు. వాడికో ప్రత్యేకత ఉంటుంది ప్రతి సందర్భంలోనూ!

* * *

రామిరెడ్డి ముందుపరుగెత్తే భీమన్నను కాచుకొని ఉరుకుతున్నాడు. రాళ్ళతగిలి బోర్లపడి వెంటబడే వాళ్ళల్లో చాలామంది సర్దుకున్నారు. చెంగున లేడిలా ముందుకు దుమికేడు రామిరెడ్డి గొఱ్ఱెమీదికి. కాలు చిక్కినట్టే చిక్కి జారిపోయింది. వెనక వచ్చే గొల్ల భీమన్న....వడ్డె రామన్న... చాకలి వెంకన్న ఒక్క ఊపున రామిరెడ్డి మీదపడి గొఱ్ఱెను అందుకోబోయారు.

ఎక్కడలేని ఆవేశంతో లేచి మళ్ళా పరుగు లంకించుకొన్నాడు...పేరు నిల్పుకోవాలని రామిరెడ్డీ...ఎలాగయినా గెల్వాలని మిగతావాళ్ళూ ఉక్రోషంతో...ఆవేశంతో పిక్కబలం చూపుతున్నారు. ఇంకా ఇరవై గజాలుంది గొఱ్ఱె మందచేరటానికి. పరుగెత్తుకొస్తున్న సహజీవికి స్వాగతమిస్తున్నట్టు గోలపెడుతూ అరుస్తున్నయ్ మందలోని గొఱ్ఱెలు. అవి చెదిరిపోకుండా అడ్డుకట్టగా నిల్చేరు గొల్లలు. ఈలలు ..కేకలు ..ఒకటే రొద! జనం కోలాహలం మిన్ను ముట్టుతోంది.

ఒక్కసారి....ఉవ్వెత్తున లేచిన జనసముద్రఘోష ..కొండల్నీ అడవినీ దద్దరిల్లజేసింది. రామిరెడ్డి కొండ విరిగిపడినట్టు గొఱ్ఱెమీదపడి నడుం లంకించుకొన్నాడు. గొఱ్ఱెను నెత్తిమీది కెత్తుకొని...ఊప్పుతూ వచ్చే రామిరెడ్డివైపు జనమంతా పరుగెత్తేరు.

ఊరంతా విజయగర్వంతో...పడుచుదనంతో పరవశుడైన రామిరెడ్డికి విజయ నీరాజనాలిచ్చింది. కాని రామిరెడ్డికి జీవితమంతా గుర్తున్నది ఒక్కటే. అది కొప్పులోంచితీసి, సీతాయి తన తలపాగాలో తురాయిలా తురిమిన పసిడి బంతిపువ్వు.★

# ప్రశ్నోత్తరావళి

శ్రీ సి. రామలింగారెడ్డి, వడ్లరామపురం, కర్నూలు జిల్లా.

ప్రశ్న : కర్నూలు జిల్లాలో వరదరాజ స్వామి ఆనకట్ట, గాజులదిన్నె ఆనకట్ట — ఈ రెండు చిన్ననీటి పారుదల ఆనకట్టలకు 1951 సం. లో ప్రారంభోత్సవాలు చేయబడినప్పటికీ యింతవరకూ నిర్మాణ కార్యక్రమాలు చేపట్టడం జరగలేదు. వాటిని ఎప్పుడు ప్రారంభించడం జరుగుతుంది ?

సమాధానం : వరదరాజస్వామి ఆనకట్టపై అభిప్రాయాలను 1964 ఫిబ్రవరి నెలలో కేంద్ర జలవిద్యుచ్ఛక్తి సంఘం పరిశీలనార్థం పంపించడం జరిగింది. అంగీకారం లభించడంతోనే నిర్మాణ కార్యక్రమం ప్రారంభించబడుతుంది.

గాజులదిన్నె ఆనకట్ట యిప్పుడు తృతీయ పంచవర్ష ప్రణాళిక పథకంలో లేదు. ఏమయినా ఈ ఆనకట్ట నివేదికను తయారు చేయడం జరిగింది. దీనిని తృతీయ ప్రణాళికలోగాని, చతుర్థ ప్రణాళికలోగాని చేర్చడానికి వీలుగా యీ నివేదికను కేంద్ర జలవిద్యుచ్ఛక్తి సంఘం అభిప్రాయార్థం పంపడం జరుగుతుంది.

శ్రీ వి. ఆనందరావు, నవ్వడ, శ్రీకాకుళం జిల్లా.

ప్ర: ఆంధ్రప్రదేశ్‌లో చాలా పాఠశాలలు 6-9 సం. వయస్సుగల పిల్లలకు చదువు చెప్పడంతోపాటు భోజనం కూడా పెడుతున్నాయి. వీటిలో దేనికి తక్కువ ఖర్చు అవుతున్నది? రాష్ట్రంనుండి యివి సహాయాన్ని పొందుతున్నాయా? దయచేసి వివరాలు తెలుప ప్రార్థన.

సమా : కేర్ సంస్థ సహకారంతో అనేక ప్రాథమిక పాఠశాలల్లో చదువుతుండే 8 లక్షల పిల్లలకు మధ్యాహ్న భోజన సౌకర్యం కల్పించబడుతున్నది. రూ. 23.854 లక్షల మేరకు రోజుకు ఒక పిల్లవాడికి యిచ్చే పరిమాణం యీ దిగువ వివరించబడింది.

1. పాలపొడి 1 ఔ.
2. అన్నం 2 ఔ.
3. వనస్పతి నూనె ¼ ఔ.

ఇంతేకాక, 'కేర్' సంస్థ సహకారంతో 48 పురపాలక సంఘాలలోని 1,52,000 మంది ప్రాథమిక పాఠశాల విద్యార్థులకు రోజుకు ఒక్కొక్క పిల్లవాడికి 1 ఔ. చొప్పున పాలపొడి యివ్వడం జరుగుతున్నది.

ఈ పథకం క్రింద అయ్యే ఖర్చంతటినీ రాష్ట్రప్రభుత్వం భరిస్తున్నది. భోజన కేంద్రాలలో అయ్యే చిల్లర ఖర్చుల్ని ప్రజలు భరించవలసి వుంటుంది. ఈ విషయంలో అయ్యే ఖర్చు సంవత్సరానికి పిల్లవాడొక్కంటికి 3 రూపాయలు వుంటుంది. దీనిలో ప్రజలు డబ్బు రూపేణా, వస్తు రూపేణా రూ. 2. భరించవలసి వుంటుంది. (మిగతా 1 రూపాయి స్థానిక పరిపాలనా సంస్థలు భరిస్తాయి ) భోజన కేంద్రాలలో అయ్యే ఖర్చులు—కర్రలు సామానులు వంట ఖర్చులు — మొదలయిన వాటి కయే ఖర్చులకు మాత్రమే యీ డబ్బు వెచ్చించబడుతుంది.

రాష్ట్ర ప్రభుత్వం ద్వారా ప్రాథమిక పాఠశాలల పిల్లలకు మధ్యాహ్నపు భోజనాన్ని పెట్టే సంస్థలు యింకేమీ లేవు.

'కేర్' సంస్థ చిరునామా :
"కేర్"
హైదరాబాద్,
(విద్యాశాఖ డైరక్టరు కార్యాలయం)
హైదరాబాదు — 22

శ్రీ నన్నూరు మల్లారెడ్డి, గుడపూరు, నల్గొండ జిల్లా.

ప్ర. భారతదేశంలో మొట్టమొదటి రేడియో కేంద్రం ఎక్కడ ఏర్పాటు చేయబడింది ?

సమా : 1927 సం. జూలై 23 వ తేదీన ఇండియన్ బ్రాడ్‌కాస్టింగ్ కంపెనీ బొంబాయిలో ప్రతి దినం ప్రసారం చేసే కేంద్రాన్ని ప్రారంభించింది.

ప్ర: ఆల్ ఇండియా రేడియో ఎప్పుడు, ఎక్కడ ప్రారంభించబడింది ?

సమా : ఇండియన్ స్టేట్ బ్రాడ్‌కాస్టింగ్ సర్వీసు పేరును 1936 జూన్ 8 వ తేదీన ఆల్ఇండియా రేడియోగా మార్పు చేయడం జరిగింది.

ప్ర: రేడియోలవల్ల సాంవత్సరిక ఆదాయ, వ్యయాలు ఎంత ?

సమా : 1963-64 సం. రానికి ఆకాశవాణి కేంద్రం వ్యయం (బడ్జెటు అంచనా ప్రకారం) రూ. 5,61,88,000. మొత్తం

(మిగతా 73 వ పేజీలో)

మనచరిత్ర-సంస్కృతి

# ప్రాచీన తెలుగు సాహిత్యం

ఎస్. రామకృష్ణశాస్త్రి

(క్రిందటి సంచిక తరువాయి)

## శ్రీనాథ యుగం క్రీ శ 1375-1500

ఇంచుమించు తెలుగు సాహిత్యమంతా సంస్కృత సాహిత్యానికి అనుకరణే. అందుచేతనే తెలుగుసాహిత్య వికాసం సంస్కృత సాహిత్యవికాసాన్ని అనుసరించి జరిగింది. మాక్‌డొనాల్డ్ నిర్వచించినట్లు తొలినాటి తెలుగుసాహిత్యాన్ని రెండు భాగాలుగా — పురాణాలు, మహా కావ్యాలుగా — విభాగించవచ్చు. సంస్కృత మహాకావ్యాలను తెలుగులో ప్రబంధాలు అని అనవచ్చు. క్రీ. శ. 1020 నుండి క్రీ. శ. 1375 తో అంతమయ్యే కవిత్రయ యుగాన్ని పురాణ యుగం అనవచ్చు. ఇందుకు కారణం ఈ కాలంలో వచ్చిన సాహిత్యం ఎక్కువగా, పురాణాలకు సంబంధించినది కావడమే. అదేవిధంగా 16వ శతాబ్దారంభం మొదలుకొని 19వ శతాబ్దపు మధ్యకాలం వరకు ప్రబంధాలు ప్రముఖపాత్ర వహించాయి. అందుచేత యీ కాలాన్ని ప్రబంధయుగం అనవచ్చు. క్రీ. శ. 1375–1500 మధ్యకాలం ప్రబంధయుగానికి మార్గం వేసిందిగనుక, యీ కాలాన్ని రూపాంతరయుగం అంటే సరిపోతుంది. లేదా, యీ యుగకర్త పేరుతో శ్రీనాథయుగం అని అయినా పిలవవచ్చు. మహాభారతం, రామాయణాల ఆంధ్రీకృతాల్లోని అనుభవాల దృష్ట్యా ఒక పురాణాన్ని అనువదించడానికి ఒక కవి జీవితకాలం సరిపోదని అభిప్రాయపడ్డారు కవులు. అందుచేత యీ కాలంనాటి కవులు పురాణాలనుండి కొన్ని భాగాలను మాత్రమే తీసుకుని, తమ జీవితకాలంలో వాటిని తెనిగించే ప్రయత్నం చేశారు. కనుక యీ కాలం పురాణాలకు, ప్రబంధాలకు మధ్య రూపాంతరయుగంగా రూపొందింది.

రెడ్డి ప్రభువులు అద్దంకి, కొండపల్లిలను రాజధానులుగా చేసుకుని ఆంధ్రదేశపు కోస్తా ప్రాంతాన్ని సుమారుగా ఒక శతాబ్దంపాటు మాత్రమే పరిపాలించినప్పటికీ తెలుగు సాహిత్య వికాసానికి చాలామట్టుకు కారకులైనవారు యీ ప్రభువులే అనవచ్చు. విజానికి వీరిలో కొంతమంది గొప్ప సంస్కృత పండితులు, కావ్యకర్తలు, సంస్కృత వ్యాఖ్యాతలూను. అందుచేత తెలుగు కవుల విలువలూ, వైదృశ్యాలూ గుర్తించి వారిని పోషించారు. ఈనాటి కవులలో అగ్రగణ్యుడు శ్రీనాథుడు. ఈయన క్రీ. శ. 1380–1460 మధ్యకాలంలో జీవించి వున్నాడు. పుట్టుకతోనే యీయన కవి, మహాపండితుడు. బాల్యంలోనే 'మరుత్తరాట్ చరిత్ర' (మారుతికథను) రచించాడు. యౌవ్వనంలో శాలివాహనుని 'సప్తశతి'ని ఆంధ్రీకరించాడు. తర్వాత పాల్కురికి సోమనాథుని 'పండితారాధ్య చరిత్ర'ను చంపూ కావ్యంలో రచించాడు. కాని ప్రస్తుతం యీ మూడు గ్రంథాలు కానరావడంలేదు

శ్రీనాథుడు యౌవ్వనంలో శ్రీహర్షుని నైషధ మహాకావ్యాన్ని చంపూమార్గంతో సంస్కృతం నుండి తెలుగు చేశాడు. ఇది చాలా కష్టసాధ్యమైనపని. ఈ గ్రంథమే యీయన కీర్తికి పతాకమైంది. మూలగ్రంథంలోని అర్థవంతమైన మాటలు, వాటి నడక అనువాదకులకు కష్టసాధ్యమై నిరాశాజనకాలుగా వుండేవి. కాని శ్రీనాథుడు విజయాన్ని సాధించాడు. ఈయన మూలాన్ని గ్రుడ్డిగా అనుసరించలేదు. కొన్నిచోట్ల మూలంలో అవసరాన్ని మించివున్నవీ, పొసగనివీ మాటల్ని వదిలివేశాడు. మరికొన్నిచోట్ల వున్నదున్నట్టుగా అనువదించాడు. ఇంకొన్నిచోట్ల సంస్కృతంలోని అనేకశ్లోకాలలోని అర్థాన్ని ఒకే పద్యంలోకి కుదించాడు. ఒక్కొక్కచోట మూలంలోని భావాన్ని బాగా విపులీకరించాడు. మరొకొక్కచోట కుదించాడు. మూలంలోని సొగసూ, సొంపూ అనువాదంలో చొప్పించాడు. మూలంలోని భావానికి భంగం వాటిల్లకుండా ఉచితరీతిని మూలానికి న్యాయం చేకూరుస్తూ, భిన్న భిన్న మార్గాల్లో వ్యక్తిత్వాన్ని నిలుపుకుంటూ రచన కావించాడు. నారికేళపాకంలాంటి శ్లోకాలు శ్రీనాథునిసీస పద్యాల్లో సరళత్వాన్ని సంతరించుకున్నాయి. పండితులు ఆంధ్రీకృత నైషధాన్ని హర్షించారు. శ్రీనాథుని విజయం మిగిలిన కవులకు ఆదర్శమైంది. శ్రీనాధుడు దీన్ని పెదకోమటి వేమారెడ్డి అమాత్యుడు మామిడి సింగన్నకు

అంకితం చేశాడు. మామిడి సింగన్న గొప్ప సంస్కృత పండితుడు. స్వయంగా ఖగోళ శాస్త్ర వివరణా గ్రంథాన్ని రచించాడు.

కవిసార్వభౌముడు :

శ్రీనాథుడు శైవమతావలంబి. తొలి రోజుల్లో ఆయన భీమఖండాన్ని, వార్ధక్యం ప్రవేశిస్తున్నప్పుడు కాశీఖండాన్ని, వార్ధక్యం ఆవహించిన తరువాత శివరాత్రి మాహాత్మ్యాన్ని. మొదట హరవిలాసాన్ని రచించాడు. శివుని మహత్యాన్ని తెలియజేసే గ్రంథాలివి. భీమఖండాన్ని అమాత్యశేఖరుడు బెండలూరి అన్నయకు, కాశీఖండాన్ని తన ప్రభువు వీరభద్రారెడ్డికి, శివరాత్రి మాహాత్మ్యాన్ని శైవపీఠాధిపతి సంకయ్యకు. హరవిలాసాన్ని కాంచీపుర వణిజుడు అవచి తిప్పయ్య సెట్టికి అంకితం చేశాడు. క్రీడాభి రామాయణం, వినుకొండ వల్లభరాయుని పేరున చెలామణీ అవుతున్నప్పటికీ ఇదికూడా శ్రీనాథ విరచితమే అని చాలామంది ప్రగాఢ విశ్వాసం. దీన్ని వీధి నాటకం అంటారు. దీనిలో మంచన శర్మ అనే ఒకవ్యక్తి టిట్టిభసెట్టి అనే ఒకశ్రోతకు ఓరుగల్లు అనుభవాలను వివరిస్తాడు. కథా కథన విధానంలో నడిచిన మొట్టమొదటి తెలుగు సుఖాంతపు రచనయిది. అంతేకాదు, రెండవ ప్రతాపరుద్రునికాలపు పరిపాలనలోని స్వరూప స్వభావాలు— సాంఘిక దురాచారాలు, ఓరుగల్లు ప్రజల తప్పిదాలు, వారు పూజించే దేవుళ్ళు, నగరపు వీథులు, దుకాణాలు, పూటకూళ్ళ గృహాలు; చివరకు వ్యభిచారిణులు — వీరందరిని గూర్చి యీ గ్రంథంలో హాస్యధోరణిలో తెలియజేశాడు. రెండవ ప్రతాపరుద్రుని పరిపాలనావిధానాన్ని తెలియజేసే మొట్టమొదటి చారిత్రకాధారం యిది. శ్రీనాథుడు బాలచంద్రుని యుద్ధాన్ని వర్ణించే పల్నాటివీరచరిత్రలో కొంతభాగాన్ని కూడా రచించినట్టు చాలామంది అభిప్రాయం. పల్నాటి వీరులను పొగిడే ఒక 'పదం'యిది. స్వదేశాభిమానాన్ని కలిగించే వీరగాథ. పల్నాటి వీరచరిత్ర ఆనాటి సాంఘికాచారాలను వ్యక్తంచేస్తుంది. శ్రీనాథుడు వివిధ విషయాలపై అనేక చాటువుల్ని రచించాడు. ఆంధ్రప్రజల్లో వీటికి అశేష ఆదరం వుంది.

శ్రీనాథుడు తెలుగుకవిరాజులలో ఒకడు. బహుముఖ ప్రజ్ఞాశాలి. మేరు ధీరుడు, మేఘ గంభీరుడు. తెలుగు సాహిత్యంలో కవిసార్వభౌముడు. ఈతని శైలి పైకి ఆడంబరంగా కనిపించినా అత్యంత సుందరమూ, గంభీరమూ కలది. భావప్రకటన సరళమూ, హృద్యమమూ అయినది. ఆలోచనాపటిమ అత్యద్భుతమైనది. ప్రజ్ఞ అగణితమైనది. సీసపద్యాల రచలలో అందె వేసిన చేయి. ఈయనలా మరొక రెవరూ వ్రాయలేరు. సమకాలీన ఆంధ్రప్రభువులందరిచేతా శ్రీనాథుడు గౌరవ సమ్మానాలందుకున్నాడు. జీవితంలో చీకటివెలుగుల్ని చవిచూశాడు. మహారాజుల సరసన బంగరు పళ్ళెరాల్లో భుజించాడు. వాదనలో డిండిమ భట్టుని ఓడించి విజయనగర ప్రభువు ప్రౌఢ దేవరాయునిచేత కనకాభిషేకం చేయించుకున్నాడు. శ్రీనాథుడు జీవితాన్ని పూర్తిగా అనుభవించాడు. మహారాజులా కాలాన్ని వెళ్ళబుచ్చాడు. కాని చివరకు నిరుపేదగానే మరణించాడు. కటకాన్ని పరిపాలించే గజపతుల చేతుల్లో రెడ్డిప్రభువులు పరాజయాన్ని పొంది, రాజ్యాన్ని కోల్పోవడంతో శ్రీనాథుడికి గడ్డురోజులు ప్రాప్తించాయి. శ్రీనాథుడిపై వారికి ఆదరణ లేకపోయింది.

రెడ్డి ప్రభువులకు పద్మ వెలమలు శత్రువులు. వీరు రాచకొండను రాజధానిగా చేసుకుని ఆంధ్రదేశపు పశ్చిమ ప్రాంతాన్ని — తెలంగాణాను — పరిపాలిస్తుండేవారు. వీరిలో కొంతమంది సంస్కృత పండితులు వుండేవారు. వీరు పండితులను, కవులను పోషించేవారు. ఒకసారి శ్రీనాథుడు యీ కోవకు చెందిన సర్వజ్ఞరావుసింగన అనే పేరు మోసిన రాజుగారివద్దకు వెళ్ళాడు. ఈ రాజే శ్రీనాథుని బావమరిదయిన బెమ్మర పోతనను కొంతకాలంపాటు పోషించాడు.

నిజానికి బెమ్మర పోతన శ్రీనాథుని స్వంత బావమరదికాడు, అసలయిన బావమరిది (భార్య సోదరుడు) దగ్గుపల్లి దుగ్గన. దగ్గుపల్లి దుగ్గనకు పోతన, ఎర్రన అనే యిరువురు సోదరులు వున్నారు. ఈ పోతనే బెమ్మర పోతన అని చాలామంది తప్పుగా అభిప్రాయ పడడంవలన, ఎంతో గందరగోళానికి కారణ మౌతున్నది.

తొలిరోజుల్లోబెమ్మర పోతనరావుసింగన ఆస్థానంలో వుండేవాడు. రాజుగారి వుంపుడుకత్తెమీద భోగినీదండకాన్ని రచించాడు. కాని ఆతర్వాతరాజులతో విసిగివేసారి, ఎవరి అధీనంలోనూ లేకుండా వుండిపోయాడు. మక్కువతో భాగవతాన్ని అంకితమివ్వమని అడిగిన రావుసింగన కోర్కెను కూడా తిరస్కరించాడు. ఆనాడు ఆయన జీవితానికే ఒక పరీక్ష జరిగింది. ఒకవైపు రాజుగారు తనఐశ్వర్యాన్ని పోతన ముందుంచారు. మరొకవైపు చదువుల తల్లి సరస్వతి కాటుక కంటినీరు చనుకట్టుపై పడ దుఃఖితవదనయై ఎదుట నిలుచున్నది. రాజు పోతన్నను దేశంనుండి వెడలగొడతానని బెదిరించినప్పటికీ, పోతన మానవులకు భాగవతాన్ని అమ్మివేయడం అపచారంగా భావించి, దానిని శ్రీరామచంద్రుడికి తప్ప మరెవరికీ అంకితం చెయ్యనని చదువుల తల్లికి హామీయిచ్చి కన్నీళ్ళు తుడిచివేశాడు. క్లిష్టమైన పరీక్షకు తట్టుకుని నిలిచాడు.

విజయాన్ని సాధించాడు. భాగవతాన్ని శ్రీరామచంద్రుడికి అంకితం చేస్తే మోక్షం సిద్ధిస్తుందని భావించాడు. అంతేకాదు అంత వరకూ భాగవతాన్ని ఎవరూ ఆంధ్రీకరించక పోవడం తన అదృష్టం అని పోతన ఎంతగానో సంబరపడిపోయాడు.

## భిన్నత్వం

పోతన, శ్రీనాథుడు యించుమించు సమ కాలీనులే అయినప్పటికీ, స్మార్తులే అయినప్పటికీ పోతనకూ, శ్రీనాథుడికీ ఎన్నో విషయాలలో భేదం వుంది. శ్రీనాథుడు శివారాధకుడు; పోతనకు శ్రీరాముడి మీద అమితమైన భక్తి. శ్రీనాథుడు మహారాజ భోగాల వైపు మ్రొగ్గుతాడు; పోతనకు కృషీవలుని జీవనం అంటేయిష్టం. శ్రీనాథుడికి గర్వం, ఆడంబరం ఎక్కువ; పోతన నిరాడంబరుడు.. అణకువ గలవాడు. శ్రీనాథుడికి తన పాండితీ ప్రకర్షను పలువురికి తెలియజెప్పాలని ఉబలాటం ఎక్కువ; పోతనకు కవిత్వంద్వారా శ్రీరాముడ్ని కొలవాలన్న భక్తిభావంతప్ప యింకేమీలేదు. రజోగుణానికి శ్రీనాథుడు పెట్టిందిపేరు; సత్వగుణాన్ని వ్యక్తంచేసే ప్రయత్నం పోతనది. శ్రీనాథుడుశారీరక శృంగారాన్ని వర్ణించాడు; పోతన తిరుపతి నివాసి తాళ్ళపల్లి అన్నమాచార్యునివలె ఆధ్యాత్మిక శృంగారాన్ని ప్రకటించాడు శ్రీనాథుడుభౌతికవాది—సుఖ.భోగలాలసుడు; పోతన పారలౌకికుడు — భగవన్నామసంస్మరణమోక్ష పదగాముడు. తన కవిత్వాన్ని డబ్బుకు అమ్మివేయడానికి శ్రీనాథుడు ఎప్పుడూ వెనుకంజ వేయలేదు; కాని పోతన అలాచేయడం అపచారం అని భావించాడు. ఈ యిరువురి వ్యక్తిత్వాలలో, మనస్తత్వాలలో ఎంతో అంతరంవుంది. ఈ అంతరమే వీరి కవిత్వంలోను ప్రతిఫలించింది. వీరి మరణాల్లోకూడా యీ భిన్నత్వం మనకు గోచరిస్తుంది. శ్రీనాథుడు నిరాశతో మరణించాడు. పోతన ప్రశాంతంగా కళ్ళు మూశాడు. వీరి జీవితాలు ఆంధ్రులకు ఒక విధమైన తత్వాన్ని బోధిస్తుంటాయి.

పోతన భాగవతాన్ని ఆంధ్రీకరించేప్పుడు శ్రీధరుని వ్యాఖ్యానాన్ని చొప్పించాడు. రచన కొనసాగుతున్న సమయంలో తనను తానే మర్చిపోయేవాడు. తన్మయత్వంలో ఆలోచనలు ఉన్నతంగా విహరించేవి. వర్ణనలు సుదీర్ఘంగా సాగిపోయేవి. అందువల్లనే తెలుగు భాగవతం మూలాన్ని మించిపోయింది. పోతనకవిత్వం ఆధ్యాత్మిక అనుభూతికి, భక్తితన్మయత్వానికి ప్రసిద్ధికెక్కింది. తిక్కన చాతురి నాటకీయ ధోరణికి పేరందితే, పోతన చాతురిసుందర రూపకల్పనకు ప్రసిద్ధికెక్కింది. ఇతని శైలి అత్యంత శ్రావ్యమైనది. ప్రతిగృహంలోనూ యీతని పద్యాలు ప్రతిరోజూ ప్రజలు పాడుకొంటూనే వుంటారు. భాగవతంలో యీయన ప్రకటించిన శృంగార, భక్తిభావాలు ఆ గ్రంథాన్ని మరింతగా పండిత, పామరులిరువురిమధ్యా అశేష ప్రచారం పొందడానికి కారణమయ్యాయి. ఐశ్వర్యవంతులు, బీదవారు — ఇరువురిచేతా సమానంగా గౌరవింపబడుతున్నది. పోతన శృంగార ప్రకటన పవిత్రమూ, స్వచ్ఛమూనైనది. విద్యాగంధం లేనివారికిసైతం గజేంద్రమోక్షం, రుక్మిణీ కళ్యాణం, ప్రహ్లాదచరిత్ర చాలా ఆసక్తిని కలిగిస్తాయి. అందువల్లనే రామాయణ, మహాభారతాలకన్న తెలుగు భాగవతానికి అశేష ప్రచారం వుంది. పోతన వీరభద్ర విజయాన్నికూడా రచించాడు.

పోతన తర్వాత చెప్పుకోతగ్గ యీ కాలం నాటి కవి పిల్లలమర్రి పినవీరన. ఇతడు శ్రీనాథుని శిష్యుడని ఒక నమ్మకం వుంది. శకుంతల కథను తీసుకుని, ముందరిభాగాన్ని కాళిదాసు శాకుంతలం ఆధారంగాను, తరువాతి భాగాన్ని భారతం ఆధారంగాను రచించాడు. పద్యరచనలోను, నడకలోను శ్రీనాథుని ప్రభావం మనకు గోచరిస్తుంది. జైమిని భారతంనుండి తీసుకున్న అశ్వమేధపర్వం అనే మరో గ్రంథంలో యీయన కవిత్వంలో పరిపక్వత ద్యోతకమవుతుంది. దీనిలో వ్యాసభారతంలోకన్న ఎక్కువ కథలు వున్నాయి. దీనిని ఆనెగొందిప్రభువు సాళువ నరసింహుడికి అంకితం చేశాడు. అవతార దర్పణం, నారదీయం, మాఘమాహాత్మ్యం, పురుషార్థ సుధానిధి, మానసోల్లాససారం అనే మరోక అయిదు గ్రంథాలనుకూడాయీయన రచించాడని ఒకప్రతీతి. అయితే యిప్పుడా గ్రంథాలు కనుపించడం లేదు.

## అనువాద నాటకం

సర్వసాధారణంగా కవులు తమను పోషించే ప్రభువుల అభిరుచులకు అనుగుణంగానో, తమ దేశప్రజల అభిరుచులకు వీలుగానో, లేదా తమ అభిరుచినిబట్టో తమ కవిత్వానికి వివిధరకాల యితివృత్తాలను ఎన్నుకుంటారు. ఇంతకు ముందరి పురాణ కాలంలో కేతన విజ్ఞానేశ్వరీయం అనే ఆధ్యాత్మిక రచనను చేపట్టడం మనం గుర్తించాం. ఈ యుగంలోకూడా ఆ అభిరుచి కొనసాగుతూనే వుంది. తిక్కన మనుమడు మడికి సింగన వశిష్ఠ రామాయణాన్ని రచించి, దానిని అహోబలేశ్వరునికి అంకితంచేశాడు. సంస్కృతంలోని జ్ఞాన వాశిష్ఠానికి యిది సంక్షిప్త అనువాదం. రాముడికి, వశిష్ఠుడికి మధ్య జరిగిన వేదాంత తత్వానికి సంబంధించిన సంభాషణ యిందులో వుంది. పద్మ పురాణాన్ని చంపూలోను, భాగవతంలోని దశమస్కంధాన్ని ద్విపదలోను సింగన రచించి వాటిని సబ్బినాడుప్రభువు ముప్పయ్య

వద్ద అమాత్యుడుగా వుండిన కందనకు అంకిత మిచ్చాడు. ఈయన వివిధ నీతిపద్యాలను ఏరికూర్చి 'సకల నీతిసమ్మతం' అనే సంకలనాన్ని రూపొందించాడని కొంతమంది అభిప్రాయం. ఉదయగిరిరాజు బసవన్నవద్ద అమాత్యుడూ, సాళువ నరసింహుని తాత్కాలిక మంత్రివర్యుడూ అయిన అనంతామాత్యుని గంగయ శ్రీనాధుని బావమరిదీ శిష్యుడూ అయిన దుగ్గుపల్లి దుగ్గనను పోషించాడు. కఠోపనిషత్తునుండి నాచికేతుడి ఆధ్యాత్మిక యితివృత్తాన్ని తీసుకుని ఒక గ్రంథాన్ని రచించమని దుగ్గనను ఆదేశించాడు. నాచికేతునికథ మహాభారతంలో అనుశాసన పర్వంలోకూడా కనుపిస్తుంది. దుగ్గన కాంచీపుర మాహాత్మ్యం అనే గ్రంథాన్నికూడా వ్రాశాడు. ఇదే తెలుగులో మొట్టమొదటి స్థలపురాణం. ఇతని కవితాశైలి, గమనం చాలా చక్కటివి. ఆదే గంగయ్యమంత్రి నందిమల్లయ్య, గంటాసింగన అనేద్వంద్వ కవులను పోషించాడు. వీరు వరాహపురాణాన్ని ద్వాదశాశ్వాసాలలో రచించారు. గంగయ్యామంత్రి ఈ ద్వంద్వకవులను, కృష్ణమిశ్రుడు సంస్కృతంలో తాత్విక, ఆలంకారిక మార్గంలో రచించిన నాటకాన్ని తెలుగు కథనంలో చంపూ మార్గంలో రచించమని కోరాడు. వారు అలానే తమ కవితా పాటవాన్ని ప్రదర్శించి, ఆంధ్రీకృతం చేసి, దానిని గంగయ మంత్రికి అంకితం చేశారు. వరాహపురాణంకన్న యిదే ఎక్కువ ప్రసిద్ధికెక్కింది. ఈ నాటకాన్ని ఆంధ్రీకృతం చేయడంవల్ల ఆనాటి తెలుగు రంగస్థల విశేషాలను తెలుసుకోవడానికి కొంత అవకాశం కలిగింది.

మానవు లందరికీ, చిన్నప్పటి నుండీ కూడా శృంగార సాహస కథలంటే చాలా యిష్టం వారిలో ఎక్కువ ఆసక్తిని కలిగిస్తాయి కనుక అవంటే వారి కంత యిష్టం. అలాంటి కథల్లో హృదయాలను కదలించే సంఘటనలు వుంటే అవి మామూలుగా ప్రజల్ని ఆకర్షిస్తాయి. గత పురాణాల కాలంలో మంచన కేయూరబాహు చరిత్ర, కేతన దశకుమార చరిత్రల్లోని కథలపై ప్రజలు చూపించిన అభిరుచులను యీ కాలంలోకూడా ప్రజలు చూపించారు. మధ్య యుగంనాటి కథాసాహిత్యం యీనాటి కవులకు సాహిత్యరచనకు గ్రాసమయింది. సాధారణంగా యీ కథలు వీరులైన రాజులను గురించే వుండేవి. భారతదేశంలో భోజరాజు, విక్రమార్కుడి చుట్టూ అనేక కథలు అల్లుకుని వున్నాయి. జక్కన విక్రమార్కుడి చరిత్రను పండితులు చదువుకొనే విధంగా రచించి, దేవరాయుని మంత్రి సిద్ధనకు అంకితమిచ్చాడు, దేవరాయుడు విజయనగరాన్ని క్రీ. పూ. 1406–1422 కాలంలో పరిపాలించాడు. జక్కన సిద్ధహస్తుడైన కవి. ఇతని కథలు చాలా ఆసక్తికరంగా వుంటాయి. అందుచేతనే వీటికి విశేషమైన ప్రచారం లభించింది. ఈ కథలకు లభించిన ప్రచారాన్ని చూసి యితని సమకాలికుడయిన అనంతామాత్యుడు భోజరాజీయాన్ని రచించి,అహోబిల నరసింహస్వామి దేవుడికి అంకితం చేశాడు. దీనిలో ఆసక్తికరమైన నీతికథలు వున్నాయి. స్వాభావికమైన వర్ణనలు, అలంకారాలు మనకు కనిపిస్తాయి. భాష అతి సరళమైనది. భావ ప్రకటన సొంపైనది. శైలి హృద్యమమైనది. ఈ రెండు గ్రంథాలూ కథాసాహిత్యానికి సంబంధించినవే అయినా కథల్లో, శైలిలో, పాత్రల చిత్రీకరణలో యీ రెంటికీ ఎంతో భిన్నత్వం వుంది. అనంతామాత్యుడు ఛందస్సు కావ్యాలమీద మరొరెండు గ్రంథాలను కూడా రచించాడు అదే శతాబ్దపు మధ్య కాలంలో కొరవి గోపరాజు కథాసాహిత్యానికి సంబంధించిన 'సింహాసన ద్వాత్రింశిక' అనే గ్రంథాన్ని రచించాడు. పై రెండు గ్రంథాల తర్వాతనే యిది వచ్చింది. ముప్పయిరెండు ఆసక్తి కలిగించే కథలు యిందులో వున్నాయి.

కవి యీ కథల్లో కొన్ని మార్పులుచేసి వాటిని విక్రమార్క మహారాజుకు ఆపాదించాడు. ఈ గ్రంథంలో ఆంధ్రత్వం, ఆచార వ్యవహారాలు వివరించబడ్డాయి. అదే కాలంలో దూబగుంట నారాయణ పంచతంత్రాన్ని చంపూమార్గంలో రచించి, దానిని పదిహేనవ శతాబ్దపు ఉత్తరార్థంలో ఉదయగిరిని పరిపాలించిన బసవనకు అంకిత మిచ్చాడు. వెన్నెలకంటి అన్నయ అనే మరో కవి షోడశ కుమారచరిత్రను రచించి తన తండ్రికి అంకితం చేశాడు. ఇది చూడడానికి దశకుమార చరిత్రంలా వుంటుంది.

స్థల పురాణాన్ని యితివృత్తంగా తీసుకున్న మరొక కవి భైరవుడు. ఈయన శ్రీరంగ మాహాత్మ్యాన్ని వ్రాసి, దానిని ప్రౌఢ దేవరాయుని సామంతుడు సైఫాఖాన్ క్రింద పనిచేసిన రాఘవమంత్రికి అంకిత మిచ్చాడు. శ్రీరంగాన్ని గురించి బ్రహ్మాండపురాణంలో వున్నప్పటికీ, భైరవుడు గరుడ పురాణం నుండి యితివృత్తాన్ని ఎన్నుకుని కొద్దిపాటి మార్పులు చేశాడు. ఇతని కవితాశైలి యింపైనది. వినసొంపైనది. ఈ కవి రత్నాలను గూర్చి 'రత్నశాస్త్రం' అనే శాస్త్ర గ్రంథాన్ని, వ్యాకరణాన్ని గూర్చి 'కవిగజాంకుశం' అనే వ్యాకరణ గ్రంథాన్ని కూడా రచించాడు. ద్విపదను వాడుతూ, పూర్వ కావ్యాన్నుత్వాన్ని ప్రతిష్ఠిస్తూ, వ్యక్తిత్వాన్ని నిలుపుకొంటూ రచనలుచేసిన యీ కాలంనాటి మరొకకవి గౌరన ఈయన శైవమతస్థుడు హరిశ్చంద్ర, నవనాధ చరిత్రలను ద్విపదలో

రచించి వాటిని శ్రీశైలస్వామి మల్లికార్జునుడికి అంకితమిచ్చాడు. హరిశ్చంద్రుడి కథ మార్కండేయ పురాణంలోను, స్కాంథ పురాణంలోను కొద్దిపాటి మార్పులతో మనకు కనుపిస్తుంది. స్కాంథ పురాణంలోని కథను తీసుకుని కథను మరింత ఆసక్తికరంగా సృష్టించాడు గౌరన. ఇతని శైలి, భావ ప్రకటనలు చక్కటివి. పాత్రల పోషణ, మనస్తత్వ చిత్రణ హరిశ్చంద్ర చరిత్రలో చక్కగా నిర్వహించబడ్డాయి. గౌరన రచించిన నవనాథ చరిత్రలో సారంగధరుడు, చిత్రాంగి, రాజరాజ నరేంద్రుల అసలుకథ మనకు కనుపిస్తుంది.

## తొలి కవయిత్రి

ఈ కాలంలో కూడా వీరశైవ, వైష్ణవ అనుయాయులు తెలుగు సాహిత్య వికాసానికి తోడ్పడ్డారు. నిస్సంక కొమ్మన శివలీలా విలాసాన్ని రచించి అల్లాడరెడ్డి కొడుకు దొడ్డా రెడ్డికి అంకితం చేశాడు. ఈ కవి వీర శైవమతానికి సంబంధించిన వీర మహేశ్వరం అనే ధర్మశాస్త్రగ్రంథాన్ని వ్రాశాడనిఒక ప్రతీతి. కానిఅది యిప్పుడుకానరావడంలేదు. కొమ్మన శైలి హృద్యమైనది. ఉన్నత ప్రమాణాలతో కూడి వున్నది. శైవమత సిద్ధాంతాలు గల మరొక గ్రంథం శివయోగ సారం. దీనిని కొలను గణపతి దేవుడు రచించాడు. ఈయన వీర శైవ కవులకు పెట్టింది పేరయిన పిడపర్తి కుటుంబానికి దోకిపర్రు అగ్రహారాన్ని దానం చేయడానికి కారణమయిన రెండవ ప్రతాపరుద్రుని అమాత్యుడు ఇందులూరి అన్నయ కుటుంబానికి చెందినవాడు. ఒకటవ పిడపర్తి సోమన వీరశైవ దీక్షాబోధ, పిల్లనయనార చరిత్ర, బ్రహ్మోత్తర ఖండము అనే గ్రంథాలను ద్విపదలో రచించాడు.

శైవ కవులలో తాళ్ళపాక కుటుంబం వారు బాగా ప్రసిద్ధికెక్కి వున్నారు. తిరుపతి వేంకటేశ్వరస్వామి భక్తుడయిన తాళ్ళపాక అన్నమాచార్యుడు యీ వర్గానికి నాయకుడు. ఈయన తెలుగులోను, సంస్కృతం లోనూ కలిపి మొత్తం 32,000 ఆరాధన గీతాలను వ్రాశాడు. 105 పద్యాలతో వెంకటేశ్వర శతకాన్ని కూడా యీయన రచించాడు. ఈయన గీతాలను శృంగార సంకీర్తనలు, లేదా భక్తికీర్తనలు అనవచ్చు. ఈ కీర్తనలతో వీరి కుటుంబం తెలుగులో గేయకవితను ప్రవేశపెట్టింది. పోతనవలె యీయనకూడా సరళ శృంగార కవి చక్రవర్తి. తెలుగు కావ్యకవితలో పోతన ఎంతటివాడో గేయ కవితలో అన్నమాచార్యుడు అంతటివాడు. భగవంతుని భర్తగా భావించి, భక్తుడు భార్యగా ఊహించుకుని అన్ని మార్గాల్లోనూ ప్రేమతో, ఆరాధనతో భగవంతుని కొలవడం భక్తునికి ఒక సాంప్రదాయంగా వస్తున్నది. ఈవిధానాన్ని అన్నమాచార్యుడు చక్కగా వ్యక్తం చేశాడు. ఆతర్వాత తంజావూరులో క్షేత్రయ్య, త్యాగరాజుల చేతుల్లో కీర్తనలు బహుధా వికసించాయి. క్షేత్రయ్య శృంగార సంకీర్తనలకు, త్యాగరాజు ఆధ్యాత్మ సంకీర్తనలకు ప్రాతినిధ్యం వహిస్తారు.

తాళ్ళపాక అన్నమాచార్యుని అర్ధాంగి తిమ్మక్క ద్విపదలో సుభద్రా పరిణయాన్ని రచించింది చాలా సరళంగాను. వినసొంపుగాను నడిచిన గ్రంథం యిది. తెలుగులో మొట్టమొదటి కవయిత్రి యీమె.

## ప్రబంధయుగం క్రీ. శ 1500-1625

తెలుగుసాహిత్యానికి యీకాలం స్వర్ణయుగం అనవచ్చు. తెలుగు ప్రజలకు యిదొక వరం. తుంగభద్రాతీరంలో కృష్ణదేవరాయలు విజయనగర సింహాసనాన్ని అధిష్ఠించడం తోటే చదువులతల్లి సరస్వతీ, ధనదేవత లక్ష్మి - యీ యిరువురూ చిరునవ్వులు చిందించారు. నిజానికిది అసంభవమేఅయినా కృష్ణదేవరాయల రాకతో సంభవమయ్యింది. ఇంతకుముందటి యుగాల్లోవలె కాకుండా యీ యుగంలో కవులు కృష్ణదేవరాయుని ప్రోత్సాహంలో, పోషణలో ఒక కొత్త కవితామార్గాన్ని త్రొక్కారు. కృష్ణదేవరాయలు స్వయంగా కవి, పండితుడు. అచ్చమైన పురాణకథలు మెరుగులు దిద్దని రత్నాలు అనీ, కేవలం కల్పితకథలు కృత్రిమ రత్నాలు అనీ, అష్టాదశ వర్ణనలతోనూ అలంకారాలతోనూ కూడిన పురాణకథలు అసలైన జాతి రత్నాలు అనీ అనవచ్చు. అందుచేత యీ కాలంనాటి కవులు పురాణాలనుండి యితివృత్తాల్ని తీసుకుని, పాత్రలసృష్టి, వర్ణనలు, భావప్రకటనలు ఉన్నత ప్రమాణాలలో చేసేవారు. నిజానికి యిక్కడ తీసుకున్న యితివృత్తం పాతదే అయినా వర్ణనలు, కథాగమనం, మనస్తత్వ చిత్రణ, పాత్రపోషణ, భాష, శైలి మొదలయినవన్నీ కొత్తవే. అందుచేత మొత్తం గ్రంథమే కొత్తగా కనిపిస్తుంది. నిజానికి యిది సంస్కృత మహాకావ్యాన్ని పోలివున్నప్పటికీ సరిగ్గా చెప్పాలంటే తెలుగులో దీన్ని ప్రబంధం అనవచ్చు.

## పితామహుడు

కృష్ణదేవరాయల ఆస్థానకవి అల్లసాని పెద్దన మార్కండేయ పురాణంనుండి స్వారోచిష మనువు కథను తీసుకుని, సచిత్ర వర్ణనలతోను, స్వాభావిక పాత్రలతోను దానిని ప్రబంధంగా మలిచి, కాళిదాసుని కుమార సంభవంలా 'స్వారోచిష మను సంభవం'అని దానికి పేరుపెట్టాడు. మనుచరిత్ర అనికూడా సంక్షిప్తనామంతో పిలవబడుతుంది. నిష్టాత్ముడైన బ్రాహ్మణయువకు డొకడు మంత్రశక్తి చేత హిమాలయాలకేగి,అక్కడ ఎదురుపడిన అందమైన గంధర్వకన్య వరూథిని ప్రేమను

తిరస్కరించి, గృహోన్ముఖు డవుతాడు. అంతకుపూర్వం వరూధినిని ప్రేమించిన ఒక గంధర్వుడు, ప్రవరుని వేషంలోవెళ్ళి వరూధినిని మోసంచేస్తాడు. వీరిద్దరి కలయిక కారణంగా స్వారోచి జన్మిస్తాడు. కుమారసంభవంలో కుమారస్వామికన్న శివ పార్వతులకే ప్రాధాన్యత ఎక్కువ. అదే విధంగా స్వారోచిషమనువు పేరునవున్న మనుచరిత్రలో స్వారోచిష మనువుకన్న వరూధినీ, ప్రవరులకు ప్రాముఖ్యత అధికం. ప్రవరుడు, వరూధినిల పాత్రలకు పెద్దన తన కవితాశక్తితో, రూపచిత్రణతో శాశ్వతత్వాన్ని కల్పించాడు. సొంపైన భావ ప్రకటనలోను, కల్పనలోను ఆ కాలంలో పెద్దనకు సాటికవిలేడు. ఇతని కవితాశైలి చాల చక్కటిది. ఉన్నత ప్రమాణాలతో కూడినది. నడక, సంభాషణలతో నాటకీయ ధోరణిలో సాగింది. ఈ గ్రంథాన్ని పెద్దన శ్రీకృష్ణదేవరాయలకు అంకితం చేశాడు. శ్రీకృష్ణదేవరాయలు పెద్దనకు 'ఆంధ్ర కవితా పితామహుడు' అనే బిరుదు యిచ్చి సత్కరించాడు. ఇంకా అనేకవిధాల సన్మానించాడు. పెద్దన ఆ గౌరవాలకు తగినవాడే. కరికథాసారం అనే గ్రంథాన్ని పెద్దన రచించాడని చెప్తారుకాని, ఆ గ్రంథం ప్రస్తుతం కనుపించడంలేదు.

పెద్దనతర్వాత రాజాస్థానంలోని మరొక గొప్పకవి నందితిమ్మన. నందితిమ్మన పారిజాతాపహరణం అనే గ్రంథాన్ని రచించి కృష్ణదేవరాయలకుఅంకితమిచ్చాడు. పరిమాణంలో చిన్నదే అయినప్పటి కీవిలువలో, మనుచరిత్రకు ఏమాత్రం తీసిపోదు. నారదుడు ఇంద్రుని ఉద్యానవనంనుండి పారిజాత పుష్పాన్ని తెచ్చి శ్రీకృష్ణునికియిచ్చాడు. శ్రీకృష్ణుడు దాని దగ్గర్లో వున్న రుక్మిణికి యిచ్చాడు. ఈ వార్త సత్యభామకు తెలిసింది. అసూయ చెంది కృష్ణుడితో పోట్లాట పెట్టుకుంది. ఆమెను ప్రసన్నురాలిని చేసుకోవడానికై కృష్ణుడు సత్యభామ పాదాలమీద పడ్డాడు. సత్య అంతట లతాంతాయుధు కన్నతండ్రి శిరస్సును వామపాదంతో త్రోసివేసింది. అప్పుడు ఆ పారిజాత వృక్షాన్నే తెచ్చి, ఆమె ఉద్యానవనంలో నాటుతానని కృష్ణుడు వాగ్దానం చేశాడు. ఆ తర్వాత ఇంద్రుడితో యుద్ధం చేసి, పారిజాత వృక్షాన్ని పెకలించి తెచ్చి సత్యభామ ఉద్యానవనంలో నాటాడు. ఇదీ కథ. అసలుకథ హరివంశంలో వున్నప్పటికీ కృష్ణదేవరాయల అంతఃపుర సంఘటనకు సంబంధించిన వ్యక్తిగత అనుభవంతో వుత్తేజితుడై నందితిమ్మన యీ గ్రంథాన్ని వ్రాశాడని ఒక ప్రతీతి. తన గ్రంథంలో సత్యభామను అసూయగల అర్ధాంగిగా చిత్రించడం కవియొక్క సృష్టి. ఇందుకు యీయన అభినందనీయుడైనాడు. కోరికలు, ప్రేమ, అసూయల మధ్య వైవిధ్యాన్ని యీ గ్రంథంలో చక్కగా చిత్రించాడు. చక్కటి భావాలు, ఇంపైనశైలి ఒకదానితో ఒకటి పోటీపడుతుంటాయి. ఎన్నుకున్న సంఘటనలు నాటకీయంగా బహుధా ఆశక్తిదాయకాలయ్యాయి. తిమ్మన కవిత్వపు శైలి అందమైనది, కల్పన వున్నతమైనది, భావప్రకటన సున్నితమైనది. ఈ గ్రంథం తెలుగు సాహిత్యంలో ఉన్నతస్థానాన్ని అధిష్ఠించింది.

### రాజకవి:

కృష్ణదేవరాయలు స్వయంగా కవి. మదాలస చరిత్ర, సత్యవధూ ప్రీణానం, సకలకథాసారసంగ్రహం, జనన చింతామణి రసమంజరి అనే అయిదు సంస్కృత గ్రంథాలను రచించాడు. కాని ప్రస్తుతం వీటిలో ఏ ఒక్కటీ కానరావడంలేదు. తెలుగులో ఆముక్తమాల్యద, అనే ప్రబంధాన్ని వ్రాశాడు. దీనికే విష్ణుచిత్తీయం అనీ, విష్ణుచిత్తుని కథ అని పేరు. దక్షిణభారత దేశంలోని శ్రీ విల్లిపుత్తూరులో ఒకానొక వైష్ణవ దేవాలయంలో విష్ణుచిత్తుడు పూజారి. బ్రహ్మచారి అయిన యితడు భక్తితో దేవుని కొలుస్తుండేవాడు. ఒక బాలికను తెచ్చుకుని కూతురులా పెంచుతుండేవాడు. ఆ అమ్మాయిని దేవుడికి మాలలు తయారుచేసేపనికి నియోగించాడు. కాని ఆ అమ్మాయి ఆ దేవుడ్ని ప్రేమిస్తుండేది. రోజూ దేవుడికి మాలలు వేసేముందు ఒకసారి తాను వాటిని ధరిస్తుండేది. ఒకరోజు విష్ణుచిత్తుడు యిది చూశాడు. అలా ఒకరు ధరించిన మాలల్ని దేవుడికివేయడం అపచారంగా భావించి, ఆ రోజు వాటిని దేవుడికి అర్పించకుండా, కలతపడిన మనసుతో నిదురించాడు. ఆదేవుడు పూజారికి కలలో కనిపించి ఆ అమ్మాయి తనను ప్రేమిస్తున్నదనీ, తనకు ఆ అమ్మాయి ధరించిన మాలలే యిష్టమనీ తెలియజేసి; ఆ అమ్మాయిని శ్రీరంగానికి తీసుకువచ్చి, అక్కడ తనకిచ్చి వివాహం చేయవలసిందిగా కోరాడు. అలానేచేశాడు విష్ణుచిత్తుడు. విష్ణ్వారాధనను వ్యాప్తిచేయడానికై యీ గ్రంథంలో అక్కడక్కడ సందర్భోచితమైన ఉపాఖ్యానాలను చేర్చడం జరిగింది. విష్ణుచిత్తుడిని పవిత్రుడై, నిరాడంబరతతో కూడి, వినయ విధేయతలు గల భక్తుడుగా, పూజారిగా చిత్రించినవిధానం చాలా గొప్పగా వుంది. కొన్నికొన్ని చోట్ల యిది పెద్దన యొక్క ప్రవరుని పాత్ర చిత్రణనుకూడా మించిపోయింది. శ్రీకృష్ణ దేవరాయల శైలి గంభీరమై, ఉన్నత ప్రమాణాలతో పరిణతి చెందినట్టిది. అసాధారణ పదాలను యీయన వాడాడు. ఈతని వర్ణనలు సహజమైనవి. మానవ స్వభావాన్ని పరిశీలింప గలిగే అసాధారణ అంతర్దృష్టి యీయనకు

వున్నది ఈతని చిత్తవృత్తి గొప్పది. అభిప్రాయాలు నీతిబోధకాలు ఆచార వ్యవహారాలను గూర్చి, మతవిధానాలను గూర్చి, చక్కటి గ్రామీణ జీవితాన్ని పవిత్రమైన దేవాలయాలనుగూర్చి యీయన చేసిన అందమైన వర్ణనలు వాటికవే సాటి. ఆముక్తమాల్యదకు తెలుగు సాహిత్యంలో ఉన్నత పీఠం వుంది. సంస్కృతంలో నైషధం, కాశీఖండంలవలె యిదికూడా పండితులకు సైతం కొరుకు పడని గ్రంథం. సరియైన వ్యాఖ్యానాలు, విమర్శలు వుంటేనే తప్ప యిది సరిగా అర్థంకాదు. అందుచేతనే పాఠకులకు అర్థంకావడానికై పండిత వేదం వేంకటరాయశాస్త్రి సుదీర్ఘమైన వ్యాఖ్యానం దీనిపై వ్రాయవలసి వచ్చింది. హైదరాబాదుకు చెందిన శ్రీ వెల్దండ ప్రభాకరామాత్య ఆముక్తమాల్యదపై చాలా చక్కటి విమర్శనా గ్రంథాన్ని వ్రాశారు.

శ్రీకృష్ణదేవరాయలు తన ఆస్థానంలో అష్టదిగ్గజాలు అనే ఎనుమండుగురు కవులను పోషించే వాడని ఒకనమ్మకం వుంది. వీరిలో కొంతమంది శైవులు, మరికొంత మంది వైష్ణవులూను. కృష్ణదేవరాయలు జన్మతః వైష్ణవుడయినప్పటికీ, తనమతస్థుల ఎడ ఎప్పుడూ పక్షపాతం చూపించక, సర్వులను సమానంగానే చూసేవాడు. అంతేకాదు, ఏ కవినీ అతని కృతిని తనకు అంకితం యివ్వమని బలవంతం చేయలేదు. ఏ కవిఅయినా అంకితం చేస్తే దానిని తిరస్కరించలేదు కూడాను. ఇతని కాలంలో కవులకు చక్కటి ప్రోత్సాహం లభించింది. ఆంధ్రభోజుడని కృష్ణదేవరాయలును పిలిచే వారు ఉన్నతమైన, విశాలమైన భావాలు గలవాడు.

కృష్ణ దేవరాయల ఆస్థానంలోని మరొక కవి ధూర్జటి. జన్మతః యీయన శైవుడు. కాళహస్తీశ్వరుని భక్తుడు ఈయన కాళహస్తీశ్వరీయం అనే గ్రంథాన్ని వ్రాసి కాళహస్తీశ్వరునికి అంకితమిచ్చాడు. నిజానికి యిది ఒక స్థలపురాణమే అయినా దీన్ని ప్రబంధం అనవచ్చు. కాళహస్తీశ్వర శతకాన్ని కూడా యీయన వ్రాశాడు. ఇతని శైలి సరళమూ, సుందరమూ నైనది. ఇందులో కన్నప్పకథవంటి కొన్ని కథలు హృదయాన్ని కూడా కదలించి వేసే శక్తి గలవి. తన కృతిని కృష్ణదేవరాయలకు అంకితం చేయగలిగిన అదృష్టానికి నోచుకోని మరొకకవి అయ్యలరాజు రామభద్రుడు. సకలకథాసారం, రామాభ్యుదయం అనే గ్రంథాలను రచించాడు. కృష్ణదేవరాయలు చివరి రోజుల్లో యీ కవిని తన కథాసార సంగ్రహాన్ని ఆంధ్రీకరించమని అభ్యర్థించాడని తెలుస్తున్నది. అయితే ఆంధ్రీకృతం పూర్తికాక మునుపే కృష్ణదేవరాయలు మరణించాడు.

ఇందులో రాముడు, పురూరవుడు మొదలయినవారి చరిత్రలుగల తొమ్మిది ఆశ్వాసాలు వున్నాయి. ఇందులోని శైలి అంతగా పరిణతి చెందినది కాదు. కొన్ని వ్యాకరణ దోషాలుకూడా వున్నాయి. కాని ఆతర్వాత వ్రాసిన రామాభ్యుదయంలో మాత్రం పరిణత కనుపిస్తుంది. రామాయణాన్ని ప్రబంధానికి వీలుగా కుదించడంలోను, అలంకారాల వాడకంలోను కవి నైపుణ్యం యిందులో ద్యోతకమవుతుంది. దీనిని గొబ్బూరి నరసరాజుకు అంకితం చేశాడు. కృష్ణదేవరాయలు ఆస్థానంలోని మరొక కవి మాదయగారి మల్లన రాజశేఖర చరిత్రను రచించి, దానిని నాదెండ్ల అప్పయామాత్యుడికి అంకిత మిచ్చాడు. సరళమైన, చక్కటి శైలిలో యీ గ్రంథం నడిచింది. కృష్ణదేవరాయుని ఔన్నత్యాన్ని చాటి చెప్పే గ్రంథంయిది రాజాస్థానంలోని మరొక కవి అయిన చింతలపూడిఎల్లనరాయుడు రాధామాధవం, విష్ణుమాయానాటకం, తారకబ్రహ్మరాజీయం అనే గ్రంథాలను రచించాడు. రాధామాధవం రాజుమెప్పును బడసింది. రాజు కవికి 'రాధామాధవకవి' అనే బిరుదును కూడా యిచ్చాడు. తర్వాత చెప్పదగ్గకవి శంకుపాల నరసింహుడు. ఈయన మాంధాతరాజుకథ గల 'కవికర్ణరసాయనం' అనే గ్రంథాన్ని వ్రాశాడు. ఇందులో వ్యక్తం చేసినట్టు రాజులతో విసిగిపోయి ఆ గ్రంథాన్ని రంగనాయక స్వామికి అంకితంచేశాడు. దీనిలో మొదటిభాగమంతా శృంగారంతో కూడివుంది. సన్యాసిని కూడా ప్రేమికుడిగా మార్చి వేయగల శృంగారం యిందులో వుంది. తర్వాత భాగమంతా శాంతరసంతో నిండిపోయింది. శాంతరసం ఎంత ఎక్కువగా వున్నదంటే, యిదిచదివిన ప్రేమికుడు కూడా సాధువు అయిపోతాడు. తిమ్మరుసు మేనల్లుడు నాదెండ్ల గోపన ద్విపదలో గయోపాఖ్యానాన్ని వ్రాసి కృష్ణార్జున సంవాదం అని పేరుపెట్టాడు.

భావనకవి పంచతంత్ర కథలను వ్రాసి కృష్ణదేవరాయలు ఆస్థానంలోని సంగీత విద్వాంసుడయిన బండారు లక్ష్మీనారాయణకు అంకితమిచ్చాడు. ఈ కాలంలో యిదే యితివృత్తాన్ని తీసుకుని వ్రాసిన మరొకకవి బైచరాజు వెంకటనాథుడు. ఈయన తన గ్రంథాన్ని హరిహర నాథుడికి అంకితమిచ్చాడు ఇతని కవిత్వం యింతకుపూర్వం పంచతంత్రాన్ని వ్రాసిన యితర కవులను మించివుంది. ఈ కాలంలో కూడా కథాసాహిత్యంపై అభిరుచి కలిగి వుండడం మనకు ద్యోతకం కాగలదు.

## పద్యాల్లో నవల:

క్రీ. శ. 1530లో కృష్ణదేవరాయలు

మరణించిన తర్వాత కవులకు రాజాదరణ తగ్గినప్పటికీ, కొంతమంది చిన్నచిన్న రాజుల పోషణలో కొందరు ప్రసిద్ధులయిన కవులు తలఎత్తారు. వీరిలో పింగళి సూరన ముఖ్యుడు. సూరన కవితాప్రాభవం మూడు పుంతలు త్రొక్కింది. రాఘవ పాండవీయాన్ని యీయన వ్రాశాడు. ఆదినుండి, అంతంవరకు యీ గ్రంథంలో ప్రతిపద్యమూ ద్వంద్వార్థాల నిస్తూ అటు భారత కథనూ, యిటు రామాయణ కథనూ వ్యక్తంచేస్తున్నది. కవికి సంస్కృతాంధ్ర భాషలపైగల అజమాయిషీనీ, అతని తెలివితేటల్ని వ్యక్తం చేస్తుం దిది. చాలా కష్టసాధ్యమైన పని యిది. సూరన యీ గ్రంథాన్ని ఆకువీటి వెంకటాద్రికి అంకితం చేశాడు. ఇతని రెండవ గ్రంథం కళాపూర్ణోదయం; పద్యరూపంలో వున్న నవల యిది. ఇందులో నారదుడు, రంభ, నలకూబరుడు, తుంబురుడు, కృష్ణుడు, బ్రహ్మ, సరస్వతి పేర్లు కనిపిస్తున్నప్పటికీ ఏ సంస్కృత పురాణంగాని, కావ్యంగాని ఆధారంగా తీసుకోకుండా స్వతంత్రంగా రచించిన రచన యిది. ఒకదానితో ఒకటి సంబంధంగల అనేక కథలు కలిసి మొత్తంమీద చాలా అందాన్నిస్తుంది. సూరన సృష్టి, కల్పనను మలిచే నేర్పు, కవితాశక్తి కళాపూర్ణోదయంలో అద్వితీయాలుగా కనిపిస్తాయి. సంఘటనలను ఆకస్మికంగా సృష్టించడంలోను, పాత్రల్ని ఒకదానితో ఒకటి సంబంధం వుండేటట్లు మలచడంలోను, పాత్రోచిత భావ ప్రకటన చేయడంలోను కవి దీనిని ఒకగొప్ప కళాఖండంగా రూపొందించాడు. ఇందులోని యితివృత్తం అసాధారమైనది, కవి స్వంతగా ఆలోచించినదీను. కథలో ఎక్కడ బడితే అక్కడ పాఠకుడిలో ఉత్కంఠను రేకెత్తించే సంఘటనలు కోకొల్లలు. కవియొక్క కవితాశక్తికి యివి ఉదాహరణలు. వివిధ రకాల ప్రేమను ఉత్కృష్టమైన మార్గాల్లో వాటిని ప్రకటించడంలో చూపిన కౌశలం అద్వితీయమైనది. ప్రేమను కాపాడుకోవడానికి సంతోషంగా కలభాషిణి చావును ఆహ్వానించడం ఉదారతను, నాగరితను తెలియజేస్తున్నా పిచ్చిప్రేమను వ్యక్తం చేస్తుంది. భార్య ఆభరణాలు అలంకరించుకున్నప్పుడు గాక, అతి నిరాడంబరంగా వస్త్రాలు ధరించినప్పుడే సాలీనుడు అందాన్ని గుర్తించడం స్వాభావికమైన, అమాయకపు ప్రేమను వ్యక్తం చేస్తుంది. శల్యాసురుడు ప్రేమకై ప్రాణాలు తెగించడానికి సిద్ధపడతాడు. రంభ, నలకూబరుల ప్రేమ శృంగారాన్ని వ్యక్తం చేస్తుంది. బ్రహ్మ సరస్వతుల ప్రేమ అసంబద్ధతను వ్యక్తపరుస్తుంది.

షేక్స్పియరు, సూరనలు యిరువురూ ఒకే శతాబ్దంలో, జీవించి వుంటూ, ఆరువేల మైళ్ళ అంతరం యిరువురిమధ్య వుండి, భిన్నభిన్న వాతావరణాలలో పెరిగికూడా ఒకేరకంగా ఆలోచించి, ఒకే యితివృత్తాన్ని తీసుకుని వ్రాయడం అనేది ఆశ్చర్యకరమైన అనుకోని సంఘటన అనకతప్పదు. షేక్స్పియరు 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్' అనే ఆంగ్ల గ్రంథాన్ని వ్రాసి అందులో ఒకేపోలిక గల కవలల్ని ప్రవేశపెట్టాడు. సూరన నలకూబరుడు, రంభలో పోటీ నాయకుల్ని, నాయకురాళ్ళను సృష్టించాడు.

వివిధ భాషల్లోకి అనువదించ దగిన గ్రంథం యిది. అలాచేస్తే దీని విలువను విదేశీయులు కూడా గుర్తించే అవకాశం వుంది. క్రీ. శ. 1560 ప్రాంతంలో రాజ్యపాలన చేసిన నంద్యాల రాజు కృష్ణుడికి యీ గ్రంథాన్ని సూరన అంకితం చేశాడు. సూరన మరికొంతకాలం ముందు జీవించి వుండి, తన గ్రంథాన్ని విజయనగర ప్రభువు శ్రీకృష్ణదేవరాయలకు అంకితం చేసి వుంటే సూరన చాలా అదృష్టవంతుడై వుండేవాడు. సూరన మూడవ గ్రంథం ప్రభావతీ ప్రద్యుమ్నం. రాక్షసరాజు వజ్రనాభుని కుమార్తెహూ, శ్రీకృష్ణుని కుమారుడు ప్రద్యుమ్నుడికీ సంబంధించిన శృంగార కథ యిది. హరివంశంనుండి యీ కథను తీసుకుని పాత్రల్ని పోషించి, సంభాషణలను ప్రవేశపెట్టి, సంఘటనల్ని ఉచితరీతిలో కూర్చి ఒక ప్రబంధంగా రూపొందించాడు. సూరన కవితాశైలి చాల సరళమైనదీ, సొంపైనదీను. సమయాన్ని బట్టి దానికి తగినట్లు మారుతుంది. ఇతని నాలుగవ గ్రంథం గరుడపురాణం. ఇప్పు డది లభ్యం కావడంలేదు.

## భట్టుమూర్తి

ఒకవైపు అల్లసాని పెద్దనకు, మరోవైపు పింగళి సూరనకు పోటీగా నిలవగల కవి భట్టుమూర్తి. ఈయనకే రామరాజభూషణుడు అని మరొకపేరు వుంది. రామరాజు ఆస్థానానికి భట్టుమూర్తి ఒక అలంకారవంటివా డని భావించడం వలన, అతనికి ఆ పేరు వచ్చింది. 'వసుచరిత్ర', 'హరిశ్చంద్ర నలోపాఖ్యానం' అనే రెండు ప్రబంధాలను యీయన రచించాడు. మొదటిది మనుచరిత్రకు పోటీ. రెండవది రాఘవ పాండవీయానికి పోటీ. వసుచరిత్ర కథ చాలాచిన్నదే. వసురాజుకూ; శుక్తిమతి నదీ, కోలాహలుడనే పర్వతరాజులకు జన్మించిన గిరికకూ, సంబంధించిన ప్రేమ కథ; చివరకు ఇది వివాహంతో ముగియడం. ఇదీ యిందులోని యితివృత్తం. మహాభారతం నుండి కథను తీసుకుని, వర్ణనలు మొదలయినవాటిని చేర్చి, ప్రబంధంగా రూపొందించాడు కవి. దీనిని క్రీ. శ. 158 ప్రాంతంలో పెనుగొండను పరిపాలించిన

రామరాజు కనిష్ఠ సోదరుడు తిరుమల రాయునికి అంకితం చేశాడు. వసు చరిత్రను దాని శైలికి, పదగుంభనానికి, భాషపై అధిపత్యానికి, కల్పనకు తెలుగు పండితులు ఎంతగానో మెచ్చుకుంటారు. సంస్కృత కావ్యాలతో సరిసమానంగా తులతూగుతుంది యీ గ్రంథం. నిజానికి యిది సంస్కృతంలోకి అనువదించ బడింది. అలంకరణలో దీనిని మించిన ప్రబంధం తెలుగులో మరొకటిలేదు. ప్రతి పద్యమూ ఒక్కొక్క వజ్రం అనడంలో ఎలాంటి సందేహమూలేదు. కాని యిది మనుచరిత్రతో మాత్రం సరితూగలేదు. దాని తర్వాతనే వసుచరిత్రను చెప్పవలసి వుంటుంది. సూరన రాఘవ పాండవీయం వ్రాసిన అనంతరం దానికి అనుకరణగా హరిశ్చంద్ర నలోపాఖ్యానాన్ని భట్టుమూర్తి రచించాడు. ద్వర్థి కావ్యంగా కూడా, సూరన రచన తర్వాతనే దీనిని చెప్పవలసి వుంటుంది. సంస్కృతంలో విద్యానాథుని ప్రతాపరుద్రీయానికి అనుకరణగా నరసింహ భూపాలీయాన్ని వ్రాశాడు. రామరాజ భూషణుడు గొప్పకవి. తెలుగుసాహితీ సామ్రాజ్యంలో ఆయనకు ఉన్నతపీఠం వేయబడినది.

ఈ కాలంనాటి ప్రసిద్ధుడైన మరొక కవి తెనాలి రామలింగడు. విజయనగర సామ్రాజ్యపు రాజధానిని చంద్రగిరికి మార్చిన వెంకటపతిరాయలకాలంనాటివాడు యీయన. రామకృష్ణకవి క్రీ. శ. 1585 ప్రాంతంలో పాండురంగ మాహాత్మ్యం అనే పురాణాన్ని వ్రాసి వేదాద్రిమంత్రికి అంకితం చేశాడు. తెనాలిరామకృష్ణుడు ఆంధ్రదేశంలోనే కాక తమిళ, కన్నడ దేశాలలో సహితం హాస్య కవిగా ప్రసిద్ధికెక్కినప్పటికీ, యీతని రచనల్లో హాస్యం మనకు కానరాదు. మహారాష్ట్రంలోని పండరీపురంలో నెలకొన్న పాండురంగడు అనబడే విష్ణువుయొక్క మహత్వాన్ని తెలియజేసే పురాణకథలు అనేకం యిందులో వున్నాయి. ఈ కథలన్నీ మామూలు మనిషి కథలుగావుండి ఆసక్తిని రేకెత్తించేవిగా వున్నాయి. రామకృష్ణుని కవితాశక్తి అమోఘమైనది. అయితే కొద్దిగా తికమకలు పెడుతుంది. భావ ప్రకటనలు సూటిగా వుండవు. కాని ఉన్నతప్రమాణాలు కలిగి అతని వ్యక్తిత్వాన్ని తెలియజేస్తాయి. ఈ గ్రంథంలోని కథలన్నిటిలోకీ నిగమశర్మ కథ ముఖ్యంగా చెప్పుకోదగ్గకథ. నిగమశర్మ అనబడే బ్రాహ్మణుడు పాపపంకిలమైన జీవితాన్ని గడిపి, చివరకు పండరీపురంలో చనిపోతాడు. అతని ఆత్మను తీసుకుపోవలెనని యమునిభటులూ, విష్ణుభటులూ— యిరువురూ వస్తారు. పాపాలు చేశాడు గనుక అతని ఆత్మ తమకు చెందుతుందని యమభటులూ, పవిత్రమైన పండరీపురంలో చనిపోయాడు గనుక తమకు చెందుతుందని విష్ణుభటులూ వాదోపవాదాలు చేస్తారు. చిట్టచివరకు అతనిఆత్మను వైకుంఠానికి తీసుకువెళ్ళడం జరుగుతుంది. కథలో నిగమశర్మ సహోదరి పాత్ర చాలాముఖ్యమైనది. ఆమెపాత్ర చిత్రణ అద్వితీయమైనది. విచిత్రమైన ఆంధ్రసహోదరిని వ్యక్తం చేస్తుంది. రామకృష్ణుడు వైష్ణవమతాన్ని స్వీకరించడానికి ముందుగా ఉద్భటారాధ్యచరిత్రను రచించాడు. ఘటికాచల మాహాత్మ్యం అనే గ్రంథాన్నికూడా యీయన వ్రాశాడు.

ఈ శతాబ్దంలో తరిగొప్పుల మల్లన చెప్పుకోదగిన కవి. ఈయన చంద్రభాను చరిత్రను వ్రాశాడు. ఇందులో అక్కడక్కడ తన కల్పనా శక్తిని చూపెట్టాడు. ఇంతకు పూర్వపు కవులను యీయన అనుసరించాడు. భాష స్వచ్ఛమైనది, శైలిచక్కనిది.

ఈ కాలంలో కొన్ని పురాణాలుకూడా వచ్చాయి. 16 వ శతాబ్దపు పూర్వార్ధంలో వెన్నెలకంటి సూరన విష్ణుపురాణాన్ని ఆంధ్రీకరించి రావూరి రాఘవరెడ్డికి అంకితమిచ్చాడు. అనువాదం చాలా స్వేచ్ఛగాను, మెచ్చుకోదగ్గదిగాను వుంది. శైలి సరళమైనది. భాష స్వచ్ఛమైనది. ఈ పురాణంలోని యితివృత్తం కొంతవరకు హరివంశం, భాగవతాలతో పోలివుంది. కొన్ని కథలు తరచు వాడుకలో వున్నవి. అయితే ఆకవులతో సూరనను పోల్చదగ్గవాడు కాదు.

ఈ యుగంలో కొంతమంది కవులు యింతకుపూర్వం వచ్చిన గ్రంథాలను కొత్త కొత్త రూపాల్లో—చంపూకావ్యాన్ని ద్విపద కావ్యంగాను, ద్విపదను చంపూకావ్యంగాను, ఒక్కొక్కప్పుడు ఉన్నగ్రంథాన్నే సంక్షిప్తంగాను—రచించడానికి ఆసక్తిని ప్రదర్శించారు. మొదట్లో వీరశైవ కవులకు యిదొక సరదాగా వుండేది. ఆ తర్వాత తర్వాత యితర కవులకుకూడా యీ అలవాటు వ్యాపించింది. క్రీ. శ. 1547 ప్రాంతం అరవీటి రాజవంశానికి చెందిన తిరుమలరాజు, భాగవతాన్ని సంక్షిప్తంగా చంపు ద్విపదలు రెండు రూపాల్లోనూ తిరగవ్రాయమని దోనేరు కోనేరుకవిని కోరాడు. కోనేరుకవి అలానే వ్రాసి చంపూగ్రంథాన్ని తిరుమలరాజు తండ్రి స్వర్గీయ తిమ్మరాజుకు. ద్విపద గ్రంథాన్ని తిరుమలరాజు కనిష్ఠసోదరుడు చినతిమ్మనరాజుకు అంకితంచేశాడు. ఈ రెండుగ్రంథాలకు కవి బాలభాగవతములు అని పేరుపెట్టాడు. ఈ కాలంలో వచ్చిన ఇటువంటి మరొకగ్రంథం ఆతుకూరిమొల్ల రచించిన రామాయణం. రాముడికథను సరళమైన శైలిలో ప్రబంధంగా సంక్షిప్తరూపంలో ఈమె వ్రాసింది. నెల్లూరుజిల్లా మల్లేశ్వరంలోని శ్రీకంఠ మల్లేశ్వర దేవుని భక్తురాలు యీమె. ఇదేకథను తీసుకుని వ్రాసిన అనేక

మంది కవుల రచనలనుకూడా యీ గ్రంథం అనేక విషయాల్లో మించివుంది. తెలుగు కవయిత్రులలో యీమె రెండవది. అదే విధంగా శంకరకవి, వీరశరభకవి విడివిడిగా గౌరనవ్రాసిన హరిశ్చంద్ర చరిత్రను చంపూమార్గంలో తిరగవ్రాశారు.

## తాళ్ళపాక కుటుంబం

పిడపర్తి, తాళ్ళపాక కుటుంబాలకు చెందిన కవులు మత విషయకంగా ఒకరికొకరు విరోధులు. ఇరు కుటుంబాలవారూ సిద్ధహస్తులైన కవులే. పిడపర్తివారు వీరశైవమతాన్నీ, తాళ్ళపాకవారు వైష్ణవమతాన్నీ ప్రచారం చేస్తుండేవారు. ఈ యిరువురుకూడా యీ ప్రచారంలో ఎన్నో గ్రంథాల్ని సృష్టిస్తూనే వున్నారు. ప్రజాభిమానాన్ని పొందడానికి వీరిరువురూ ద్విపదను తమ కవిత్వంలో వుపయోగించారు. పాల్కురికి సోమనాథుని బసవపురాణాన్ని వీలయినంతమటుకు అందులోని భాషనే వాడి పిడపర్తి సోమన చంపూ మార్గంలో తిరిగివ్రాశాడు. బసవుకి గురువయిన అల్లమప్రభువు బోధలు, అతని గొప్పతనం, జీవితచరిత్ర మొదలయినవి గల ప్రభులింగలీలలు అనేగ్రంథాన్ని పిడపర్తి సోమన ద్విపదలో వ్రాశాడు. ఆ తర్వాత పిడపర్తి సోమన కనిష్ఠ సోదరుని కొడుకు బసవన ప్రభులింగ లీలలను చంపూ మార్గంలో అయిదు ఆశ్వాసాలలో వ్రాశాడు. వైష్ణవ మతంలో, తాళ్ళపాక అన్నమాచార్యుని కొడుకు పెద తిరుమలరాయుడు వెంకటేశ్వర స్వామిపై పాటలను, వెంకటేశ్వర వచనములు అనే దండకాన్ని, ఒక శతకాన్ని, పాల్కురికి సోమన వ్రాసిన బసవోద్ధరణవలె వెంకటేశ్వర స్వామిపై ఒక ఉద్ధరణను రచించాడు. వీరశైవ కవులు త్రొక్కినట్టుగా తాళ్ళపాక కవులుకూడా అన్ని సాహిత్య ప్రక్రియలను త్రొక్కారు. వివిధ సాహిత్య ప్రక్రియల్లో గ్రంథరచన కొనసాగించి, తమకు మత విషయకంగా వ్యతిరేకులయిన వర్గంవారికి పోటీగా నిలిచారు. నిజానికి వీరు ఆట్టే వ్రాయనప్పటికీ ఈ విధంగా వీరి శత్రుత్వం తెలుగు సాహిత్యపు వివిధ శాఖల వికాసానికి తోడ్పడింది. పెద తిరుమలరాయుని కొడుకు చిన్నన్న అష్టమహిషి కల్యాణం, ఉషాపరిణయం, పరమయోగివిలాసం అనే మూడు కావ్యాలను ద్విపదలో వ్రాశాడు. వీనిలో మొదటిది శ్రీకృష్ణుడు ఎనమండుగురు పట్టమహిషులను పెళ్ళి చేసుకోవడానికి సంబంధించినది. ద్విపద రచనలో యీ కవి పేరొందాడు. చిన్నన్న కనిష్ఠసోదరుడు చిన తిరుమలయ్య కూడా తన తండ్రి తాతలవలెనే వెంకటేశ్వర స్వామిపై అనేక ఆరాధన, ప్రేమగీతాలను వ్రాశాడు. వెంకటేశ్వర స్వామిపై ఎనిమిది భాషలలో అష్టభాషా దండకం అనే దండకాన్ని వ్రాశాడు. వీరశైవకవులు, వైష్ణవ కవులుకూడా తెలుగులో శతకాలను, ఉద్ధరణలను, ద్విపద చంపూ కావ్యాలను రచించారు. అయితే తాళ్ళపాక కవులు వీటికితోడు దండకాలను, పాటలను కూడా వ్రాసి పిడపర్తి కవులను యీ విషయంలో అధిగమించారు. ఇవి కేవలం ప్రచారానికే వుపయోగించాయి తప్ప సాహిత్యావసారల నేమీ తీర్చలేకపోయాయి. ఈ సందర్భంలో ఒక విషయం చెప్పవలసి వుంది. విజయనగరానికి చెందిన అళియ రామరాజు మేనల్లుడు తిమ్మరాజు యించుమించు యిదేకాలంలో పరమయోగి విలాసాన్ని చంపూమార్గంలో రచించాడు.

క్రీ. శ. 1530లో కృష్ణదేవరాయలు మరణించిన అనంతరం తెలుగు కవులను ఆదరించడం క్రమక్రమంగా మృగ్యమైపోయింది. క్రీ. శ 1565లో కళ్ళికోటయుద్ధంలో విజయనగర ప్రభువులు ఓడిపోవడంతో వారి గౌరవ, అధికారాలు అంతరించిపోయాయి. 16వ శతాబ్దారంభంనుండి గోల్కొండ నవాబులు తెలంగాణాలో పరిపాలనలో క్రమక్రమంగా సిద్ధహస్తులై, ఆంధ్రులను అన్ని విషయాల్లోనూ ఉదారబుద్ధితో చూస్తూ, తెలుగు కవులను పోషించి, ఆంధ్రులలో బాగా పేరుప్రతిష్ఠల్ని సంపాదించుకోవడం మొదలుపెట్టారు. ఇబ్రహీం కులీ కుతుబ్‌షా అలాంటి వారిలో ఒకడు. ఈయననే ఆంధ్రులు మల్కిబ్రహీం అనేవారు. ఈయన క్రీ. శ. 1550 నుండి 1580 వరకు 30 యేళ్ళు రాజ్యపాలన చేశాడు. ఈయన రాజ్యాధికారాన్ని చేపట్టే ముందు తన తండ్రిని చంపిన సోదరునికి భయపడి విజయనగర పట్టణంలో తొమ్మిదేళ్ళపాటు తలదాచుకున్నాడు. ఆ రోజుల్లో రామరాజు విజయనగరాన్ని పరిపాలిస్తుండేవాడు. ఇబ్రహీం కులీ కుతుబ్‌షా ఆంధ్ర రాజధానీ నగరంలో తలదాచుకున్న రోజుల్లో యితనికి తెలుగుప్రజలంటేనూ, తెలుగు సాహిత్యం అంటేనూ అభిరుచి యేర్పడింది. రామరాజును తళ్ళికోట యుద్ధం ద్వారా సింహాసనాన్నుండి తొలగించే ప్రయత్నంలో కుతుబ్‌షా సహాయపడినప్పటికీ నిజానికి మత సహనం గల నవాబు యీయన. విజయనగరంలో కవులపోషణ సన్నగిల్లినప్పుడు యీయన తెలుగు కవులను పోషించాడు.

శ్రీకృష్ణ దేవరాయలకు సమకాలీనుడైన చరికొండ ధర్మన చిత్రభారతాన్ని వ్రాసి 1504 ప్రాంతంలో ముసల్మానులను పారద్రోలి ఓరుగల్లును హస్తగతం చేసుకుని పరిపాలన కొనసాగిస్తున్న చిత్తపఖాన్‌వద్ద మంత్రిగావున్న యనమచింతల పెద్దనామాత్యునికి అంకిత మిచ్చాడు. బ్రహ్మాండ పురాణంనుండి యితివృత్తాన్ని ఎన్నుకున్నాడు. తుల్యుడు తపస్సు చేస్తుండగా ఇంద్రుడు పంపించిన రంభ ఏతెంచి, అతని తపస్సును భగ్నంచేసింది. తుల్యుడుకోపించి గుర్రం కమ్మని శపించాడు. దానిప్రకారం ఆమె కుండినపురప్రభువు చతుర్దనుడివాహన మయ్యింది. ఒకరోజు రాజు గుర్రం మీద వెళ్తుండగా దాని నురుగు యమునానదిలో అర్ఘ్యమిస్తున్న శ్రీకృష్ణుని చేతిలో పడింది. ఆ తరువాతికథ గయోపాఖ్యానం కథలా సాగిపోతుంది.



## "కష్టే...ఫలే!..."

మధిర భానుమూర్తి

నిన మొన్నటిదాక ఇచట
నీరు లేదు నారు లేదు
నేడిట నేయెడ జూచిన
పంటతల్లి కనుల విందె - ॥నిన॥

సాగరమున కలిసి పోవు
సకల నదుల జలమ్ములను
భూములపై మళ్ళించుక
బంగారము పండించిరి - ॥నిన॥

కుల భేదము సమసిపోయి
కలవారును లేనివారు
కాయకష్టమును చేయగ
కలకల లాడెను ధరిత్రి - ॥నిన॥

చిఱుఖండము లన్ని కలిసి
సహకార క్షేత్రములై
కలిసి మెలిసి పనిచేయగ
కామితార్థముల నొసంగె - ॥నిన॥

నిన మొన్నటిదాక లేని
నీరు నారు కలిగె నిచట
నేడిట నేయెడ చూచిన
బంగరు పంటల తల్లే! - ॥నిన॥

---

(58 వ పేజీ తరువాయి)

ఋణసహాయం పొందుతారు. వివిధవృత్తుల లోని కేంద్రాలకు సంబంధించిన సుమారు 800 మంది మాజీ శిక్షితులకు గ్రాంటు మంజూరు చేయటానికి మరో రూ. 2 లక్షలు ప్రత్యేకించారు.

### విద్యా వ్యాప్తి

ప్రాథమికపాఠశాలల్లో పిల్లలకుఉచితంగా పాలు సరఫరా చేయటానికి సంబంధించిన పథకాన్ని అమలుపరచడానికి రాష్ట్రప్రభుత్వం రూ. 2 లక్షలు మంజూరు చేసింది ప్రస్తుత సంవత్సరంలో ప్రాథమిక పాఠశాలల సంఖ్య 52,083 కు హెచ్చింది. పాఠశాలకు వెళ్ళే పిల్లల శాతం 6-11 సంవత్సరాల వయః వర్గంలో 1961-62 వ సం. లో 48 వుండగా ఈ శాతం 1962-63 వ సం. లో 52 కు పెరిగింది. 40 హయ్యర్ సెకండరీ పాఠశాలలను, రాష్ట్ర ప్రభుత్వంనుంచి సహాయక గ్రాంటులుపొందే విద్యాసంస్థల జాబితాలో చేర్చు కొని వాటికి రూ. 1,51,248 ల మేరకు నిర్వహణ గ్రాంట్లను మంజూరుచేశారు.

### ప్రాసెసింగ్ సలహామండలి

రాష్ట్రంలో ప్రాసెసింగ్ యూనిట్లకొరకు ప్రాజెక్టులను, స్థలాలను ఎన్నికచేసేందుకు రాష్ట్రప్రభుత్వం, యు. పి. సహకార ప్రాసెసింగ్ సలహామండలిని నియమించింది. ★

(62 వ పేజీ తరువాయి)

ఆదాయాన్ని గురించి పూర్తి లెక్కలు లభించలేదు.

శ్రీ కె. సైబన్న, నీవాదుగం, మక్తాల్ తాలూకా, మహబూబ్ నగర్ జిల్లా.

ప్ర: మక్తాల్ తాలూకా "సోమేశ్వర బండ" అనే గ్రామం దగ్గరమక్తాల్ తాలూకాకు పశ్చిమ దిశ మూడు మైళ్ళదూరంలో వాగుకు అడ్డంగా ఒక ఆనకట్ట నిర్మించాలని ఉద్దేశించడం జరిగింది. ఈ ఆనకట్ట ఎత్తు ఎంత? దీని క్రింద సాగు అయ్యే భూమి ఎంత?

సమా: మీరు చెప్పిన వాగు పి. డబ్ల్యు. డి. రికార్డుల ప్రకారం మంగనూరు వాగు అని తెలుస్తున్నది. ఈ వాగుపై ఒక మధ్యరకం ఆనకట్టను కట్టాలని మొదట్లో పరిశీలించడం జరిగింది. కాని ఆంధ్ర ప్రదేశ్ సరిహద్దుల లోపల యీ వాగు మీద నీటి రిజర్వాయరును ఏర్పాటు చేయటానికి అవకాశాలు లేని కారణం చేత యీ ఆలోచనను విరమించడం జరిగింది. దీని బదులుగా మళ్ళింపు పథకాలు పరిశీలించ బడుతున్నాయి. నాగిరెడ్డిపల్లి గ్రామంవద్ద నిర్మించనున్న ఆనకట్ట అలాంటి వాటిలో ఒకటి. వీటి పరిశీలనలు యింకా జరుగుతూనే వున్నందువల్లనూ, వీటికి సంబంధించిన సాంకేతిక వివరాలు యింకా పూర్తి కానందువల్లనూ ఆనకట్ట ఎత్తు, దీని కింద సాగయ్యే భూమి వివరాలు తెలియ జేయడం సాధ్యంకాదు. ★



ఆదిలాబాదుజిల్లా

*పశువుల ప్రథమ చికిత్సాకేంద్రం :*

నిర్మల్ పంచాయతీ సమితిలోని కంకపూర్ గ్రామంలో ఒక పశువుల ప్రథమ చికిత్సాకేంద్రం ప్రారంభించబడింది.

అనంతపురం జిల్లా

*మేలుజాతి విత్తనాల పంపకం :*

ముదిగుబ్బ పంచాయతీ సమితిలో జనవరి నెలలో 185 మణుగుల మేలుజాతివిత్తనాలు, 926 మణుగుల రసాయనిక ఎరువులు పంపిణీ చేయబడ్డాయి.

చిత్తూరు జిల్లా

*రసాయనిక ఎరువులు :*

నగరి పంచాయతీ సమితిలో వ్యవసాయోత్పత్తిని పెంచడానికై 2,098 మణుగుల రసాయనిక ఎరువులను రైతులు జనవరి నెలలో వుపయోగించారు. మేలురకపు వ్యవసాయ కార్యక్రమాలను రైతులకు తెలియజెప్పడానికని మొత్తం 27 ప్రదర్శనలుకూడా ఏర్పాటు చేయబడ్డాయి.

తూర్పుగోదావరి జిల్లా

*ఎరువుల పంపిణీ :*

జనవరినెలలో సీతానగరం పంచాయతీ సమితిలో 640 మణుగుల ఎరువులు, 69 పౌనుల రసాయనిక క్రిమి సంహారక మందులు రైతులకు పంపిణీ చేయడం జరిగింది

ఇదేకాలంలో 21 ఫర్లాంగుల పొడవుగల మట్టిరోడ్డును నిర్మించడం జరిగింది. మరొక 6 ఫర్లాంగుల మట్టిరోడ్డు మరమ్మతు చేయబడింది.

పెద్దాపురంపంచాయతీ సమితిలో 24 మణుగుల ధాన్యపు విత్తనాలు, 1,195 మణుగుల చెఱకువిత్తనాలు, 179 టన్నుల రసాయనిక ఎరువులు, 10 ఆధునిక వ్యవసాయ పరికరాలు జనవరి నెలలో పంపిణీ చేయబడ్డాయి.

గుంటూరు జిల్లా

*బావి నిర్మాణం :*

ఇప్పూరు పంచాయతీ సమితిలో జనవరి నెలలో ఒక మంచినీటి బావిని త్రవ్వడం జరిగింది. మరో ఏడుబావులు మరమ్మతు చేయబడ్డాయి. ఇదే నెలలో 11 ఫర్లాంగుల మట్టిబాటను వేయడం, మూడు కర్ర వంతెనలను నిర్మించడం జరిగింది.

*కమ్యూనిటీ హాలు :*

పిడుగురాళ్ళ పంచాయతీ సమితి బ్రాహ్మణపల్లిలో కమ్యూనిటీహాలుకు కలెక్టరు ప్రారంభోత్సవం చేశారు.

*పంచాయతీఘర్ :*

ఈమని పంచాయతీ సమితి శృంగారపురంలో ఒక పంచాయతీఘర్ నిర్మించబడి, ప్రారంభించబడింది.

ఖమ్మం జిల్లా

*పశుచికిత్సా కేంద్రం :*

బూర్గంపాడు పంచాయతీ సమితి మనుగూరులో ఒక పశుచికిత్సా కేంద్రానికి కలెక్టరు ప్రారంభోత్సవం చేశారు.

*రైకంపాడు ప్రాజెక్టు :*

రైకంపాడు ప్రాజెక్టుకు జిల్లా పరిషత్తు చైర్మను శంకుస్థాపన చేశారు.

*ప్రాథమిక ఆరోగ్యకేంద్రం*

కల్లూరులో ప్రాథమిక ఆరోగ్యకేంద్రం కొత్తభవనానికి ప్రణాళికా సంఘం కార్యదర్శి ప్రారంభోత్సవం చేశారు.

మహబూబ్‌నగర్ జిల్లా

*శిక్షణశిబిరం :*

జనవరి 30 వ తేదీనుండి మూడురోజులపాటు గద్వాల్‌పంచాయతీ సమితి ఆధ్వర్యంలో గ్రామసహాయకుల శిక్షణ శిబిరం ఒకటి ఉప్పేర్‌లో నిర్వహించబడింది. వ్యవసాయ కార్యక్రమాలలోను, సమాజ వికాస కార్యక్రమాలలోను సమీప గ్రామాలకు చెందిన 50 మంది సహాయకులకు శిక్షణ యివ్వడం జరిగింది. శిశుప్రదర్శనకూడా ఒకటి నిర్వహించబడింది.

నల్గొండ జిల్లా

*శిక్షణ శిబిరం :*

నక్రేకల్ పంచాయతీ సమితిలో జనవరి 29 నుండి మూడురోజులపాటు గ్రామసహాయకుల శిక్షణ శిబిరం ఒకటి నిర్వహించబడింది. ఇందులో యాభైమంది సహాయకులకు శిక్షణ యివ్వడం జరిగింది.

దేవరకొండ పంచాయతీ సమితి పులిచెర్లలో మూడురోజులపాటు గ్రామసహాయకుల శిక్షణశిబిరం నిర్వహించబడింది.

ప్రగతి పథంలో

*యువక మండలి*

మునుగోడి పంచాయతీ సమితి తుమ్మల పల్లి గ్రామంలో యువక మండలి ఒకటి ప్రారంభించబడింది

*గ్రామీణ స్వచ్ఛంద సేవాదళం :*

చౌటుప్పల్ పంచాయతీసమితిలో యింత వరకు వెయ్యిమంది స్త్రీలతోసహా మొత్తం 7,474మంది గ్రామీణ స్వచ్ఛంద సేవా దళాల్లోను, రక్షణ శ్రామిక బ్యాంకులలోను తమ పేర్లను నమోదు చేసుకున్నారు.

*గ్రామస్థుల రేడియోగోష్ఠులపై సెమినారు :*

జనవరి 21వ తేదీన నల్గొండలో గ్రామస్థుల రేడియో గోష్ఠులపై ఒక సెమినారు ఏర్పాటు చేయబడింది. ఆందరు బ్లాకుడెవలప్‌మెంటు అధికారులూ, సాంఘిక విద్యా కార్యకర్తలూ, ముఖ్యసేవికలూ ఈ సెమినారుకు హాజరయ్యారు.

నెల్లూరు జిల్లా

*యువజనోత్సవాలు :*

కొండపి గ్రామంలోని ఉత్సాహవంతులైన యువకులూ, యువకమండలి కలిసి జనవరి 25వ తేదీనుండి మూడురోజుల పాటు యువజనోత్సవాలను నిర్వహించారు.

*ఎలిమెంటరీ పాఠశాల భవనం :*

శ్రీధనమల్లిలో పంచాయతీసమితి ఎలిమెంటరీ పాఠశాల భవనానికి కలెక్టరు శంకుస్థాపన చేశారు.

*శిక్షణ శిబిరం*

శ్రీధనపల్లి గ్రామంలో జనవరి 21వ తేదీనుండి మూడురోజులపాటు గ్రామసహాయకుల శిక్షణ శిబిరంఒకటి నిర్వహించబడింది. ఈ శిబిరానికి కలెక్టరు ప్రారంభోత్సవం చేశారు.

నిజామాబాదు జిల్లా

*రోడ్ల నిర్మాణం :*

భన్స్‌వాడ పంచాయతీ సమితి మాగి పంచాయతీలోని గోర్గల్‌గ్రామంలో గ్రామీణ స్వచ్ఛంద సేవాదళ సభ్యులు, రక్షణశ్రామిక బ్యాంకు సభ్యులు కలిసి పూర్తిగా స్వచ్ఛందంగా 200 అడుగుల రోడ్లను నిర్మించుకున్నారు.

భన్స్‌వాడ పంచాయతీ సమితి తాలూకు బుర్గుల్ పంచాయతీలోని తురకపల్లి గ్రామంలో గ్రామీణ స్వచ్ఛందసేవాదళ సభ్యులు, రక్షణశ్రామిక బ్యాంకి సభ్యులు కలిసి గ్రామాన్నికలిపే అరఫర్లాంగు రోడ్డును నిర్మించారు.

శ్రీకాకుళం జిల్లా

*సహకార శిక్షణ శిబిరం :*

ఫిబ్రవరి 6వ తేదీన షేర్‌మహమ్మద్‌పూర్ బ్లాకులో ఆరురోజులపాటు సహకార సంఘాల సభ్యుల కొరకు నిర్వహించే శిక్షణ శిబిరానికి ప్రారంభోత్సవం జరిగింది.

*గ్రామలక్ష్మి శిక్షణ శిబిరం*

కంచిలి గ్రామంలో పదిహేను రోజులపాటు గ్రామలక్ష్మి శిక్షణశిబిరం నిర్వహించబడింది సోంపేట పంచాయతీసమితి యీ శిబిరాన్ని నిర్వహించింది.

విశాఖపట్నం జిల్లా

*పారిశ్రామిక ప్రదర్శనం :*

కె. కోటపాడు బ్లాకులో యేటాజరిగే ఉత్సవంతో కలిపి రెండు రోజులపాటు పారిశ్రామిక ప్రదర్శనం ఒకటి ఏర్పాటు చేయబడింది.

*గ్రామసహాయకుల శిక్షణ శిబిరాలు :*

శృంగవరపుకోటబ్లాకులో అంబాయ్‌దానపాలెంలో మూడురోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం నిర్వహించబడింది. గ్రామస్థులు స్వచ్ఛందంగా పనిచేసి నాలుగు ఫర్లాంగుల రోడ్డు నిర్మించుకున్నారు.

గంపరాయి పంచాయతీ సమితిలోని పెదబయులు గ్రామంలో జనవరి 27నుండి మూడు రోజులపాటు గ్రామసహాయకుల శిక్షణ శిబిరం నిర్వహించబడింది.

వరంగల్లు జిల్లా

*రసాయనిక ఎరువుల పంపిణీ:*

జనవరి నెలలో పరకాల పంచాయతీ సమితిలో 2,616 మణుగుల మేలుజాతి విత్తనాలు పంపిణీ చేయబడ్డాయి.

---

(78 వ పేజీ తరువాయి)

అగలేని నరకాసురుడు "శ్రీహరీ! మగవారి ముందు మగువలు మగతనం చూపుతుండగా నీవు చూస్తూ కూర్చుండటం మగతనం కాదు — మేము మగవారికి మగలం కావటం వల్ల మగువల జెన చూడము—"అని ఏవేవో ప్రగల్భాలుపలకటం ప్రారంభించాడు. శ్రీకృష్ణుడు తక్షణమే చక్రాయుధంతో మదాంధుడైన ఆనరకుని మూర్ధాన్ని ఖండించివేశాడు. నఖపక్షాలతో శత్రుసైన్యాన్ని చీల్చి చెండాడిన ఖగపతి ఆనందంతో రెక్కలల్లార్చాడు — లోకకంటకుడైన నరకాసురుణ్ణి సంహరించిన ఆ శుభసమయంలో సత్యాకృష్ణులపై దేవతలు పుష్పవర్షం కురిపించారు. విజయోత్సాహంతో సత్యభామ ముఖం వినూత్న కాంతితో విరాజిల్లింది. 'అర్ధాంగి' అనే పదానికి సార్థకత్వాన్ని గలుగజేసిన కాంతారత్నముగా, రణరంగంలో నాధుణ్ణి కాపాడిన వీరనారీ శిరోమణిగా సత్యభామ ఆంధ్ర సాహిత్య ప్రపంచంలో సుప్రతిష్ఠత మయింది!! ఆమె భారత లలనా వనంలో ఒక సుగంధ పారిజాతం!!! ★

# గ్రంథాలయాలు - సహకారం

టి. సుబ్రహ్మణ్యం

ఒక గ్రంథాలయంనుండి మరొక గ్రంథాలయానికి పుస్తకాలను ఎరువుగా యిప్పించే విషయంలో విజ్ఞులు చేసే ప్రయత్నాలను వివరించేటప్పుడు సాధారణంగా సహకారం అనేపదం గ్రంథాలయాలకు సంబంధించిన రంగంలో ఉపయోగించబడుతుంటుంది. తన గ్రంథాలయానికి వచ్చే పాఠకుడు కోరే ఏ గ్రంథాన్నయినా ఆ లైబ్రేరియన్ అతనికి అందజేసేటట్లు చేయడమే యీ సహకారం యొక్క ముఖ్యోద్దేశం. దీనివల్ల అనేక గ్రంథాలు వెలుగులోకి రావడం, తద్వారా పరిశోధన శీఘ్రగతిలో కొనసాగే అవకాశం కలగడం జరుగుతుంది. లైబ్రేరియన్లకు గ్రంథాల సమాచారాన్ని అందజేయడంలో తోడ్పడుతుంది. ఒక గ్రంథాలయంలోని పుస్తకాలు మరొక గ్రంథాలయానికి యిచ్చి పుచ్చుకోవడంద్వారా ఒకదానికొకటి సహాయకారులవుతాయి. ఇంకా యిది గ్రంథాలను సేకరించడంలో తోడ్పడుతుంది. ఒకేరకపు గ్రంథాలను అనవసరంగాఒకటికన్న ఎక్కువ వాటిని కొనకుండా చేస్తుంది. అంతేకాదు పాఠకులు, రచయితలు, ప్రచురణకర్తలు, పుస్తక విక్రేతలు, లైబ్రేరియన్లు ఒకరికొకరు సన్నిహితమయ్యేందుకు యిది తోడ్పడుతుంది కూడాను.

కేవలం ఏదో కాలక్షేపానికి చదువుకునే పెద్ద పెద్ద పుస్తకాల్ని మార్పిడి చేయడానికి ఏర్పాటుచేసిన సౌకర్యం కాదిది. పాఠకుడికి తన జిల్లా మొత్తంలోను, రాష్ట్రంలోకూడా ఎక్కడా దొరకని చాలా అవసరమైనదీ అతి ముఖ్యమైనదీ అయిన ఒకానొక ప్రత్యేకమైన పుస్తకాన్ని అతనికి అందజేయడానికి ఏర్పాటుచేసిన సౌకర్యంకూడా నని గుర్తుంచుకోవాలి. ఈ రకపు పాఠకులంతా ఒక వర్గం వారు. లైబ్రేరియన్లు యిలాంటి వారికి సహాయం చేయాలనే అనుకుంటారు. ఏమయినప్పటికీ యీ సహకార పద్ధతి ఏ గ్రంథాలయాధికార్లూ పరిసరాలలో వున్న ఉదారమైన యితర గ్రంథాలయాలను అతిగా నమ్ముకుని తమ ఖర్చులను తగ్గించుకోవడానికి ఏమాత్రం కారణం కాకూడదు. నిజమైన పరిశోధకునకు అవసరమైన అరుదైన గ్రంథాలను — అంతగా నలుగురికీ తెలియని గ్రంథాలను — గూర్చి తెలుసుకోవడంలో అతనికి వుపయోగపడే సమగ్రమైన పుస్తకాల పట్టికను రూపొందించడం ప్రధానంగా యీ పథకంలో వుంది. ఒక పుస్తకాన్ని ఎరువు తెచ్చుకోవాలంటే ఆ పుస్తకం ఎక్కడుందో లైబ్రేరియన్‌కు తెలిసివుండాలి. లేదా ఆ పుస్తకానికి సంబంధించిన సమాచారాన్ని యివ్వగల ఏదైనా ఒక సెంట్రల్ ఏజన్సీతో సంబంధం కలిగైనా వుండాలి. ఏదయినా ఒక పుస్తకం ఆ జిల్లాలో లేకపోతే మరో దూర ప్రాంతనుండి ఆ పుస్తకాన్ని ఎరువు తేవడానికి కాలాన్నీ, ధనాన్నీ వెచ్చించడం ఆ గ్రంథాలయానికి ఏ మాత్రం సంతృప్తికరంకాదు. పరిశోధనకు సంబంధించిన ప్రతి పుస్తకాన్ని గూర్చిన యీలాటి సమాచారాన్ని సేకరించడం అంటే తేలికయినపనేమీకాదు. పాఠకునికి కావలసిన పుస్తకాన్ని దేన్నయినా సరే ప్రతి గ్రంథాలయమూ అందజేయడమే యీ సంక్షేమ దేశంలో గ్రంథాలయ సహకారోద్యమ నిర్వహణయొక్క ముఖ్యోద్దేశం.

దీన్ని ఆచరణలో పెట్టాలంటే ఏం చేయాలి? ఒక దేశంలో ఒక రాష్ట్రమో, ప్రాంతమో వుండి దాని ఆధ్వర్యంలో అనేక గ్రంథాలయాలు వుండి, అవి పుస్తకాలను ఒకదానికొకటి యిచ్చి పుచ్చుకోవడం చేస్తూ వుండవచ్చు. కొన్ని విదేశాలలో ఒక విధమైన ప్రాంతీయ గ్రంథాలయ సహకారానికి వీలుగా కొన్ని కొన్ని ప్రాంతాలు వుండవచ్చు. ఒక పటిష్ఠమైన గ్రంథాలయ సంఘం కూడా వుండవచ్చు. గ్రంథాలయ సహకారోద్యమాన్ని మంచి హుందాగా, చక్కగా నిర్వహించడానికి యివన్నీ మార్గాలు.

ఏ కేంద్రసంస్థ అయినా సక్రమంగా పని చేయాలీ అంటే అది ప్రాతినిధ్యం వహించే దానితాలూకూ వివిధ యూనిట్లు గ్రంథాల విషయంలోనేకాక సాంకేతిక పరిజ్ఞానం విషయంలోకూడా పటిష్ఠంగా వుండాలి. ఆయా గ్రంథాలయాల యూనిట్లను అవివున్న ప్రాంతాలనుబట్టి—అంటే పురపాలక సంఘం, జిల్లా మొ..వాటిని బట్టీ సాంకేతికం, న్యాయశాస్త్రం, వాణిజ్యం మొదలయిన వాటికి సంబంధించిన గ్రంథాల సేకరణను బట్టీ వాటిని విభాగించాలనే అభిప్రాయం ప్రబలంగా వుంది దేశంలో. ఏవిధమైన భేదాలూ లేకుండా గ్రంథాలయాలమధ్య సహకారం కొనసాగడానికి వీలుగా యీ

(మిగతా 81 వ పేజీలో)

# లలనావనం



## ✲ వీరనారి సత్యభామ ✲

"మహతీశంకర్"

నరకాసురుడు వరగర్వముతో త్రిలోకాలనూ గడగడలాడించాడు. మునీశ్వరులను పరాభవించాడు. యజ్ఞయాగాదులను ధ్వంసం చేశాడు. సైన్యసమేతంగా స్వర్గం మీదికి దండెత్తి వచ్చాడు. దేవతల నందరినీ నానా ఇక్కట్లపాలు చేశాడు. బలవంతంగా కులకన్యలను ఎత్తుకొని వెళ్లాడు. ఆశ్రమ భూములన్నీ అల్లకల్లోలమైనవి. మునిలోక మంతా వచ్చి శ్రీహరిని శరణువేడింది. దేవేంద్రుడు ఉపేంద్రునితో తనపాట్లు నివేదించుకున్నాడు. "లోక కల్యాణార్థమై దానవాధముడైన నరకుణ్ణి వెంటనే సంహరించి తీరుతా" నని వారికి మాట ఇచ్చాడు శ్రీహరి. తక్షణమే గరుడుడు, సతీసహితుడైన చక్రధారితో నరకాసుర సంహారానికి గగనమార్గంలో వాయువేగంతో కదలి వచ్చాడు. కాదు — సంగ్రామ రంగంలో అసురనాథునితో పోరాడి, జగన్నాథుణ్ణి కాపాడటానికి మూర్తి దాల్చిన వీరలక్ష్మి రూపంలో "సత్యభామ" ఆంధ్రసాహిత్య రంగంలోనికి కదలి వచ్చింది !!

అవును. ఆంధ్రసాహితీ ప్రపంచంలో "సత్యభామ" ఒక అద్భుత సృష్టి. ఒక 'ద్రౌపది' మహాసాధ్వియై సుఖదుఃఖాలన్నిటిలోనూ భర్తలతో పాలుపంచుకొనిన పంచుకొనుగాక; ఒక 'సీత' జగదేకమాతయై మహాపతివ్రతయని ప్రతిష్ఠ సంపాదించుకొనిన సంపాదించుకొను గాక; ఒక 'కౌశల్య', మరొక 'సుమిత్ర' పతి పద ధ్యానాసక్తులైన కాంతారత్నము లని ప్రసిద్ధి పొందిన పొందుదురు గాక — కానీ దుష్టశిక్షణార్థమూ, శిష్టరక్షణార్థమూ పతితోపాటు రణరంగభూమిని ప్రవేశించిన వీరనారీ శిరోమణిగా 'సత్యభామ' సాహితీ ప్రియుల హృదయ ఫలకములపై కలకాలము నిలిచి పోగలదనుమాట నిశ్చయము.

అపూర్వ కావ్యకల్పనా వైభవంతో సత్యభామ 'వీరమూర్తి'ని తీర్చిదిద్దిన కవిబ్రహ్మలు ముగ్గురు. సకల భాషా భూషణుడూ, సాహిత్య రసపోషణుడూ, సంవిధాన చక్రవర్తి, నవీన గుణసనాథుడైన నాచన సోమనాథుడూ — ప్రబంధ పరమేశ్వర శంభుదాసాది బిరుదాంకితుడూ, కవిత్రయ మూర్తిత్రయుడూ ఐన ఎఱ్ఱనార్యుడూ — సహజ పాండితీ విశారదుడైన పోతనామాత్యుడూ.

ప్రాగ్జ్యోతిషపురం సమీపించాడు గరుడుడు. మురాసురుడూ, తామ్రుడూ, అంతరిక్షుడూ, శ్రవణుడూ మొదలైన రాక్షసవీరు లందరూ హరిచేతుల్లో హతమైపోయారు. ఇక నరకాసురుడే స్వయంగా చక్రధరుడితో పోరు సల్పటానికి తలపడ్డాడు — గరుడిమీదా, శ్రీహరి మీదా, సత్యమీదా శరవర్షం కురిపించాడు నరకుడు.

నరకుని బాణాలు సత్య క్రీగంటిచూపులను చుట్టుకొని వున్న సన్నని మొగలి రేకులకు అన్నదమ్ములైనాయి — నరకుని బాణాలు సత్య జడకొప్పులోని నవమాలికలకు వింత కాంతులు సంతరించాయి — స్తనములమీది చెంగలువలకు అంగమిత్రము లైనాయి — ఆమె చేతిలోని సంపంగి పూకొనలలో జోపాప లైనాయి — ఈ విధంగా నరకుని బాణాలు సత్యభామకు కుసుమాలంకారాలుగా మారినరీతిని వర్ణించిన విధానం నాచనసోమన నవీనత్వానికి ప్రత్యక్ష నిదర్శనం.

దానవపతి చండప్రచండుడై జగదేకనాథునిమీద దివ్యశరం ప్రయోగించాడు. నరకుడేసిన బాణం అర్ధచంద్రునిలో ప్రవేశించి వణికిపోయే తోకచుక్కలాగా, హరి నిటలతటంమీద అల్లల్లాడింది. బాణతీవ్రతచేత శ్రీకృష్ణుడు మూర్ఛపోయాడు — వెంటనే గరుడుడు రెక్కలతో చల్లనిగాలి విసిరాడు; కరపల్లవాలతో సత్య భర్తసేదతీర్చి, వీరసంరంభయై ప్రాణేశాగ్రభాగంలో నిలిచింది. మూర్ఛనుంచి తేరుకొని కనురెప్పలువిప్పి —

"లేమా దనుజుల గెలువగ
లేమా నీవేల కడఁగి లేచితి విటురా
లే మాను మానవే నా
లేమా విల్లందికొనుము లీలన్ గేలన్"

అంటూ విల్లు ఇల్లాలికి అందించాడు హరి. ఇచ్చినవిల్లు పుచ్చుకొని, "ప్రియా చరణభక్తి ప్రౌఢ," "సమంచిత ఉత్సాహ సాహస విభాసినీ" యైన సత్యభామ మహారణక్రియ ప్రారంభించింది.

పతివైపు మేలుచూపులతోనూ, అసుర పతివైపు వాడి తూపులతోనూ సత్య విజృంభించింది — సత్య విజృంభణాన్ని నాచన సోమన అనుపమానంగా అభివర్ణించాడు.

"గనయంబున్ గొనయంబు, నెన్నడుముతో గర్జావ తంసంబుతో
జనుదోయిం గనుదోయి, సాయకముతో సంధాన హస్తంబుతో
జెనకం జేయుచు నేయుచుండె సతి లక్ష్మీ భూత దైతేయ త
ర్జన గర్జారవ జర్జరాంగ రుధిరా పారంబు దోరంబుగన్,"

సత్యభామ వీరశృంగారమూర్తి. రణరంగంలో ఆమె ఒకవైపు భర్తకు సంతోషాన్నీ, అసురభర్తకు సంతాపాన్నీ కలిగించింది — ఆ సమయంలో సత్యరూపం సోమన చేతిలో మనోజ్ఞ శిల్పాకృతి దాల్చింది.

"అరిఁ జూచున్ హరిఁ జూచుఁ, జూచుకము లందందంద మందారకే
సరమాలా మకరంద బిందు సలిలస్యందంబు లందంబులై
తొరుగం, బయ్యెద కొం గొకింత దొలగం దోర్దో శరాసారమున్
దరహాసామృత పూరమున్ గురియుచున్ దన్వంగి కేళీగతిన్ —"

ఆమె ముఖము హరికి చంద్రబింబం, అరికి ప్రచండ భాస్కరబింబం — ఆమె చేలాంచలము హరికి కందర్పకేతువు; అరికి ధూమకేతువు — ఆమెరూపం హరికి అమృత ప్రవాహము; అరికి అనల సందోహము — ఆమె బాణవృష్టి హరికి హర్షదాయి, అరికి మహారోషదాయి.

సమరసీమలో సత్యభామకు దివ్యాకృతిని ప్రసాదించిన గౌరవము ప్రముఖముగా పోతనామాత్యునకు దక్కినది. 'వీరశృంగార భయ రౌద్ర విస్మయములు గలిసి భామిని అయ్యెనో యనగ' సత్య భాసించినదట! అంతేకాదు — బొమ్మపెండ్లిండ్లకు పోలేని సత్య రణరంగంలో వీరవిహారం సలిపింది— మగవారిని చూచినంతనే మరుగుకుపోయే మగువ శత్రువీరులను మట్టుపెట్టింది — బంగారు ఉయ్యాల ఎక్కటానికి భయపడే బాల ఖగపతిని అధిరోహించింది — చెలికత్తెల కోలాహలాన్నిగూడా భరించలేని సుకుమారి పటహభాంకృతులు ఓర్చింది — నెమళ్ళకు నృత్యం నేర్పితేనే అలసి సొలసిపోయే అతివ ప్రత్యాలీఢ పాదంతో పగతురను చీల్చి చెండాడింది — వీణనుకూడా సరిగా పట్టుకోలేని భామ బాణాలను ఎక్కుపెట్టింది— ముత్యాలతో దండగ్రుచ్చటం చేతకాని ముగ్ధ నిశితశరాలను నిపుణతతో సంధించింది — చిలుకకు పద్యం చెప్పనేరని తన్వి అస్త్ర మంత్రాలను అభ్యసించింది — పెక్కు పలుకులు పలకటం ఎరుగని ముగుద భీకర సింహగర్జనలు సలిపింది — ఇటువంటి వీరనారి ఆంధ్రసాహిత్యంలో 'నభూతో నభవిష్యతి' అనిపించింది.

ఆనాడు 'వీరమే ఆడుతనంరూపును ధరించింది — ధృతి అతీణాకృతిపొందింది—' పోతనామాత్యుడు తీర్చిదిద్దిన ఆనాటి సత్యస్వరూపాన్ని రసజ్ఞులైన పాఠకులు ఏనాటికీ మరువలేరు —

"అలినీ లాలక చూడ నొప్పెసగెఁ బ్రత్యాలీఢ పాదంబుతో
నలికస్వేద వికీర్ణ కాలకలతో నాకర్ణి కాసీత స
ల్లలితజ్యానఖ పుంఖ దీధితులతో లక్ష్యావలోకంబుతో
వలయాకార ధనుర్విముక్త విశిఖ వ్రాతాహతారాతియై.''

ఆ భీకర సమరాంగణంలో కరాళకాళికాకృతి ధాల్చింది — సత్య బాణాలు అగ్నిజ్వాలల్లాగా నరకాసురుడి సైన్యాన్ని దూసుకుని పోతున్నాయి — అసురుడు భీకరుడై సత్య స్థనాలమీద ఆరుబాణాలూ, బాహువులపై ఏడు బాణాలు ప్రయోగించాడు —సత్య వాటిని ఏమాత్రము లెక్కచేయకుండా నరకునిపై బాణవర్షం కురిపించింది — అతని విల్లును విరిచేసింది; రథ్యములను తునిమివేసింది— అతడు కోదండం అందుకున్నాడు; ఆమె ఆ కోదండాన్ని తుండెలు చేసింది—అతడు గదనే విసరివేశాడు; మధ్యలోనే ఆ గదను త్రుంచేసింది ఆమె — తక్షణమే శక్తిని ప్రయోగించాడు నరకుడు; వెనువెంటనే శక్తిని తుత్తునియలు చేసింది — సత్యభామ మహోద్ధతిని చూచి దానవేంద్రుడు బెండయిపోయాడు. సత్య పరాక్రమోన్నతిని ఎఱ్ఱనార్యునిదృష్టిలో ఒక శార్దూలాకృతి పొందింది —

"విల్లం గేతువు ద్రుంచి, రథ్యముల నుర్విం గూర్చి, సూతున్ వెసన్
ద్రెళ్ళం జేయగ హీన సార్థత మెయిన్ దీనత్వ మట్లొందియున్
భల్లంబుల్ నిగిడింప రాక్షసుడు చాపంబొండు గైకొన్న, న
వ్విల్లు న్నుగ్గుగ జేసె నాక్షణమ దేవీరత్న ముగ్రోద్ధతిన్."

కంస సంహారి కాంత అవక్ర పరాక్రమాన్ని అభినందించి, అనేక ఆభరణాలు బహూకృతులుగా ఇచ్చాడు — సత్య దాటికి

(మిగతా 75 వ పేజీలో)

# పట్టు పరిశ్రమ

— ద్వారం సాయిప్రకాశరావు

వస్త్రధారణకు పట్టు చాలా శ్రేష్ఠమైనది పట్టువస్త్రాలు చాలా మృదువుగా వుండి జిగిని కలిగి వుంటాయి అనాదినుంచీ కొన్ని దేశాలు పట్టు పరిశ్రమపట్ల శ్రద్ధవహిస్తూ వున్నాయి వాటిలో చైనా జాపాను ఫ్రాన్సు ముఖ్యమైనవి పట్టుపురుగులను పెంచి, పట్టుతయారుచేసే పరిశ్రమను పట్టుపరిశ్రమ లేక సెరీకల్చర్ (Sericulture) అంటారు

పట్టుపురుగులను పెంచడానికి అనుకూలమైన శీతోష్ణస్థితిగల ప్రదేశాలు అవసరం వాతావరణం యొక్క ఉష్ణోగ్రత 60 ఎఫ్ నుంచి 90 ఎఫ్ వరకు వుండాలి మల్బరీ ఆకులు విరివిగా లభించాలి పట్టువస్త్రాల నాణ్యత ఆయా పట్టుపురుగుల ఆరోగ్యం అవి తీసుకునే ఆహారం శీతోష్ణస్థితులపై ఆధారపడివుంటుంది

పట్టు వస్త్రాలను తయారు చేయడానికి మొట్టమొదట పట్టు శలభముల గ్రుడ్లను వెదురు పళ్లేలలో వుంచి సూర్యరశ్మి ప్రసరించేటట్లు వాటిని తగు స్థలాలలో అమర్చుతారు సూర్యరశ్మి సహాయంతో గుడ్లు పొదగబడతాయి అవి చిన్నచిన్న పురుగులుగా వెలువడతాయి వాటినే పట్టుపురుగులంటారు వాటికి ఆహారంగా లేత మల్బరీ ఆకులను కత్తిరించి వెదురు పళ్లేలలో వేస్తారు అప్పుడప్పుడు పురుగులుతినకుండా మిగిల్చివేసిన ఆకులను వాని విసర్జితములను వెదురు పళ్లేలనుంచి తీసివేసి శుభ్రపరుస్తారు అనారోగ్యంగా వున్న పురుగులను తీసివేస్తారు పట్టుపురుగు జీవితకాలం అయిదారు వారాలుమాత్రమే ఈ అయిదారు వారాలలోనూ పట్టుపురుగులు విధి విరామం లేకుండా మల్బరీ ఆకులను తింటాయి ఈ పురుగు తన జీవిత కాలంలో నాలుగు పర్యాయాలు పై చర్మాన్ని విడచి తిరిగి నూత్న చర్మాన్ని దాల్చుతుంటుంది ఈ క్రియను 'కుబుసం విడుచుట' అంటారు కుబుసం విడిచిన ప్రతి పర్యాయం దానికి నూత్నశక్తి కలుగుతుంటుంది అందుచేత మల్బరీ ఆకులను అధికంగా తింటూ బలిష్ఠంగా పెరుగుతుంది తుదిసారి కుబుసం విడచిన పట్టుపురుగు సుమారు మూడు అంగుళాల పొడవు వుంటుంది

పట్టుపురుగులు కడసారిగా కుబుసం విడచిన పిమ్మట ఆహారం తీసుకోవడం మానివేస్తాయి అప్పుడు వాటిని వెదురు పళ్లేలనుంచి మరొరకపు తొట్టెలలోకి మారుస్తారు వీటిని స్పిన్నింగ్ ట్రేలు (Spinning trays) అంటారు వీటిని చీకటిగా వున్న గదులలో అమర్చుతారు పట్టుపురుగుల నోటిలోపల దౌడలలోవుండే రెండు రంధ్రాలద్వారా ఒకవిధమైనటువంటి జిగురు పదార్థం స్రవించి గాలి తగలగానే గట్టిపడి సన్నని పొరవలె ఏర్పడుతుంది ఇదే పట్టుదారం ఈదారం సహాయంతో పట్టుపురుగు తనచుట్టూ ఒకగూటిని ఎర్పర్చుకుంటుంది దీనినేపట్టుకాయ లేక పట్టుకోశం (Cocoon) అంటారు ఈ గూటిలో వుండే పట్టుపురుగును 'ప్యూపా' అంటారు ఇది నిద్రావస్థలో వుంటుంది

ఒక్కొక్క పట్టుకోశంలో 600అడుగుల నుంచి 1000 అడుగుల పొడవువరకు పట్టుదారం 'కండె వలె చుట్టుకొని వుంటుంది కోశంలోని ప్యూపా బయటకు వెలువడినట్లయితే దారం తునాతునియ లవుతుంది అందుచేత పట్టుకోశంలోని ప్యూపా' వెలువడక ముందే వాటిని సలసలమరిగే నీటిలో పది లేక పదిహేను నిమిషాలపాటు ఉడకబెడతారు ఇలా చేయడంవల్ల కోశంలోని 'ప్యూపా' నశిస్తుంది

పట్టుకోశంలోని పట్టుదారాన్ని రీలింగ్ యంత్రాల సహాయంతో తీస్తారు రీలింగ్ యంత్రాలందుగల నీటితొట్టెలలో ప్యూపాలను నశింపజేసిన పట్టుకోశాలను వేస్తారు నిపుణులైన పనివారు ఒక్కొక్క కోశంలోని దారపుకొనను పట్టుకొని అయిదారు కాయల దారాన్ని యంత్రానికి అందిస్తారు ఈవిధంగా రీలింగు యంత్రాల సహాయంతో పట్టుకోశాలలోని దారాలను చుట్టలు చుట్టలుగా చుట్టివేస్తారు

సంతానోత్పత్తి నిమిత్తం ఆరోగ్యంగా వున్నదీ లేనిదీ పట్టుకోశాలను పరిశోధించి మరగబెట్టకుండా వుంచుతారు తిరిగి వీని నుంచి పట్టుచిలుకలు వచ్చిగ్రుడ్లు పెడతాయి సాధారణంగా పట్టుచిలుకలు మల్బరీ చెట్ల ఆకుల అడుగుభాగంలో గ్రుడ్లు పెడతాయి

పట్టు వస్త్రాలలో కూడా అనేకరకాలున్నాయి కేవలం పట్టుకోశంనుంచి వచ్చిన దారంతో తయారుచేసిన పట్టువస్త్రం మిక్కిలి ప్రశస్తమైనది నిస్సత్తువుగల పురుగులచే తయారైన పట్టుకోశాలనుంచి వెలువడే దారంతో తయారుచేసిన పట్టును 'వడికిన పట్టు' (Spun silk) అంటారు ఇదిరెండవ రకానికి చెందింది పట్టుకాయల డిప్పల నుంచి తయారుచేసే పట్టును 'నాసిరకపు పట్టు' (Waste silk) అంటారు ఇది మూడవరకానికి చెందినది

ఈవిధంగా ఎక్కువ జాగ్రత్తపడి నైపుణ్యంతో ఎక్కువ శ్రమపడి తయారుచేసిన పట్టువస్త్రాలు ఆ శ్రమకు తగినంత విలువతో నేడు విక్రయశాలలలో చలామణి అవుతున్నాయి ★

బాలానందం

# గోదావరి గాథ

— చందూ

తెలుగు వారి తరతరాల
వెలుగు వెల్లి గోదావరి
తెలుగు ప్రజల యుగయుగాల
కన్నతల్లి గోదావరి —

గోదావరి మధుజలముల
తెలుగు నేల పులకరించు
మందానిల డోలలలో
పసిడిపంట పరవశించు —

తొలుత నెటుల గోదావరి
వెలసినదో తెలిసికొనుడు
తెలియకున్న వారికెల్ల
తెల్లబరుప నేర్చుకొనుడు —

తొల్లి మహాకాటకమున
తల్లడిల్లె లోకమెల్ల
తినుట కాకు లైన లేక
జనులు మునులు విలపించిరి —

గౌతమాశ్రమమ్మునందు
కాటక మను పదము లేదు
పచ్చని పైరుల నిత్యము
పండువుగా వరలుచుండె —

విత్తనములు చల్లినంత
పైరయి ఫలియించు వింత
వరము నొందె గౌతమముని
తపమున మెప్పించి అజుని —

అందువలన గౌతమముని
ఆశ్రమమున కరవులేక
సుభిక్షమై సస్యశ్యామ
సుందరమై వెలుగుచుండె —

అది తెలిసిన మునిజనమ్ము
అటకువేగ వెడలినారు
గౌతమునకు మ్రొక్కి వారి
గాథనంత చెప్పినారు —

గౌతముడా మును లందర
గౌరవమున నాదరించె
వసతు లొసగె నాశ్రమమున
వచ్చిన వారందరకును —

అమిత భక్తి మర్యాదల
ఆతిథ్యము నిడుచునుండె
అత్యంతాసక్తితోడ
అనుక్షణము సాగుచుండె —

విత్తనములు చల్లుచుండ
క్రొత్తపైరు పెరుగుచుండ
పండి నేల కొరుగుచుండ
పంటరాసు లెత్తుచుండ —

మునిజనులకు లోటులేక
మనుచుండిరి ఆశ్రమమున
కాటక మను మాటవిడచి
సంతృప్తిగ మేను మరచి —

తను పొందిన వర మిట్టుల
మును లందర కుపకరించ
ఆనందముతో మహర్షి
అందర సేవించుచుండె —

గౌతమముని పొందుచున్న
అతులిత మగు కీర్తి గన్న
మునులు కొంద రాతని-యశ
మును చెరుపగ దలచినారు —

మాయగోవు నొకదానిని
మేయ బంపినారు వారు
పండి యొరిగియున్న చేల
పైరంతయు పాడుచేయ —

నోటిముందు పైరంతయు
చేటుచేయు గోవును గని
గౌతమముని ఖిన్నుడాయె
చేతనమును కోలుపోయె —

గోవును దండించలేక
పంటనటుల విడువలేక
తడబడె నా మౌనివరుడు
తన కర్తవ్య మ్మేమని —

తుదకు మేయు గోవుపైని
''వదలిపొమ్ము పై''రటంచు
కమండలములోని జలము
కరముతోడ చల్లినాడు —

జలబిందువు సోకినంత
గిలగిల మని తన్నుకొనుచు
అసువుల బాసినది ఆవు
ఆ పండిన పొలములోన —

ఆ దృశ్యము గాంచి మునులు
ఆగ్రహించి అతని పైని -
"గోహత్యా పాతకమ్ము
గొన్న మహాపాపి"వనిరి —

''గోహత్యయు శిశుహత్యయు
స్త్రీహత్యయు బ్రహ్మహత్య
పాపమ్ముల నెల్ల మహా
పాపము లని శ్రుతికావున —

ఇట్టిమహా పాపియింట
తగ దింకను నిలచియుంట —
అనుచువెడలి పోసాగిరి
మును లందరు కోపగించి —

''మౌనులార నా పాప
మ్మేరీతిని తొలగిపోవు ?
మనశ్శాంతి నా కెట్టుల
కలుగు?- చెప్పి బ్రోవు''డనుచు —

వేడుకొనెను గౌతమముని
వెడలిపోవు మౌనుల గని
అతని దుఃఖ మంత వారి
కవగతమై కరుణ కలిగె —

చచ్చినట్టి ఆవుపైని
పారినదో మందాకిని
పోవు నీదు పాతక మని
చెప్పిరి వా రాతని గని —

గౌతము డా క్షణమె శివుని
గూర్చి తపము చేయబూనె
పాతకమును విడువనెంచి
పరమకఠిన దీక్ష బూనె —

గంగాధరు డతని తపము
మెచ్చి ఆయె ప్రత్యక్షము
''ఆవుపైన జలము పిండు''
మనుచు నొక్క జట నొసంగె —

ఆనందముతో మహర్షి
అరుగుదెంచి పిండెను జట
ఆవు అప్సరై నిలచెను
ఆ నీ రేరాయె నచట —

ఆ యేరే గౌతమి యను
పేర నిలచె భూమిపైని
గోవును బ్రతికించెగాన
గోదావరి యనిరి దాని —

చల్లని గోదారి తల్లి
ఆంధ్రప్రజల కల్పవల్లి
తెలుగుకైత గన్నతల్లి
తెలుగు తావు లొసగు మల్లి-

---

(76 వ పేజీ తరువాయి)

.షయాలపై ఒక కేంద్ర ఆధిపత్యం వుండా .నే అభిప్రాయంకూడా బలీయంగా వుంది. .విధ దేశాలలో కొనసాగించిన గ్రంథాలయ హకారానికి సంబంధించిన పరిశీలనల వల్ల .యా దిగువ అభిప్రాయాలకు రావడం .రిగింది.

1. ఒక జాతీయ కేంద్రాన్ని స్థాపించి, .న్ని వర్గాలుగా విభాగించడం అవసరం.

2. దేశమంతటా ఒకేరకపు గ్రంథాల .మాలకన్న భౌగోళిక ప్రాంతాలను బట్టి యా .ర్గీకరణ ప్రాంతీయ ప్రాతిపదికపై .రగాలి.

ప్రాంతీయ ప్రాతిపదికపై జరిగిన .ర్వహణలో లైబ్రేరియన్లు యీ పథకంలో .ల్గొనే యితర గ్రంథాలయాల లైబ్రేరి .న్లను ఒకరి నొకరు తెలుసుకోవడం, .తర గ్రంథాలయాల స్వభావాలు, .ందులోని ప్రత్యేక గ్రంథాలు మొదలైన వాటిని తెలుసుకోవడం జరుగుతుంది. వీనికి సంబంధించిన విషయాలపై త్వరత్వరగా, తేలిగ్గా పనులు తెములుతాయి. కేంద్రసంస్థకు సంబంధించినంత మట్టుకు యిది రెండు రకాలుగా పనిచేయవచ్చు. మొదటిది యిదొక విచారణ కేంద్రంగా పనిచేయవచ్చు. రెండవది సరిక్రొత్త గ్రంథాలను గూర్చిన సరిక్రొత్త శాశ్వత రికార్డులను నిర్వహిస్తూ వాటి సమాచారాన్ని — అంటే పుస్తకం ఎక్కడ దొరుకుతుంది, ఎలా దొరుకుతుంది మొదలయిన సమాచారాన్ని — ఇంకా గ్రంథ వివరణ పట్టికలకు సంబంధించిన వివరాలను తెలియజేసే సమాచార కేంద్రంగా కూడా పనిచేయవచ్చు.

నానాజాతి సమితి, యునెస్కోలు విజ్ఞానానికిసంబంధించిన సహకారం. విషయంలో యీ మార్గంలో సాధించిన అభివృద్ధి దృష్ట్యా ప్రపంచవ్యాప్తంగా గ్రంథాలయ సహకారాన్ని ఏర్పాటు చేయవచ్చునే ఆశ వ్యక్తపడు తున్నది.

కేంద్ర సంస్థలను నిలుదొక్కేటట్టే పటిష్ఠమైన ప్రాథమిక గ్రంథాలయాలు వుంచేనే తప్ప యీ విధమైన పెద్దపెద్ద కేంద్రసంస్థలు సక్రమంగా పని చేయలేవనే విషయాన్ని ముందుగా గుర్తుంచుకోవాలి. కేంద్ర సంస్థ ఊరికే బళ్ళకొద్దీ పుస్తకాలను అట్టిపెట్టుకోవడంకన్న సమాచారాన్ని సేకరించి, దానిని మిగతావాటికి అందజేయాలి. మనమంతా వుండడానికని ఒక విజ్ఞానేక ప్రపంచాన్ని సృష్టించేందుకు కారణమయ్యే వివిధ దేశాలతో కూడిన గ్రంథాలయ సహకారానికి యీ పటిష్ఠమైన ప్రాంతీయ గ్రంథాలయాలు చెక్కుచెదరని స్తంభాలుగా నిలబెట్టాలంటే ప్రాంతీయ గ్రంథాలను ఎక్కడి కక్కడ ఆర్థికంగాను, సాంకేతికంగాను పటిష్ఠం చేయాలి. ★

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

జనవరి 21 హైదరాబాదు వద్ద గ్లాసు కర్మాగారాన్ని నెలకొల్పడానికి హాంగరీ విదేశవర్తక కంపెనీ "కంప్లెక్స్", ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి సంస్థ ఒక ఒప్పందాన్ని కుదుర్చుకున్నాయి.

జనవరి 25 : హైదరాబాదు ఫతేమైదానంలో రాష్ట్ర ఆర్థికమంత్రి ఇండోర్ గేమ్స్ స్టేడియానికి శంకుస్థాపన చేశారు.

జనవరి 26 : హైదరాబాదులోని ఎర్రగడ్డ వద్ద ముఖ్యమంత్రి 11.25 కి. వా. గాస్ టర్బైన్‌కు ప్రారంభోత్సవం చేశారు.

జనవరి 29 : హైదరాబాదుకు 17 మైళ్ళ దూరంలోగల లింగంపల్లి వద్ద అల్యూమినియం ఇండస్ట్రీస్ లి. కర్మాగారానికి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

జనవరి 30 : గుంటూరుకు సుమారు అయిదుమైళ్ల దూరంలో నల్లపాడు వద్ద లయోలా పబ్లిక్ పాఠశాలకు ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు.

ఫిబ్రవరి 1 : భారతదేశంలోని నైతిక, సాంఘిక ఉద్యమసంస్థ పదవ జాతీయ సమావేశానికి హైదరాబాదులో ఆంధ్రప్రదేశ్ ప్రధానన్యాయమూర్తి ప్రారంభోత్సవం చేశారు.

ఫిబ్రవరి 2 : గుంటూరుకు 20 మైళ్ళ దూరంలోగల దుగ్గిరాలవద్ద కేంద్ర గిడ్డంగుల కార్పొరేషను గిడ్డంగికి కేంద్ర రక్షణ ఉత్పత్తుల మంత్రి శంకుస్థాపన చేశారు

ఫిబ్రవరి 3 విశాఖపట్టణం రేవులో సరుకులు దించడానికి వీలుగా రాతికట్టకు వర్కుషాపు భవనానికి నౌకాసంబంధి ప్రధానాధికారి శంకుస్థాపన చేశారు.

ఫిబ్రవరి 5 : పశ్చిమ గోదావరి జిల్లా పోలవరంతాలూకా పెదవాగునదిపై కుంకాల ఆనకట్టకు రాష్ట్ర పబ్లిక్ వర్క్సు మంత్రి శంకుస్థాపన చేశారు.

ఫిబ్రవరి 8 : సాయల్ మెకానిక్స్, ఫౌండేషన్ ఇంజనీరింగుల జాతీయ సంఘం ఏడవ వార్షిక సమావేశాన్ని కేంద్ర విద్యుచ్ఛక్తి, నీటిపారుదల మంత్రి హైదరాబాదులో ప్రారంభించారు.

ఫిబ్రవరి 9: ఇంజనీర్లసంస్థ (భారతదేశం) 44వ సాంవత్సరిక సమావేశానికి కేంద్ర విద్యుచ్ఛక్తి, నీటిపారుదల మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

ఫిబ్రవరి 15 : శిశు సంక్షేమానికి చెందిన యిండియన్ కౌన్సిలు 14వ సాంవత్సరిక సాధారణ సమావేశాన్ని ఆంధ్రప్రదేశ్ గవర్నరు హైదరాబాదులో ప్రారంభించారు.

60 మంది సభ్యులుగల రష్యాదేశపు సర్కసు బృందం హైదరాబాదుకు విచ్చేసింది.

ఫిబ్రవరి 17 : ఆంధ్రప్రదేశ్ ప్రధాన న్యాయమూర్తి ఉస్మానియా విశ్వవిద్యాలయపు స్నాతకోత్సవ సమావేశంలో ప్రసంగించారు

ఫిబ్రవరి 18 ఆంధ్రప్రదేశ్ గవర్నరు హైదరాబాదులో ఆంధ్రప్రదేశ్ జైలు అధికారుల సమావేశాన్ని ప్రారంభించారు.

## భారతదేశంలో

జనవరి 21 : భారతదేశం, ఆఫ్ఘనిస్తాను దేశాలు ఒక కొత్త వాణిజ్య ఒప్పందంపై సంతకాలు చేశాయి.

జనవరి 22: శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి పోర్టుఫోలియో లేని మంత్రిగాను, శ్రీ డి. సంజీవయ్య కార్మిక, ఉపాధికల్పనల మంత్రిగాను కేంద్ర మంత్రివర్గంలో నియమింపబడ్డారు.

జనవరి 27 ; ఉదయపూర్‌లో ప్రపంచ శాస్త్రజ్ఞుల పన్నెండవ పుగ్‌వాష్ సమావేశం ప్రారంభమయ్యింది.

ఫిబ్రవరి 1: న్యాయాధిపతి పి. బి. గజేంద్ర గాడ్కర్ భారతదేశపు ఏడవ ప్రధాన న్యాయాధిపతిగ పదవీ స్వీకారం చేశారు.

ఫిబ్రవరి 3 : వ్యవసాయోత్పత్తి కార్యక్రమంపై దక్షిణ ప్రాంతపు సమావేశం ఎర్నాకుళంలో ప్రారంభించబడింది.

ఫిబ్రవరి 4 : కామన్వెల్తు దేశాల గౌరవ మేజిస్ట్రేటుల తొలి సమావేశానికి కొత్తఢిల్లీలో భారత ప్రధాన న్యాయమూర్తి ప్రారంభోత్సవం చేశారు.

1963 సం॥పు ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర ప్రాంతం) ఈనాముల (మదింపు) మరియు ఈనాముల (రద్దు, రైత్వారీ మార్పిడి) సవరణ బిల్లుకు రాష్ట్రపతి ఆమోదించారు.

(మిగతా 85 వ పేజీలో)

(10 వ పుట తరువాయి)

1959వ సంవత్సరంనుంచి 1962వ సంవత్సరం వరకు ఈ అంశం ఈ ప్రభుత్వాల పరిశీలనలో వుంది. ఈ ఆనకట్టను "చిత్రకొండ" గ్రామం వద్ద నిర్మించడానికి, ఆనకట్ట నిర్మాణ వ్యయాన్ని ఉభయ రాష్ట్రాలు సమంగా భరించడానికీ, నీటి ప్రవాహాలను కూడా సమంగా పంచుకోవడానికీ, ప్రతి రాష్ట్రం కూడా తన వాటా జలాలను యథేచ్ఛగా ఉపయోగించుకోవడానికి 1962 సెప్టెంబరు 4వ తేదీన ఆంధ్రప్రదేశ్, ఒరిస్సారాష్ట్రాల మధ్య ఒప్పందం కుదిరింది.

ఈ ఆనకట్టను "బలిమెల ఆనకట్ట" అంటారు. ఆంధ్రప్రదేశ్ వాటా జలాలను ఎగువ సీలేరు, దిగువ సీలేరు విద్యుత్కేంద్రాల వద్ద ఉపయోగించుకునేందుకై ఈ జలాశయం నుంచి సీలేరు నదిలోకి వదులుతారు. బలిమెల (ఒరెకల్) విద్యుత్కేంద్రంలో విద్యుదుత్పత్తి నిమిత్తం, ఒరిస్సా వాటా జలాలను సీలేరు - శబరి లోయలను వేరుచేస్తున్న పర్వతపంక్తి వరుసలో తీసుకుంటారు. ఆనకట్ట నిర్మాణం ముగిశాక ఎగువ సీలేరు విద్యుత్కేంద్రం వద్ద ఉత్పాదక శక్తిని 3,00,000 కి.వా.ల వరకు పెంచిస్తారు. ఆంధ్రప్రదేశ్ వాటా క్రింద సీలేరులోకి విడుదలచేయబడే ప్రవాహాలనుంచి 42,000 కి. వా.ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడానికై బలిమెల ఆనకట్ట కుడి పార్శ్వంవద్దకూడా ఒక విద్యుత్కేంద్రాన్ని స్థాపిస్తారు.

ఈ ఒప్పందం మేరకు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం బలిమెల ఆనకట్ట దిగువన, సీలేరు, దాని ఉపనదుల ప్రవాహాన్ని పూర్తిగా ఉపయోగించుకోవచ్చు. దీనిననుసరించి, పొల్లూరు సమీపంలో 'యు' ఆకృతి వంపులో విద్యుచ్ఛక్తిని అభివృద్ధి పరుచుకునేందుకు దిగువ సీలేరు ప్రాజెక్టు నిర్మాణం మొదలైన అంశాలలో ఒరిస్సా ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి అన్ని సౌకర్యాలు కలిగిస్తుంది. ఈవిధంగా ఈ ఒప్పందం మరో అంతరరాష్ట్ర ఒడంబడిక కుదుర్చుకోవడానికి సాధారణంగా జరిగే విలంబనలను నివారిస్తూ దిగువ సీలేరు ప్రాజెక్టు త్వరితంగా అమలు జరగడానికి అవకాశం కలిగించింది. కట్టకడపటి దశలో ఈ ప్రాజెక్టు సుమారు 6 లక్షల కి. వా. ల విద్యుదుత్పాదక శక్తి కలిగి వుంటుంది. కేంద్ర విద్యుచ్ఛక్తి, నీటి వనరుల శాఖా మంత్రి డాక్టరు కె. యల్. రావుగారు దిగువ సీలేరు ప్రాజెక్టు స్థలాన్ని 1963 జనవరిలో పరిశీలించారు (అప్పుడు ఆయన పార్లమెంటు సభ్యులుగా వున్నారు) ఆయన మార్గదర్శకత్వం క్రింద తొలి దశలో 3,00,000 కి. వా. ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడానికి ప్రతిపాదనలను రూపొందించి ఆమోదం కొరకు భారత ప్రభుత్వానికి పంపించడం జరిగింది.

ఈవిధంగా మాచ్ ఖండ్, ఎగువసీలేరు దిగువ సీలేరు ప్రాజెక్టులవద్ద మొత్తం 2,200 అడుగుల ధారను విద్యుదుత్పత్తి నిమిత్తం వినియోగించుకోవడం జరుగుతుంది. బలిమెల జలాశయం మట్టం, దిగువ మాచ్ ఖండ్ ప్రాజెక్టువద్ద గల మాచ్ ఖండ్ విద్యుత్కేంద్రాల మధ్య లభ్యమయ్యే సుమారు 200 అడుగుల ధారను వినియోగించుకునే అంశం పరిశీలనలో వుంది.

ఈ లోయ పూర్తిగా అభివృద్ధి పరచబడినప్పుడు, నది ఉత్పత్తి స్థానం మొదలుకొని శబరిలో అది కలిసేవరకు గల మధ్య భాగంలో లభ్యమయ్యే సుమారు 5000 అడుగుల పూర్తి ధారలో సగాన్ని వినియోగించుకోవడం జరుగుతుంది. ఈ నదీలోయ నుంచి ఆంధ్రప్రదేశ్ కు సుమారు 12 లక్షల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి లభిస్తున్నది.

ఈ ప్రాజెక్టులు ముఖ్యంగా విద్యుదుత్పత్తికే ఉద్దేశింపబడినప్పటికీ ఇవి గోదావరి డెల్టా ప్రాంతంలో రెండవ పంటకు నీటిపారుదలను పెంపొందిస్తాయి కూడా. వేసవిలో గోదావరి నదీప్రవాహం చాలా తక్కువగా వున్నప్పుడుకూడా, విద్యుదుత్పత్తికి ఉపయోగించుకున్న పిమ్మట సుమారు 2700 క్యూసెక్కుల నీటిని నిరంతరం నదిలోకి విడుదలచేయడమే దీనికి కారణం. విశాలమైన జలాశయంలోనికి వరదనీరు ప్రవహిస్తుందికాబట్టి గోదావరి డెల్టా ప్రాంతంలో ప్రస్తుతం ఏటావుంటున్న వరదముంపు ప్రమాదాలు కొంతవరకు తగ్గగలుగుతాయి. బృహత్తరమైన ఈ జలాశయంయొక్క పరిసరాలు రమణీయమైనవి. అందువల్ల విహార కేంద్రంగా, మత్స్యపరిశ్రమ కేంద్రంగా ఇది పెంపొందే అవకాశాలు ఎక్కువగా వున్నాయి. అంతేకాక వన్యమృగాల సంరక్షణకు అరణ్యాలనుకూడా పెంపొందించవచ్చు.

## ముఖ్యాంశాలు

ఎగువ సీలేరు ప్రాజెక్టు నిర్మాణానికి అమలుజరిగే ముఖ్యమైన పనులు ఇవి :—

(1) గుంటవాడవద్ద 60 అడుగుల ఎత్తు, 1400 అడుగుల పొడవున రాతితో మళ్ళింపు బ్యారేజిని నిర్మిస్తారు. ఎగువ సీలేరు విద్యుత్కేంద్రంవద్ద విద్యుదుత్పత్తి కొరకు బలిమెల ఆనకట్టనుంచి విడుదల చేయబడే నీటి ప్రవాహాన్ని మళ్ళిం

చేందుకు పార్శ్వాలవద్ద 600 అడుగుల పొడవున మట్టికట్టలు నిర్మిస్తారు. సరస్సులో నీరు 2.5 చదరపుమైళ్ల విస్తీర్ణంలో ఆవరించి వుంటుంది. ఈ నిర్మాణాలకై 2.2 మిలియన్ ఘనపుటడుగుల రాతిపని, 3.0 మిలియన్ ఘనపుటడుగుల మట్టిపని జరుగుతుంది. ఈ బ్యారేజి నిర్మాణాన్ని బలిమెల ఆనకట్ట నిర్మాణ కార్యక్రమంలో చేర్చవలసి వుంటుంది. దాదాపు 40 శాతం పని పూర్తయింది.

(2) 120 అడుగుల ఎత్తు, 555 అడుగుల పొడవుగల ఒక రాతి ఆనకట్ట నిర్మిస్తారు. వివిధ కాలాలలో విద్యుదుత్పత్తి నిమిత్తం విద్యుత్కేంద్రానికి అవసరమైన నీటిని నిలువచేసే నిమిత్తం ముందు భాగంలో ఒక సరస్సును ఏర్పరిచేందుకై లోతైనలోయకు అడ్డంగా రెండువైపులా మొత్తం 1600 అడుగుల పొడవున మట్టి కట్టలు నిర్మిస్తారు. ఈ నిర్మాణాలకుగాను 2.23 మిలియన్ ఘనపుటడుగుల రాతి పని, 1.0 మిలియన్ ఘనపుటడుగుల మట్టి పని జరుగుతుంది. దాదాపు 20 శాతం పని పూర్తయింది.

## విద్యుదుత్పత్తికి ఉపయోగపడే పెద్ద కాలువ

(3) 3,00,000 కి.వా.ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడానికై ఎక్కువలో ఎక్కువ 16,000 క్యూసెక్కుల నీటిని ప్రవహింపచేయడానికి 110 అడుగుల వెడల్పు, 25 అడుగుల లోతు, 1600 అడుగుల పొడవుగల ఒక కాలువను నిర్మిస్తారు. ఇందుకు 10.6 మిలియన్ ఘనపుటడుగులమేరకు త్రవ్వకం పని జరుగుతుంది. కాలువ లైనింగ్‌కు 0.28 మిలియన్ ఘనపుటడుగుల కాంక్రీటు పని జరుగవలసివుంటుంది. 70 శాతం త్రవ్వకం పనులు ముగిశాయి. త్రవ్వకాలు పూర్తయ్యాక కాంక్రీటు లైనింగ్‌ను చేపడతారు. దేశంలో విద్యుదుత్పత్తికి ఉపయోగపడే కాలువ అన్నింటిలోకి ఇది పెద్దది.

(4) అయిదు "పెన్‌స్టాకు"లను అమర్చేందుకు విద్యుదుత్పత్తికి వినియోగించే కాలువ చివరిలో 60 అడుగుల ఎత్తు, 180 అడుగుల పొడవుగల ఒక "ఇన్‌టేక్ డాము"ను నిర్మిస్తారు. దీనికి 1.8 మిలియన్ ఘనపుటడుగుల రాతిపని అవసరమవుతుంది. పునాదుల త్రవ్వకం దాదాపు పూర్తయింది.

(5) మొదటి దశలో రెండు పెన్‌స్టాక్‌లను నిర్మిస్తారు. ఇవి పై భాగంలో 18 అ.–6 అం.ల వ్యాసం, అడుగు భాగంలో 16 అ–6 అం.ల వ్యాసం కలిగి వుండి సుమారు 1100 అడుగుల పొడవున వుంటాయి. రెండవ దశలో మరో మూడు పెన్‌స్టాకులను నెలకొల్పుతారు. పెన్‌స్టాక్‌ల నిమిత్తం గ్రేడింగ్‌కై 10.65 మిలియన్ ఘనపుటడుగుల మేరకు త్రవ్వకం పనులు అవసరమవుతాయి. రెండవదశ అవసరాలకు అనుకూలంగా వుండేవిధంగా త్రవ్వకాలు జరుపుతారు. గ్రేడింగ్ పనులు దాదాపుపూర్తయ్యాయి. పెన్‌స్టాక్‌లను అమర్చే పనులు త్వరలో చేపడతారు.

మొదటి దశలో పెన్‌స్టాకులకు 2,500 టన్నుల ఉక్కు అవసరమవుతుంది. అమెరికానుంచి సుమారు 800 టన్నుల ఉక్కు లభ్యమైంది. రష్యానుంచి 1100 టన్నుల ఉక్కు సరఫరా జరుగవలసి వున్నది. పెన్‌స్టాకులను ప్రాజెక్టుస్థలం వద్దనే తయారుచేస్తారు. తుంగభద్ర స్టీల్ ప్రొడక్ట్స్ లిమిటెడ్ వారు వీటిని అమర్చుతారు. ఇంత పెద్ద వ్యాసంగల పెన్‌స్టాకులను ప్రాజెక్టు స్థలం వద్దనే తయారు చేయడం ఇదే ప్రథమం. ఇందువల్ల విదేశ మారకం ఖర్చు తగ్గుతుంది. రవాణా ఖర్చులు కూడా కలిసివస్తాయి.

## భారీ విద్యుదుత్పాదక సాధన సామగ్రి

(6) మొదటి దశలో 60,000 కి.వా.ల శక్తిగల 2 యూనిట్లను నెలకొల్పడానికిఅనువుగా 330 అ. × 108 అ., 120 అడుగుల ఎత్తున విద్యుత్కేంద్రాన్ని నిర్మిస్తారు. రెండవ దశలో ఇంతే పరిమాణంగల మరో 3యూనిట్లను నెలకొల్పడానికి అనువుగా ఈ విద్యుత్కేంద్రం నిర్మించబడుతుంది. రాతిపై 0.15 మిలియన్ ఘనపుటడుగులవరకు త్రవ్వకం పని జరుగుతుంది. 25 శాతం పని ముగిసింది.

విద్యుత్కేంద్రానికి అవసరమైన విద్యుచ్ఛక్తి యంత్రం ఖరీదు రూ. 177 లక్షలు. ఈ ప్రాజెక్టులో విదేశమారకం పెద్ద మొత్తంలో అవసరమయ్యేది దీనికే. ఇక్కడి విద్యుదుత్పాదక సాధనసామగ్రి దక్షిణభారత మంతటిలోకి కూడా భారీది.

(7) ఎగువ సీలేరు విద్యుత్కేంద్రం నుంచి విడువబడే నీటిని సీలేరునదికి కొనిపోవడానికి ఒక 'టేల్ రేస్' కాలువను నిర్మిస్తారు. ఇది 3,350 అడుగుల పొడవు, 95 అడుగుల వెడల్పు వుంటుంది. దీని నీటి పరిమాణశక్తి 16,000 క్యూసెక్కులు, 20 మిలియన్ ఘనపుటడుగుల మేరకు త్రవ్వకం పని జరుగుతుంది. సుమారు 50

శాతం పని ముగిసింది. తరువాత విస్తరణ కార్యక్రమం కొనసాగించడానికి సాధ్యం కాదు కాబట్టి మొదటి దశలోనే రెండవ దశ అవసరాలకు యోగ్యంగా వుండే విధంగా టేల్ రేస్ కాలువను నిర్మిస్తారు.

(8) ఈ ప్రాజెక్టునుంచి విద్యుచ్ఛక్తిని ప్రసారం చేయడానికి 120 మైళ్ల హైటెన్షన్ ట్రాన్స్‌మిషన్ సిస్టమ్‌ను ఏర్పరుస్తారు. దీని ఓల్టేజి 220 కి. వా. ఉంటుంది. (రాష్ట్రంలో అవలంబించబడిన సిస్టంలలో కల్లా పెద్దది) ఇది ఎగువ సీలేరు ప్రాజెక్టును కొత్తగూడెం విద్యుత్కేంద్రంతో కలుపుతుంది. ఈ ప్రాజెక్టు అంచనా వ్యయం (మొదటి దశలోనే అమలుపరచబడ గల రెండవదశకు సంబంధించిన పనులతో సహా) రూ. 11.55 కోట్లు.

ప్రాజెక్టు తొలి దశను 1966 నాటికి పూర్తిచేయడానికి తలపెట్టారు. అప్పటికి ఇది 1,20,000 కి. వా. ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయగలుగుతుంది.

## దిగువ సీలేరు ప్రాజెక్టు పనులు

దిగువ సీలేరు ప్రాజెక్టు నిర్మాణానికి అమలు జరిగే ముఖ్యమైన పనులు ఇవి:-

(అ) దొంకరాయివద్ద 200 అడుగుల ఎత్తు,1035 అడుగులపొడవున ఒకరాతి ఆనకట్ట నిర్మిస్తారు. దీనికి కుడిభాగంలో 795 అడుగుల కట్ట వేస్తారు. ఎగువ సీలేరు ప్రాజెక్టు దిగువన, ఆరగాణి ప్రాంతపు సహజసిద్ధమైన నీటి ప్రవాహాన్ని క్రమబద్ధం చేసేందుకై 12 టి. ఎం. సి. నీటి నిలువకొరకు ఈ కట్ట ఉపయోగిస్తుంది. అంతేగాక ఎగువ సీలేరు ప్రాజెక్టు విద్యుత్కేంద్రం విడుదలచేసే నీటిని మళ్ళించడానికి కూడా ఇది ఉపయోగపడుతుంది. ఎడమప్రక్కనగల 'సాడల్'ను 100 అడుగుల ఎత్తు, 2214 అడుగుల పొడవుగల మట్టి కట్ట ద్వారా మూసివేయడానికి ప్రతిపాదించారు. 17.5 మిలియన్ ఘనపు టడుగుల మేరకు రాతిపని, కాంక్రీటు పనులు జరుగుతాయి. 24 మిలియన్ ఘనపుటడుగుల మేరకు మట్టిపని జరుగుతుంది.

(బి) 9½ మైళ్ళ పొడవు, 42 అడుగుల వెడల్పు, 12 అడుగుల లోతు, 4000 క్యూసెక్కుల నీటి పరిమాణంగల ఒక కాలువను (విద్యుదుత్పత్తికి ఉపయోగించేది) నిర్మిస్తారు. 142 మిలియన్ ఘనపు టడుగుల మేరకు మట్టి త్రవ్వకపు పనులు జరుగుతాయి. ఈ కాలువ లైనింగుకు 2.2 మిలియన్ ఘనపుటడుగుల మేరకు కాంక్రీటు పని జరుగుతుంది.

(సి) సరస్సును ఏర్పర్చడానికి లోయకు అడ్డంగా 50 అడుగుల ఎత్తు, 4450 అడుగుల పొడవుగల మట్టి ఆనకట్ట నిర్మిస్తారు. 81 మిలియన్ ఘనపుటడుగుల మేరకు గట్లపై మట్టిపని జరుగుతుంది.

(డి) 1½ మైళ్ళ పొడవున కాంక్రీట్ లైన్ హెడ్ రేస్ కాలువను నిర్మిస్తారు. దీని వెడల్పు 85 అడుగులు, లోతు 25 అడుగులు వుంటుంది. నీటి ఘనపరిమాణం 11,000 క్యూసెక్కులు. 46 మిలియన్ ఘనపుటడుగులవరకు త్రవ్వకాలు జరుగుతాయి.

(ఇ) ప్రథమ దశలో ఒక్కొక్కటి 14 అడుగుల వ్యాసం, 1846 అడుగుల పొడవుగల 3 పెన్‌స్టాక్‌లను నెలకొల్పుతారు. తరువాతి దశలలో మరో 3 పెన్‌స్టాక్‌లను స్థాపించడానికి వీలు కల్పిస్తారు. మొదటి దశలో ఈ పెన్‌స్టాకుల నిర్మాణానికి సుమారు 7120 టన్నుల ఉక్కు అవసరముంటుంది. తరువాతి దశలోకూడా ఇంతే పరిమాణంలో ఉక్కు కావల్సివుంటుంది.

(ఎఫ్) ఒక్కొక్కటి 1,00,000 కి.వాల శక్తిగల 3 యూనిట్లను స్థాపించేందుకై 385 అ × 83 అ ల విద్యుత్కేంద్రాన్ని నిర్మిస్తారు. తరువాతి దశలో ఇంతే శక్తిగల మరో 3 యూనిట్లను నెలకొల్పేందుకు వీలుకల్పించబడుతుంది.

(జి) దిగువ సీలేరు విద్యుత్కేంద్రం విడుదలచేసే నీటిని 'సీలేరునదికి కొనిపోవడానికి 7,200 అడుగుల పొడవున ఒక టేల్ రేస్ కాలువను నిర్మిస్తారు. దీని వెడల్పు 75 అడుగులు, నీటి ఘనపరిమాణం 11,000 క్యూసెక్కులు. 30 మిలియన్ ఘనపుటడుగుల మేరకు త్రవ్వకపు పనులు జరుగుతాయి.

ఈ ప్రాజెక్టు మొదటి దశ పనులకు రూ. 25.3¼ కోట్లు ఖర్చవుతుందని అంచనా.

## జటిలమైన కార్యం

సిలేరు - మాచ్‌ఖండ్ నదీలోయ పర్వతప్రాంతాలతో, దట్టమైన అరణ్యాలతో వున్నందువల్లా, ఈ ప్రాంతంలో జనవాసం లేనందువల్లా ఈ నదీలోయ నుంచి సంక్రమించే ప్రయోజనాలను విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని అభివృద్ధి పరుచుకోవడానికి వినియోగించుకోవడంలో ఇంజనీర్లకు అనేక సమస్యలు ఎదురయ్యాయి.

ప్రాజెక్టులను ప్లానింగ్ నిమిత్తం చేపట్టినప్పుడు ఈ లోయ వనరులకు సంబంధించి చాలా తక్కువ సమాచారం మాత్రమే లభ్యమైంది, లోయలోని వివిధ ప్రదేశాలను ప్రత్యక్షంగా పరిశీలించి వనరులనుగూర్చి తెలుసుకోవలసిందిగా

ఉత్సాహవంతులయిన పెక్కురు ఇంజనీర్లను కోరడంజరిగింది. గూడెం అవల రోడ్డు, రవాణా సౌకర్యాలులేకుండేవి. పరిశోధనకు ఉపక్రమించిన ఇంజనీర్లు కొత్త ప్రదేశంలో మైళ్ళకొలది దూరం నడిచివెళ్ళి సీలేరు నదీతీరంలో వెదురుబొంగులు, గడ్డి గ్రాసంతో తమ శిబిరాలను నిర్మించుకొని నూనెదీపాలు వెలుగించుకోవలసివచ్చింది.

అరగాణి ప్రాంతంలో అనేక స్థలాలలో వర్షపాతం కేంద్రాలను నెలకొల్పవలసి వచ్చింది. కాగా వీటిలో చాలా ప్రదేశాలు దుర్గమమైనవి. ఈ ప్రాంతంలో 13 వర్షపాతం కేంద్రాలను స్థాపించారు. ఈ కేంద్రాలు దుర్గమమైన ప్రదేశాలలో వుండటంచేత వాటిలో ఎక్కువభాగం ఆటోమేటిక్ నమూనా సాధనసామగ్రితోనె పని చేస్తున్నాయి. అనేక స్థలాలలో ఈ నది నీటి కొలతలు తీసుకొని ప్రవాహం పరిమాణాన్ని స్థిరీకరించడం జరిగింది.

నీటి నిలువ పరిమాణాన్ని లెక్కకట్టేందుకు పూర్తి జలాశయం ప్రాంతానికి మ్యాపు రూపొందించడం మరో జటిలమైన కార్యం. ఈ పనిని 'ఏరియల్ ఫొటోగ్రఫీ'ద్వారా సాధించడం జరిగింది. భూమి నాణ్యత విషయమై సరిఅయిన భోగట్టా సేకరించేందుకు ప్రాజెక్టు ప్రాంతంలో సమగ్రంగా సర్వేలు జరిపారు. ఆనకట్ట స్థలాలలో డ్రిల్లింగ్ ద్వారా భూగోళిక పరిశీలనలు సాగించారు.

## నివాస గృహాలు

నిశ్శబ్ద వాతావరణంతో నిర్మానుష్యంగా వుండే ఈ లోయను విభిన్న కార్యకలాపాలు అమలుజరుగుతున్న సందడి ప్రదేశంగా మార్చడానికై నిర్మాణాల ఇంజనీరుకు కార్యరంగం రూపొందించబడింది. జీపులుమాత్రం వెళ్లడానికను వుగావున్న మార్గాలను త్వరలోనే విశాలమైన రోడ్లుగా అభివృద్ధిపరిచారు. ప్రాజెక్టు నిర్మాణాలకు అవసరమైన కార్మికులు, సిబ్బంది వసతికొరకు నివాస గృహాలు మొదలైన వాటిని నిర్మించేందుకు వేల ఎకరాలలోని దట్టమైన అడవులను తొలగించారు. రక్షిత మంచినీటిసరఫరా, మురుగుపారుదల మొదలైన సదుపాయాలు కల్పించారు. కార్మికు లందరినీ కూడా ఇక్కడికి వందలమైళ్ల దూరం నుంచి రప్పించవలసి వచ్చింది.

ఈ ప్రాజెక్టు స్థలాలు అధిక వర్షపాతం కల ప్రాంతంలో వున్నాయి. అందుచేత వర్షాకాలం (జూలై - నవంబరు)లో పని మందకొడిగా సాగుతుంది. కనుక ప్రాజెక్టు పనులు సంవత్సరంలో సుమారు 200 రోజులలోనే ముమ్మరంగా సాగుతాయి.

నిజానికి వేసవిలో నదీ ప్రవాహం సాధారణంగా కొన్నివందల క్యూసెక్కులు మాత్రం వుండాలి. కాని ప్రవాహం ఎగువన మాచ్ ఖండ్ విద్యుత్కేంద్రం నిరంతరాయంగావినియోగంలో వుండటంవల్ల, 2000 క్యూసెక్కులకు మించిన నదీ ప్రవాహాలు నిప్పులుచెరిగే ఎండలు వున్న వేసవిలో కూడా నిర్మాణాల ఇంజనీరుకు ఇబ్బంది కలిగిస్తూ వుంటాయి. నిర్మాణాల ఇంజనీరు ఎల్లప్పుడూ వరదనీటి మళ్ళింపులను అదుపులో పెట్టడంతో సతమతం కావల్సి వుంటుంది. కాఫరు డాములు నిర్మింప జేయవలసివుంటుంది.

మోర్టారు, కాంక్రీటుకు అవసరమైన ఏటి ఇసుక చాలా దూరంలో తక్కువ పరిమాణంలో మాత్రం లభిస్తుంది. అందుచేత ఏటి ఇసుకకు ప్రత్యామ్నాయంగా రాళ్ళు పగులగొట్టి వాటినుంచి భారీ ఎత్తున ఇసుక తయారుచేసి ఉపయోగించవలసివస్తున్నది.

ఈ ఇబ్బందు లన్నింటినీ అధిగమిస్తూ మాచ్ ఖండ్ - సీలేరు నదిని బృహత్ప్రయోజనాలకు వినియోగంలోకి తేవడం జరుగుతున్నది. ఈనాడు మాచ్ ఖండ్ ప్రాజెక్టు వినియోగంలో వుంది. ఎగువ సీలేరు ప్రాజెక్టు నిర్మాణం చాలా అభివృద్ధిదశలో వుంది. పోతే దిగువ సీలేరు ప్రాజెక్టు వినియోగంలోకి తేవడానికి సిద్ధంగా వుంది. ఇంజనీర్లు, సాంకేతిక నిపుణుల దీక్షాసక్తులకు, కార్యదక్షతకు నైపుణ్యానికి చిహ్నాలుగా ఇవి అలరారుతున్నవి.



## గ్రంథసమీక్ష

# చిత్రకళా విచిత్ర రసరేఖల ప్రతిబింబం } "రసరేఖలు"

సమీక్ష

చలసాని ప్రసాదరావు

ఆధునిక భారతీయ చిత్రకళతో సాధారణ పరిచయం ఉన్నవారికి కూడా ఆచార్య అశిత్‌కుమార్ హాల్దార్ పేరు తెలియకుండా ఉండదు! ఆధునిక యుగంలో భారతీయ చిత్రకళా పునరుజ్జీవన కృషిలో విస్మరింప వీలులేని పాత్ర ఆయన కున్నది. ఆయన దేశంలోనూ, విదేశాలలోనూ కూడా మన్నన లందుకున్న చిత్రకారుడు. విశ్వకవి రవీంద్రుని మనుమడు. ఒక దశలో శాంతినికేతన్ లోని కళాభవనానికి ప్రిన్సిపాల్. జయపూర్ మహారాజా స్థాపించిన కళాసంస్థను అభివృద్ధిపరచి ఉన్నతస్థితికి తీసుకువచ్చిన ప్రధానాచార్యుడు. లక్నోలోని ప్రభుత్వ లలితకళల కళాశాలకు ఇరవయ్యేండ్లపాటు ప్రిన్సిపాల్.

కాని, ఇవన్నీ తెలిసినవారికి కూడా ఆయన వంగభాషలో రవీంద్రుని ప్రశంసలను సైతం అందుకున్న ప్రతిభావంతుడైన కవి అనే విషయం తెలియదు.

ఆ ఆచార్యఅశిత్‌కుమార్ హాల్దార్ తాను రచించిన బెంగాలీ కావ్యం "మానస ముకుర్"ను ఒక ఆంధ్రునికి అంకితం చేశాడు. వంగకావ్య మొకటి ఆంధ్రునికి అంకితంచేయబడటంబహుశాఇదేప్రథమం కావచ్చు. ఇది జరిగిన చాలా సంవత్సరాలకు ఆ ఆంధ్రుడు తాను తెలుగులో రచించిన ఒక విలువైనగ్రంథాన్ని అశిత్‌కుమార్ హాల్దార్‌కు అంకితం చేసుకున్నాడు. ఆ ఆంధ్రుడు శ్రీ సంజీవదేవ్. ఆ గ్రంథమే 'రసరేఖలు'

"మానవజీవితం యొక్క ఉత్తమ రూపం సంస్కృతి. సంస్కృతికి ఉత్తమ రూపం లలితకళలు...."

"....నేటి యుగం వైజ్ఞానిక యుగం. ఇది గద్యయుగం. పద్యయుగం కాదు. ఈ యుగంలో రసానుభూతికంటె తర్కబుద్ధికే తావెక్కువ. సౌందర్యంకంటె ఉపయోగానికే విలువెక్కువ. లలిత కళలకంటెపారిశ్రామికకళలకేవ్యాప్తిఅధికం.

"ఇలాంటి వైజ్ఞానికయుగంలో మానవ జీవితం సమగ్ర వికాసం చెందాలంటే లలితకళలకు సక్రమమైన ప్రోత్సాహం లభించాలి. లలితకళలు జీవితంలో ఏ కొన్ని ఘడియలలోనో అనుభవించే ఒక నిషాగా ఉంటే లాభం లేదు. లలితకళలు జీవితంలో ఓ భాగమై జీవితపు ప్రతి చిన్న నీడనీ ప్రదీప్త పరచాలి. యంత్రయుగంలో కళాతంత్రం గనుక లేకపోతే మానవుడొక నిర్జీవ యంత్రంగా తయారైపోతాడు. ఈ నిర్జీవ యాంత్రికత్వం నుండి మానవుణ్ణి రక్షించేది లలితకళలే.

"రసరేఖలు"లోని వ్యాసభాగాలైన ఈ వాక్యాలన్నీ మనమంతానిర్ద్వంద్వంగ అంగీకరిస్తున్నవే. అలాంటి కృషిజరగాలని కోరుకుంటూన్నవాళ్లమే మనమంతా.

కాని, లలితకళల ఉత్తమరూపంగా పేర్కొనబడిన చిత్ర, శిల్పకళల విషయాని కొస్తే ఆంధ్రదేశానికి సంబంధించినంత వరకూ ఇటీవలి కాలంలో ఈ రంగంలో జరగవలసినంతగా కృషి జరగటం లేదనీ, ఈ కళారూపాలింకా అధిక సంఖ్యాకుల అందుబాటులోకి రాలేదనీ అంగీకరించక తప్పదు.

ఇందుకు గల కారణాల్లో ఆయా కళా రూపాలను గురించి విడమర్చి చెప్పి అభిరుచిని, ఆసక్తిని పెంపొందింపజేయగల సాహిత్యం మన తెలుగు భాషలో కొరవడి ఉండటంకూడాముఖ్యమయినదే.

ఇటువంటి దశలో లలితకళలలో ప్రధాన భాగమయిన చిత్ర, శిల్పకళలను గురించి, చిత్రకారులను గురించి, వాటికి అనుబంధమయిన ఇతర విషయాలనూ పరామర్శిస్తూ, పరిచయంచేస్తూ, విశదీకరిస్తూ దాదాపు 45 వ్యాసాలతో, 43 చిత్రాలతో 370 పేజీల గ్రంథం అందమైన ఆకారంలో, ముద్రణలో వెలువడటం కళాభిమానులకు ఒక పెద్ద విందు.

ఈ కోవకు చెందిన గ్రంథాలలో తెలుగులో మొదటిదిగా, విశిష్టమైనదిగా "రసరేఖలు" లెక్కలోకి వస్తుంది. ఈ ఉత్తమ గ్రంథాన్ని ప్రథమంగా సమర్పించిన గౌరవం శ్రీ సంజీవదేవ్ గారికి దక్కుతుంది.

ఆధునిక భారతీయ చిత్రకళా పరిణామగతిని వివరించాలంటే అదేమంత తేలికగా జరిగేదిగాదు. ఆ పరిణామదశలలో విభిన్న రీతులకు కర్తలై, మార్గదర్శకులైన అనేకమంది చిత్రకారుల ప్రసక్తి రాకుండా అలాంటి వివరణ అసాధ్యం.

అలాగే అటువంటివారిని గురించి విని, చదివి, కేవలం వారి చిత్రాల నకళ్లను పత్రికాముఖాన దర్శించి చిత్రకళారంగంలో వారి స్థానాన్ని, స్థాయిని, సృష్టిని అంచనా కట్టబూనుకోవటమూ ఆత్మవంచనే.

భారతీయ చిత్రకళా చరిత్రలో ప్రముఖులైన గగనేంద్రనాథటాగూర్, అవనీంద్రనాథటాగూర్, అమృతా షేర్గిల్, నందలాల్ బోసు, అశిత్ కుమార్ హాల్దార్, నికోలస్ రోరిక్, రహమాన్ చుగతాయ్, చిరేశ్వరసేన్, వంటి అనేకమంది ఈ గ్రంథంలో పరిచయమౌతారు. ఈ విధంగా పరిచయమయ్యే చిత్రకారుల్లో చాలామంది సంజీవదేవ్ గారికి మిత్రులూ, పరిచయస్తులూ అయి ఉండటంవల్ల ఆ యా వ్యక్తులను గురించి, వారి కళాసృష్టిని గురించి అధికారికంగా చెప్పగల పరిశీలన సంజీవదేవ్ గారికున్నట్లు ఆ యా వ్యాసాలలో ప్రత్యక్షమయ్యే నిండుదనం, విపులీకరణలోని సౌలభ్యత స్పష్టం చేస్తాయి.

చిత్రకళకు మూలసూత్రాలు అందరికీ ఒకటే అయినప్పుడు అనేకమంది చిత్రకారుల రీతులను విడమర్చుతూ పాఠకుల ఆసక్తి కుంటువడకుండా చెప్పకురాగలగటం పైకి కనుపించేటంత తేలికేమీ కాదు. కాని, "రసరేఖలు" లోని చిత్రకారుల పరిచయ వ్యాసాలు ఈ ఇబ్బంది ఒకటున్నదనే విషయాన్నే మరిపించ చేసేటంత నిండుదనంతో నడిచాయ్.

జన్మరీత్యా రష్యన్ అయినా భారతదేశంలో స్థిరపడిపోయి కేవలం హిమాలయాలనే చిత్రవస్తువుగా తీసుకుని కొన్ని వందల చిత్రాలు వేసిన నికోలస్ రోరిక్ తన జీవితకాలంలో ఆరువేలకు పైగా చిత్రాల్ని సృష్టించాడంటే ఈ తరం చిత్రకారులు నివ్వెరపోతారు. ఆయన సంజీవదేవ్ గారి మిత్ర కోటిలో ముఖ్యులు. ఆయనతో తనకు గల అనుభవాలను మిశ్రమం చేస్తూ విశ్వవిఖ్యాతి నందిన చిత్రకారుడుగా రోరిక్ ప్రతిభను, ప్రత్యేకతను పదిహేడు పేజీల సుదీర్ఘవ్యాసంలో ఆసక్తిదాయకంగా వర్ణించారు శ్రీ సంజీవదేవ్.

"రోరిక్ చిత్రాలు రంగులను కాక రంగుల కాంతులను కలిగి ఉంటవి. ఒకనాటి ఉదయం రోరిక్ స్టుడియోలో నేనూ, మదాం హెలీనా రోరిక్, నికోలస్ రోరిక్ ముగ్గురం కూర్చుని ఉన్నాం. ఆయన చిత్రాలు మాకు ఎదురుగా ప్రదర్శించబడుతూన్నవి. అసంఖ్యాక రూపాలూ, అనంతమైన రంగులూ కళ్లముందు మారిపోతున్నవి. ఇంతలో "రష్యాలో ఈస్టర్ దీపాలు" అనే చిత్రం వచ్చింది. అది రాగానే స్టుడియోలోని తలుపులు చాలవరకు మూసివేయించారు. ఒకవిధమైన పగటిచీకటి ఏర్పడింది. ఆ సగం చీకటిలో ఆ చిత్రంలోని దీపాలు ఉజ్వలమై, ప్రోజ్వలమై దివ్యకాంతితో వెలుగుతూన్నట్లు గోచరించినవి. అదీ ఆయన వర్ణవిజ్ఞానం; అదీ ఆయన వర్ణకౌశలం; అదీ ఆయన వర్ణసృష్టి".

రోరిక్ ప్రతిభను గురించి ఎన్నో వ్యాసాలు విపులీకరించలేని విషయాన్ని ఈ ఒక్క అనుభవం ఎంతో స్పష్టంగానూ, క్లుప్తంగానూ తెలియజెపుతుంది. ఇలాంటి ఘట్టాలు దాదాపు పరిచయ వ్యాసాలన్నింటా ప్రత్యక్ష మవుతాయ్.

* * *

విశ్వకవి రవీంద్రుని పూజించేవారిలో సైతం ఆయన వేసిన చిత్రాలనుచూసి "ఇవేమిటీ అర్థంపర్థం లేని గీతలూ, రంగులూ" అనే వారున్నారు. మేధావులనబడేవారు సైతం ఈ జాబితాలోకి వస్తారు. కాని,....

"నేడు ఆధునిక చిత్రణ అనే పేరుతో అమలులోనున్న ప్రపంచంలోని నైరూప్య (ABSTRACT) చిత్రకళ ఏనాడో ముప్పయి సంవత్సరాలకు పూర్వమే టాగూర్ రచించిన చిత్రాలలో గోచరిస్తుంది. టాగూర్ చిత్రాల్లోని రూపాలు దృశ్య జగత్తులోని రూపాలుగాక అధో చేతనలో నిద్రాణమైయున్న ఆదిసృష్టిలోని అపూర్వరూపాలు."

"....రవీంద్రుని చిత్రాల్లో అర్థాల కోసం వెదికితే దొరికేవి అపార్థాలు, అనర్థాలు మాత్రమే. ఆ చిత్రాలలో వెదకాల్సింది రేఖల అనుమేళనకోసం, రంగుల సమ్మేళనకోసం. నిజానికి వీటిని వెదకాల్సిన పనిలేదు. వెదకకుండానే వాటంతట అవే ప్రత్యక్షమవుతాయి—రవీంద్ర చిత్రావళిలో."

"రవీంద్ర గీతాల్లో రంగు లుంటవి."

"రవీంద్ర చిత్రాల్లో రాగా లుంటవి."

"టాగోర్ చిత్రావళి శాస్త్రీయం కాకపోవచ్చు. కాని, అవి రసమయం. రంగుల, రేఖల జగత్తులో రవీంద్రుని చిత్రాలు ఓ నూతనానుభూతినీ, ఓ నవరస సృష్టినీ, ఓ లోకోత్తర దృశ్య సంగీతాన్నీ ప్రవేశపెట్టినవి."

ఇటువంటి వాక్యాలు కళాభిమాను ల్లోని అయోమయతను తొలగించి పరిశీలనా దృష్టిని, రసదృష్టిని పెంపొందింప జేస్తాయ్. అందుకే అవి అవశ్యం పఠనీయం.

* * *

సంజీవదేవ్‌గారు అనేక ప్రాంతాలు పర్యటించారు. కులూ లోయలో, హిమాలయాల్లో చాలాకాలం గడిపారు. సుదీర్ఘమైన ఆ పర్యటనల్లో ఎన్నెన్నో అనుభవాలు!

అనుభూతి పొందటం వేరు. దానిని ఆసక్తిదాయకంగా వర్ణించగలగటం వేరు. తానున్న వాతావరణంలో, పరిసరాల్లో తాను పొందిన అనుభూతుల్ని పాఠకులు కూడా మానసికంగా అనుభవించగలిగేట్లు చేయటం అందరికీ సాధ్యమయ్యే పని గాదు.

ఈ గ్రంథంలోని "హిమాలయాల్లో ఒక రోజు" అనే చిన్న వ్యాసం చదివాక అనిపిస్తుంది. ఈ పర్యటనానుభవాలను ఇంకా విపులంగా ఒక గ్రంథంగా నే రచించి ఉంటే ఎంత బాగుండును, అని. అంత ఆసక్తిదాయకంగా ఉన్నాయి ఇందులోని పర్యటనా వ్యాసాలు.

నిజానికి సంజీవదేవ్‌గారెన్నడో అటువంటి గ్రంథం పూర్తిచేశారు! కాని అది వెలుగులోకి రాకముందే వారు దానిని పోగొట్టుకోవటం దురదృష్టకరం.

* * *

"రసరేఖలు"లోని వ్యాసాలు కేవలం ఏ ఒక్క విషయానికో పరిమితమైనవి కావు. కళారంగాలకు సంబంధించిన అనేక విషయాలను పరామర్శిస్తుం దీ గ్రంథం.

భారతీయ చిత్రకళా పునరుజ్జీవనోద్యమానికి శ్రీకారం చుట్టిన అవనీంద్రనాథ టాగోర్, గగనేంద్రనాథటాగోర్‌లతో పాటు అమెరికాలో పుట్టి ఈ దేశానికొచ్చి హిమాలయాల సన్నిధిలో స్థిరపడిపోయిన బ్రూస్టర్ దంపతులూ పరిచయమవుతారు. "గ్రంథ శిల్పుల రూపకల్పన"ను వర్ణించటంతో పాటు "విదేశాల్లో చిత్రకళ" వర్ధిల్లిన తీరునూ సంగ్రహంగానైనా వివరిస్తుంది. "ఏది ఉత్తమ కళ" అనే విషయాన్ని చర్చించటంతో పాటు "శిల్పి - వైజ్ఞానికుడు"ల మధ్య అంతరాన్నీ, సామీప్యతనూ కూడా అంచనా వేస్తుంది. సాధారణ జీవితంలో కూడా ప్రతి ఒక్కరూ "రసదృష్టి"ని కలిగి ఉండవలసిన ఆవశ్యకతను పేర్కొంటూనే వాస్తవిక జగత్తును విస్మరించటంలో గల ప్రమాదాన్నీ సూచిస్తుంది.

స్థూలంగా కళారంగానికి సంబంధించిన అనేకానేక విషయాలపై ఆసక్తిదాయకమూ, అవశ్య పఠనీయమూనైన విషయాలెన్నో ఈ గ్రంథంలో చదువుకుంటాం; చర్చించుకుంటాం. ఈ కోవకు చెందిన వాటిలో ఇదే మొదటి గ్రంథం కావటం మరో విశేషం.

ఇటువంటి ఉత్తమ గ్రంథాన్ని సమర్పించిన సంజీవదేవ్‌గారికి ఆంధ్రకళారంగం ఎంతైనా ఋణపడి యున్నది.

రసరేఖలు. రచన: సంజీవదేవ్. ప్రచురణ: దేశి కవితా మండలి: విజయవాడ-2 వెల రు: 10- ★

---

(82వ పేజీ తరువాయి)

ఫిబ్రవరి 5: భారత ప్రధాన న్యాయమూర్తి కొత్తఢిల్లీలో ఉపరాష్ట్రపతి డా॥ జకిర్ హుస్సేన్ చేత తాత్కాలిక రాష్ట్రపతి బాధ్యతులను స్వీకరింప జేశారు.

ఫిబ్రవరి 6: కేంద్ర మాజీ ఆరోగ్యమంత్రిణి కొత్త ఢిల్లీలో పరమపదించారు.

ఫిబ్రవరి 7: రూ. 399 లు బేసిక్ వేతనంగా గల కేంద్ర ప్రభుత్వోద్యోగుల కరువు భత్యం రూ. 2 మొదలుకొని రూ. 10 వరకు పెంచినట్లూ, ఈ పెంపుదల జనవరి 1, 1963 నుండి అములులోకి వచ్చే టట్టూ ప్రకటించటం జరిగింది.

ఫిబ్రవరి 8: బర్మా విప్లవ సంఘాధ్యక్షుడు కొత్తఢిల్లీకి విచ్చేశారు.

ఫిబ్రవరి 10: పార్లమెంటు బడ్జెటు సమావేశాన్ని ఉపరాష్ట్రపతి ప్రారంభించారు.

ఫిబ్రవరి 11: 1964-65 సం. కాలానికి సంబంధించిన రైల్వే బడ్జెటును పార్లమెంటు ముందు ఉంచడం జరిగింది.

ఫిబ్రవరి 13: ప్రణాళికా సంఘం మాజీ వైస్ చైర్మను శ్రీ వి. టి. కృష్ణమాచారి మద్రాసులో స్వర్గస్థులయ్యారు.

## విదేశాలలో

జనవరి 22: ఉత్తర రొడీషియా తొలి ప్రధానిగా మి॥ కెన్నెత్ కుంద నియమింపబడ్డారు.

జనవరి 27: పెకింగ్‌లో కమ్యూనిస్టు చైనా పరిపాలనను ఫ్రాన్సు గుర్తించింది.

జనవరి 30: పెషావరులోని హరిపూర్ సెంట్రలు జైలు నుండి ఖాన్ అబ్దుల్ గఫర్ ఖాన్ విడుదల చేయబడ్డారు.

దక్షిణ వియత్నాంలో రక్తపాతం లేని విప్లవానంతరం జెనరల్ నయిన్ ఖాన్ అధికారాన్ని హస్తగతం చేసుకున్నారు.

హైదరాబాదులోని లఘు పరిశ్రమల విస్తృతీకృత శిక్షణ సంస్థకు ఫోర్డు ఫౌండేషను 9,48,000 డాలర్లను బహూకరించింది.

ఫిబ్రవరి 3: కాశ్మీరు సమస్యను గురించి చర్చించడానికి పాకిస్థాను అభ్యర్థనపై భద్రతా సంఘం సమావేశమయ్యింది.

ఫిబ్రవరి 9: ఎథోపియన్ సైన్యంతో సంఘర్షణ కారణంగా సోమాలియా అంతటా ఆత్యయికస్థితి ప్రకటించబడింది.

ఫిబ్రవరి 17: కాశ్మీరు సమస్యపై కొంత చర్చ జరిగిన అనంతరం భద్రతా సంఘం కాలనిర్ణయం లేకుండా చర్చను వాయిదా వేసింది. ★

# రచయితలు

శ్రీ నీలం సంజీవరెడ్డి, మాజీ ముఖ్యమంత్రి— హైదరాబాదు.
అమరేంద్ర. శ్రీ సి. నరసింహశాస్త్రి; యం. ఏ., బ్రాడీపేట గుంటూరు.
శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి హైదరాబాదు.
శ్రీమతి కె. దివ్యజ్ఞాన సరోజినీదేవి, అశోకారోడ్డు, న్యూ ఢిల్లీ.
శ్రీ వద్దాది సీతారామాంజనేయ కవి, కోటౌరుట్ల, నరసీపట్నం తాలుకా, విశాఖపట్నం జిల్లా.
శ్రీ జి. ప్రభాకరరెడ్డి, ఆయిల్‌సీడ్స్ స్పెషలిస్టు. వ్యవసాయశాఖ.
శ్రీ తూమాటి దొణప్ప, తెలుగు లెక్చరర్, ఆంధ్ర యూనివర్సిటీ వాల్తేరు.
శ్రీ పి. ఎన్. వి. రావు, రీజినల్ ఆఫీసర్, పంచవర్ష ప్రణాళిక ప్రచారశాఖ, హైద్రాబాదు.
శ్రీ కమ్మిశెట్టి వెంకటేశ్వర రావు, జోషీవాడి, గోషామహల్, హైద్రాబాదు.
శ్రీ క్రోవి రామారావు, డి. పి. ఆర్. ఓ. మహబూబునగరం.
శ్రీ యు. ఆర్. అనంతమూర్తి.........
శ్రీ యస్. వి. ఆర్. శేషగిరిరావు, 4-2-741. రాంకోట్, హైద్రాబాదు.
శ్రీ గుమ్మలూరు సత్యనారాయణ, విద్యానగర్, హైద్రాబాదు
శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, నాగార్జుననగర్, మద్రాసు-24
శ్రీ మైనేని వెంకటరత్నం, సీనియర్ తెలుగుపండిట్, జిల్లాపరిషత్ ఉన్నతపాఠశాల, తుళ్ళూరు. వయా-తాడికొండ, గుంటూరుజిల్లా.
శ్రీ మధిర భానుమూర్తి, ఉపాధ్యాయులు, పరిషత్తు బహుళార్థ సాధక పాఠశాల, తణుకు, పశ్చిమ గోదావరిజిల్లా.
శ్రీ యస్. రామకృష్ణశాస్త్రి - మద్రాసు.
శ్రీ యం. ఎస్. హనుమంతరావు, తెలుగు డిపార్టుమెంటు. యస్. యస్. యన్. కాలేజి, నరసారావుపేట, గుంటూరుజిల్లా.
శ్రీ మహతీ శంకర్, తెలుగు డిపార్టుమెంటు. ఆంధ్ర క్రిష్టియన్ కళాశాల, గుంటూరు.
శ్రీ ద్వారం సాయిప్రకాశరావు.........
శ్రీ వి. శరశ్చంద్రబాబు "చందూ" విద్వత్ తరగతి-శ్రీ వెంకటేశ్వర ఓరియంటల్ కళాశాల, తిరుపతి.
గ్రంథసమీక్ష- శ్రీ చలసాని ప్రసాదరావు. ఫైన్‌ఆర్ట్స్ కాలేజీ- హైదరాబాదు.


ఫోనులో మీకు
టెలిగ్రామ్

Statement about ownership and other particulars about newspaper "Andhra Pradesh" to be published in the first issue every year after the last day of February

## FORM - IV

(See rule 8)

| | |
|---|---|
| 1 Place of publication | Hyderabad |
| 2 Periodicity of the Publication | Monthly |
| * 3 Printer's name | Sri A Sudhakar Rao |
| Nationality | Indian |
| Address | 5-9-88, Public Garden Road, Hyderabad-1 |
| 4 Publisher's Name | Director of Information & Public Relations |
| Nationality | Indian |
| Address | Mukarramjahi Road, Hyderabad |
| 5 Editor's name | Narendra Luther, IAS |
| Nationality | Indian |
| Address | Director of Information & Public Relations, Hyderabad |
| 6 Name and addresses of Individuals who own the newspaper and partners or share-holders holding more than one percent of total Capital | |

I, Narendra Luther, Director of Information & Public Relations of Andhra Pradesh, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief

**Sd/- Narendra Luther**
*Signature of Publisher*

---

* The Director Government Printing Press, Hyderabad-24 is the official printer but he may name any other printer when the Government Press cannot undertake, printing of the Journal

Edited & Published by the Director of Information and Public Relations, Andhra Pradesh, Hyderabad-1
Printed at Yuva Press Public Garden Road, Hyderabad-1

Regd No H 133



వాడు నిన్ను చూశాను ! వ ప

ఏప్రిల్ యువ సంచిక ఉగాదికి ప్రత్యేక కథల సంచికగా ప్రముఖ రచయితల కథలతోనూ, త్రివర్ణ చిత్రాలతోనూ, కార్టూనులతోనూ వెలువడుతుంది

